యువ సాహితి కార్యక్రమాలు నిరాటంకంగా

సాగాలని కాంక్షిస్తూ



అమరావతి గ్రామర్ స్కూల్
సీతాఫల్ మండి

జన్మభూమి కార్యక్రమంలో భాగంగా ఉస్మానియా విశ్వ విద్యాలయ
ప్రాంగణంలో శ్రమదానం చేస్తున్న

**అమరావతి గ్రామర్ స్కూల్ విద్యార్థులు**

# యువసాహితి

(తెలుగుశాఖ విద్యార్థుల సాహిత్య ప్రత్యేక సంచిక)

1996-97

ప్రచురణ

**యువసాహితి**

తెలుగుశాఖ విద్యార్థులు - ఉస్మానియా విశ్వ విద్యాలయం

హైదరాబాదు.

# యువసాహితి

(తెలుగు శాఖ విద్యార్థుల సాహిత్య ప్రత్యేక సంచిక)

1996 - 97.

సంపాదక బృందం

**సి.హెచ్. లక్ష్మణ చక్రవర్తి**

**ఎమ్వీ రమణ**

**కె. మల్లా రెడ్డి**

**పి. స్వరూపా రాణి**

**కె. లావణ్య**

**టి. శైలజ**

ఉపసంపాదకులు

**ఎం. సంపత్కుమార్ రెడ్డి**

**కె.వి. ఉపేందర్ రెడ్డి**

**కె.వి. కృష్ణ వాణి**

**తెలుగు శాఖ విద్యార్థులు**

**ఉస్మానియా విశ్వ విద్యాలయం**

హైదరాబాదు.

**ఆచార్య ఎల్లూరి శివారెడ్డి**
తెలుగు శాఖాధ్యక్షులు,
ఉస్మానియా విశ్వవిద్యాలయం

# ప్రతిభోన్మేషం

విద్యార్థి దశలోనే ప్రతిభాలతలు పరిమళించిన భావసుమాలు ఈ రచనలు. యువ ప్రకృతిలోని భావజ్యోత్స్నలు, భావనాకాశాలు, రససరిత్తులు, ఊహలగరుత్తులు ఉజ్జ్వల చందతాపాలు, ఉద్వేగాల జలపాతాలు ఈ రచనాసంపుటిలో విశ్వ జనీన రూపాన్ని సంతరించుకున్నాయి. ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సంబంధించిన ఆర్ట్స్ కళాశాల, సికింద్రాబాద్ పి.జి. కళాశాల, కోఠి మహిళా కళాశాల విద్యార్థి, విద్యార్థినులు తమ రచనా వ్యాసంగాన్ని ఈ రూపంగా తీర్చిదిద్దుకున్నారు. మూడు కళాశాలల మధ్య సమన్వయాన్ని సాధించుకుని స్వచ్ఛందంగా ఆర్థిక సహకారాన్ని ఆర్జించుకుని నామ మాత్రంగా అధ్యాపకుల సహాయ సహకారాలతో ఈ సత్కార్యాన్ని నెరవేర్చారు. తరగతిగదిలో శబ్దార్థాల మధ్య సమన్వయం మాత్రమే సాధించారు, అనుకున్నాను అంతకన్నా మిన్నగా తమ జీవిత సమన్వయ దృక్పథాన్ని ఇంత సముచితంగా చాటుకుని మమ్మల్ని ఆశ్చర్యపరిచారు. అందుకు ఈ విద్యార్థి బృందాన్ని అభినందిస్తున్నాను. వారి ప్రతిభా వికాసానికి ఆనందిస్తున్నాను. వారి రచనా స్థాయిని ఆమోదిస్తున్నాను.

భాగ్యనగర్ — ఎల్లూరి శివారెడ్డి

1-2-97

ఆచార్య ఎస్వీ రామారావు

ఛైర్మన్, బోర్డ్ ఆఫ్ స్టడీస్

తెలుగు విభాగం,

ఉస్మానియా విశ్వవిద్యాలయం

# అభినందన

ఇది సాహితీ త్రివేణీ సంగమం. మూడు పి.జి కళాశాలల విద్యార్థులు ముచ్చటగా తమ మనసులు విప్పి కలబోసుకున్న భావాల సంకలనం. వీరిలో కవులూవున్నారు. విమర్శకులూ వున్నారు. పరిశోధకులూ వున్నారు. వారిలోవి సృజనాత్మక కళను వెలికిదీసే కవితా రచనలతో పాటు, విమర్శనాశక్తిని సువ్యక్తం చేసే వ్యాసాలు కూడా ఇందులో చోటు చేసుకోవటం ముదావహం. అయితే వీటిని రెండు ప్రత్యేక విభాగాలుగా వింగడించి వుంటే మరింత బాగుండేది. వ్యాసకర్తలలో కొందరు ప్రాచీనాధునిక కవుల సమాలోచన కావించగా, కొందరు ప్రక్రియలు, దృక్పథాలను పరామర్శించారు. కొందరు పాఠ్యాంశాలపై దృష్టిని సారిస్తే, మరికొందరు పాఠ్యేతరాంశాలపై మనసు నిల్పారు. ఇక కవిత్వ రచనలకు వస్తే తరుణ వయసులో తొణికిసలాడే ఊహాపోహలనూ ప్రతిబింబిస్తున్నాయి. సామాజిక వాస్తవికతలకు దర్పణం పడుతున్నాయి.

ఈ సంకలన సంకల్పం హర్షణీయం. ఈ కృషి ఇలాగే కొనసాగుతూ వుండాలని ఆకాంక్షిస్తున్నాను. విద్యార్థి మిత్రులకివే నా అభినందనలు.

భాగ్యనగర్ — ఎస్వీ రామారావు

1-2-97

**డా॥ కసిరెడ్డి వెంకటరెడ్డి**
రీడర్ ఇన్ తెలుగు
హెడ్ డిపార్టుమెంటు ఆఫ్ తెలుగు
యూనివర్సిటీ కాలేజ్ ఫర్ ఉమెన్స్

# బంగారం కొద్దీ సింగారం

ఎక్కడ మనసు
నిరంతరం వికసించే భావాలలోకీ - కార్యాలలోకీ
నీచే నడుపబడుతుందో
ఆస్వేచ్ఛా స్వర్గానికి,
తండ్రీ !
నాదేశాన్ని మేల్కొలుపు."

– అంటారు విశ్వకవి రవీంద్రనాథ టాగూరు "ఎక్కడ మనసు నిర్భయంగా ఉంటుందో" . . . (Where the mind is without fear and the head is held high) అనే తమ కవితలో. సరిగ్గా విశ్వవిద్యాలయ స్నాతకోత్తర "తెలుగు విద్యార్థి" విశ్వకవిపై భావాలకు అనుగుణంగా కనిపిస్తున్నది. ఏ ఒత్తిడి లేకుండా ఈ యువ చిరంజీవులందరూ స్వేచ్ఛాగా పలికారు.. గిరిగీసి ఇది మాత్రమే సాహిత్యం సుమా అని కొంత మంది "సాహిత్య రౌడీలు" నిర్బంధిస్తున్న సందర్భంలో తమ అనుభూతుల్ని కవితల ద్వారా అందించిన ఈయువ సృజనశక్తిని అభినందించక తప్పదు. అనుభూతి నుండి సృజనశక్తి నుండి పుట్టిన ఈ కవితలే గాక, వీరికలాల నుండి సమీక్షాత్మక, వర్ణనాత్మక, విశ్లేషణాత్మక, విమర్శనాత్మక వ్యాసాలూ వెల్వడ్డాయి.

ఆధునిక సాహిత్య ప్రక్రియల్లో చెప్పుకోదగ్గ విభాగాలైన కథానికలు, నాటికలు ఇందులో కనిపించవు. ఈ సంచిక పరిధిలో అవి ఇమడక పోవడమే కారణం కావచ్చు. అంతేగాని యువత సృజనశక్తికీ, విమర్శనాశక్తికి "లోటు" కారణం కాదు. ఎన్నో ఏళ్ల తర్వాత విశ్వవిద్యాలయ విద్యార్థులు చాలా మంచి పని చేశారు. ఈ మధ్య కాలంలో ఒక కళాశాల విద్యార్థులు అవతలివారిని ఒకరిద్దరిని కలుపుకొని కవితా సంకలనాలు వెల్వరించారే తప్ప ఇంత సమగ్రంగా సుందరంగా అవి రాలేదు వాటికీ, ఓ పరిధి ఉంది; ఈ సంచికకూ ఓ పరిధి ఉంది. అయినా స్వేచ్ఛాగళాలకు నిగళాలు లేని ఏక సూత్రతా ఉన్నది. ఆ కారణంగానే ఇలాంటి స్వచ్ఛంద సాహిత్యం వెల్వడే అవకాశం కలుగుతున్నది. "ఇది బంగారం కొద్దీ సింగారం" గా భాసిస్తున్నది. ఈ సంచికకు ఇంతకు మించిన "కితాబు" ఇంకేమున్నది!

ఏ అంశం మీద వ్రాసినా అంతకు ముందే ఎవరో దానిని స్పృశించి ఉంటారనీ మళ్లీ మనం కొత్తగా చెప్పడానికి ఏం మిగిలి ఉంటుందని ఎంత మాత్రం భావించకుండా, ఇలా సొంత గొంతులు విప్పిన ఈయువ సాహితీవేత్తలందరినీ అభినందిస్తూ ఈ సంచికకు స్వాగతం పలుకుతున్నాను. ఈ యువసాహితి ఇలాగే నిలదొక్కుకొని నడుస్తుందని ఆశిస్తున్నాను.

భాగ్యనగర్

31-1-1997.

# మామాట

"చీకటిలోనికి దీపికను తీసుకొని రాగలరు. కాని, ఎవ్వరూ చీకటినే వెలుతురుగా మార్చలేరు. దీపానికి ఎంత చేరువగా రాగలిగితే అంత వెలుతురు లభ్యమౌతుంది". – ముద్దు కృష్ణ

సాహిత్యం సార్వజనీనం. భాష దానికి ఊపిరి. సాహిత్యానికి పరిమితులు లేవు. సృజించని వస్తువూలేదు. ఏ కాలంలోనైనా ఏ వ్యవస్థలో అయినా సాహిత్యం తనకంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని పదిలపరుచుకుంది. సాహిత్యం ప్రత్యక్షంగా ప్రయోజనం చేకూర్చలేక పోయినా అది వ్యవస్థలో పరోక్షంగా మార్పును కల్గిస్తుంది, అవ్యక్తభావాలను అక్షర శస్త్రాలతో సంధించి ఒక రూపకల్పన చేస్తుంది, సశాస్త్రీయంగా శోధిస్తుంది, పాఠకుడిని జాగృతుని చేస్తుంది. అనుభవాల, అనుభూతుల బరువులను మోస్తున్న భావుకుడి హృదయమున అక్షర వర్షం కురిపించి ఆయాసం తీరుస్తుంది. సాహిత్యం ఒక జ్వలనం, సాహిత్యం ఒక చైతన్య కెరటం. ఈ ఉద్దేశ్యంతోనే ఉస్మానియా విశ్వ విద్యాలయం నుండి తెలుగు శాఖ విద్యార్థులు వెలువరిస్తున్న సాహితీ సంచిక "యువ సాహితి". యువత సృజిస్తున్న సాహిత్యం కాబట్టి దీనికి "యువ సాహితి" అని నామకరణం చేయడం జరిగింది.

ఇంతకు ముందు తెలుగు శాఖ నుండి 'శంఖారావం' 'తొలకరి చిత్రాలు' అనే కవితా సంకలనాలు మా పూర్వ విద్యార్థులు వెలువరించారు. అయితే వ్యాసాలు, కవితలతో సంచిక రూపంగా వెలువడుతుండడం ఇదే ప్రప్రథమం ఉస్మానియా విశ్వ విద్యాలయం తెలుగు శాఖ ద్వారా వెలువడుతున్న సాహిత్య సంచిక ముఖ్య ఉద్దేశ్యము విద్యార్థులు సంవత్సరంలో ఒక్కసారి అయినా ఒకే వేదిక మీదికి వచ్చి తమ అనుభవాలను అనుభూతులను తమ తమ రచనల ద్వారా కలుసుకోవాలన్నదే.

ఈ సంచికలోని (విద్యార్థులు పంపిన) రచనలలో ఎక్కువగా ప్రేమ, మానవ జీవితం, క్యాంపస్ జీవితం మొ॥ వారి వారి వ్యక్తి గత అనుభవ సారాన్ని మిళితం చేసుకొని ఉన్నాయి. సామాజిక పరమైన అంశాలు కూడా చోటు చేసుకున్నాయి. ముఖ్యంగా వర్తమాన (ఆధునిక అత్యాధునిక) సాహిత్యాన్ని స్పృశించే ప్రయత్నం కనపడుతుంది. కవిత్వంలో కవిపడే వేదన (అది ఏ రూపంగానైనా కావచ్చు) తాను ఎన్నుకున్న సాహిత్య ప్రక్రియతో పూర్తి సఫలీకృతుడైనాడని చెప్పవచ్చు. వ్యాసాల్లో చాలావరకు ఒక కొత్త దనాన్ని, ఒక కొత్త కోణాన్ని ఆవిష్కరించే ప్రయత్నం చేశారు.

విద్యార్థుల నుండీ సంచికకు మేము ఆశించినంతగా రచనలు రాలేదనే చెప్పాలి. వచ్చిన రచనల వరకు అన్నింటినీ స్వీకరించే ప్రయత్నం చేశాం. ఆయా కళాశాలల విద్యార్థులు తమ భావాలను, ఆలోచనలను, కవిత, వ్యాసాల రూపంలో మాకు అందించిన ఈ రచయిత(త్రు)లే మరింత పరిపక్వతను సంతరించుకునేందుకు, సాహిత్యం సాంఘిక చైతన్యంగా రూపొందేందుకు, సాంఘిక బాధ్యతలను పెంచి జాతి జీవనాన్ని జాగృత పరచి సంఘంలోని చెడును చూసి దిద్దగలిగేదిగా ఆదర్శంగా ఉండే విధంగా భవిష్యత్తులో రచనలు చేయడానికి ఈ సంచిక వాహిక అవుతుందని ఆశిస్తున్నాం. వీలైనంతగా ముద్రారాక్షసాలు లేకుండా ఉండేందుకు ప్రయత్నించాం. ఉంటే అందుకు క్షంతవ్యులము.

మీ

సంపాదక బృందం

# కృతజ్ఞతలు

మా ఈ సాహిత్య జిజ్ఞాసను ప్రయత్నాన్ని విస్తరింప చేయడానికి ఒక ఉద్యమంగా ఒక సంస్థగా రూపొందడానికి తమ సూచనలను, అమూల్యమైన అభిప్రాయాలను, మరియు తమ వంతు బాధ్యతను స్వీకరించి మా వెన్నంటి ఉండి సహాయ సహకారాలు అందించిన అధ్యాపక బృందానికి,

సంచికను గూర్చి తమ అమూల్య అభిప్రాయాలతో బాటు ఆశీస్సులు అందించిన ఆచార్య ఎల్లూరి శివారెడ్డిగారికి, (ఆర్ట్స్ కళాశాల తెలుగు శాఖాధ్యక్షులు) ఆచార్య ఎస్వీ. రామారావు గారికి, (పి.జి కళాశాల తెలుగు శాఖాధ్యక్షులు) డాక్టర్ కసిరెడ్డి వెంకటరెడ్డి గారికి, (మహిళా కళాశాల తెలుగు శాఖాధ్యక్షులు)........

*ముద్రణా భారంలో తమవంతు చేయూతనిచ్చిన*

యువజన సర్వీసుల శాఖ కమీషనర్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారికి

శ్రీ అరోరా డిగ్రీ కళాశాల వారికి,
శ్రీ అమరావతి గ్రామర్ స్కూల్ వారికి,
శ్రీ బాలాజీ ఎజెన్సీస్ వారికి,
శ్రీ న్యూనోబుల్ డిగ్రీ కళాశాల వారికి,
శ్రీ చంద్రశేఖరరావు, సత్యనారాయణ శాస్త్రి గార్లకు
శ్రీ మరాఠీ మహా విద్యాలయ ప్రధానాచార్యుల వారికి
శ్రీ కె. వరదా చార్యులు గారికి,

ముఖ్యంగా ప్రూఫ్ చూడడంలో మాకు సహాయ సహకారాలు అందించిన మా సహాధ్యాయులు మిత్రులు వెల్దండి శ్రీధర్, వెంకటేశ్వర్లు, సురేష్, పరమేశ, కె. రమేష్ గార్లకు, విద్యార్థినీ విద్యార్థులకు, ఇంకా శ్రద్ధతో అతి తక్కువ వ్యవధిలో అందంగా ముద్రించిన సాయిగ్రాఫిక్స్ (హైదరాబాద్) మరియు సిబ్బందికి, అందరికీ మా ధన్యవాదాలు.

మీ

సంపాదక బృందం

# విషయ సూచిక

# 'కల' ల కౌ"గిలి'

యస్. పరమేశ

ఎం.ఏ., ఫైనల్., ఆర్ట్స్ కళాశాల

నేను నా యవ్వనాన్ని తాకట్టు పెట్టాను
ఎం.ఏ., పట్టా కోసం
కుటుంబానికి ప్రాణాధారమైన భూమి 'పట్టా' లాగే
నిజంగానే! నేను నా యవ్వనాన్ని తాకట్టు పెట్టాను
కాలానుగుణంగా కలలు కంటాను
కొంటాను కూడా......
'కళ'ల కళాశాలలో 'కల'లు పారేసుకుని
భవిష్యత్ ప్రాంగణములో వెతుకుతున్నాను
ఈ కలికాలం, ఆకలి కాలం -
కలల కౌగిళ్ళలో కరిగే కాలం -
సర్వీస్ కమీషన్ల ప్రపంచం
కలల కలంలో కన్నీరై నిండుతుంది
నా లోని కలల బీజం
నన్ను కమ్మేసి కలలో నేనయ్యాను
క్యాంపస్‌ఊబిలో గొంతు దాకా కూరుకుపోయి
మునకే ముగింపుగా జారుతున్న వాడిని
ఇది నిరాశా వాదం కాదు
నిషావాదం అంతకంటే కాదు
'నిజ'వాదం
నేను M.A., అయినందుకు గర్వపడడం లేదు
MAN కానందుకు సిగ్గుపడుతున్నాను
ఇప్పుడు
నిజంగా 'నిజం'లో బ్రతకాలనుకుంటున్నాను
చెప్పులైనా కుట్టాలనుకుంటున్నాను......

గ్రా॥ కలిమెర మ॥ కట్టంగూర్, నల్గొండ జిల్లా

# కళారాధన

కె. బాలస్వామి (బాలు)
ఎం.ఏ. ద్వితీయ, పి.జి. కళాశాల

కళా! ఓ కళా!!

నీ కోసం పడే తపన

అంతా ఇంతా కాదు

ఎక్కడో వినీలా కాశపు అంచుల్లో

విహరిస్తావు నీవు

నీ కోసం నేల మీద

పరితపిస్తూ ఉంటాను నేను

నిన్నందు కొని -

నీ లోని సరిగమనై,

నీ గొంతుకు స్వరాన్నై,

నీ వేణువుకు గానాన్నై,

నీ వీణకు నాదాన్నై,

నీ ఊహకు భావాన్నై,

ఒక్క మాటలో....,

సర్వ కళల సమాహారమైన

నీలో జీవించాలనీ,

నిత్యం నిన్నే ఆరాధించాలనీ,

నా ఆరాటం అనునిత్యం

కానీ.....,

నీవేమో ఊహకైనా అందని ఊహా సుందరిలా

నీ కాలి అందియలు ఘల్లు ఘల్లు మంటుండగా

బంగారు లేడిలా పరిగెడుతూ

స్వచ్ఛమైన చిరునవ్వుతో

చూస్తుండ గానే -

రెక్కలు వచ్చి రివ్వుమని

మసక బారిన పొగ మంచు చీకట్లో

కలిసిపోతూ ఉంటావు.

అనునిత్యం నీవో అందని ద్రాక్షవైపోతూ

నన్నో పేదవాడి గానే మిగులుస్తున్నావు

అయినా ......,

అప్పుడప్పుడూ

నా హృదయాన్ని మీటి

నన్ను రంజింప జేస్తూ

మలయమారుతంలా నన్ను తాకి పోతావు

అందుకే.....

నిత్యం నిన్ను

ఆలాపిస్తాను! ఆరాధిస్తాను!

రంగువారి గూడెం (గ్రా॥), మందల పల్లి (పో॥), దమ్మపేట (మం॥), ఖమ్మం(జిల్లా)

# శతకాలు

# మానవతా మూల్యాలకు ఎత్తిన పతాకలు

సుమన

యం.ఏ. ప్రథమ, మహిళా కళాశాల.

సమాజానికి హితాన్ని చేకూర్చేదే సాహిత్యం. కవి, కాలం, సామాజిక స్థితి గతులననుసరించి సాహిత్య సృష్టి జరుగుతుంది. సామాజిక స్థితిని విడిచి చేసిన ఊహాగానం "నేల విడిచిన సామే" అవుతుంది.

కవి, రచయిత సాహిత్య సృష్టికి తనకు నచ్చిన ప్రక్రియను ఎన్నుకొంటాడు. కేవలం కవికి నచ్చడమే కాదు. సమకాలీన పాఠకులకు, శ్రోతలకు కూడా ఆప్రక్రియ నచ్చితే అది అధిక జనాదరణ పొందుతుంది. నన్నయ, శ్రీనాథుల యుగంలో పురాణాలకు, వాని అనువాదాలకు గౌరవం లభిస్తే, రాయల యుగం నాటిక్కి ప్రబంధాల పలుకుబడి పెరిగింది. తంజావూరు నాయక రాజుల హయాంలో యక్షగానాలకు, పలు మన్ననలు లభిస్తే ఆ తర్వాతి కాలంలో వచనం, గేయం, మొదలైన ప్రక్రియలు ప్రాచుర్యం పొందినాయి.

కవి, రచయిత ఏ కాలం వాడైనా -

"అల్పాక్షరముల అనల్పార్థ రచన

కల్పించుటయే కాదె కవి వివేకంబు"

అనే స్ఫూర్తితో, రసగుళికల్లాంటి భావాలతో కూర్చిన సాహిత్య ప్రక్రియే శతకం. సాహిత్య ప్రక్రియలన్నింటిలో శతకానిది ఒక ప్రత్యేకత. శతకంలోని పద్యాలన్నీ ముక్తకాలే. అది "అష్టోత్తరమో (108)". "షోడషోత్తరమో (116)" అయి ఉంటుంది. అన్నింటికీ సమానమైన మకుటం; ఒకే ఛందస్సు. ఈ నియమాల వల్లనే తెలుస్తుంది. శతకానిది సామాజిక సమాన దృష్టి అని. శతకంలో శృంగారం, నీతి, వైరాగ్యం, భక్తి మొదలైన భావాలకు ప్రాధాన్యత ఉన్నా ఈ అన్ని భావాలలో అంతర్గతంగా మనకు గోచరించేది "మానవత్వమే".

మానవత్వం అనే మాట మనిషిని ఎంతో లోతుల్లోకి తీసుకు వెళ్ళి ఆలోచింప చేస్తుంది. మంచిని ఎక్కడున్నా గౌరవంగా చూడటం; చెడు ఎక్కడున్నా ద్వేషించడం,

దాన్ని నిర్మూలించే యత్నం చేయటం; సామరస్య జీవనాన్ని కోరుకోవటం మానవత్వం. ఆయా కాలాల సామాజిక, రాజకీయ పరిస్థితులను ప్రతిబింబిస్తూ ఆయా కాలాల్లో శతకాలు ఎన్నో వచ్చాయి. వీటన్నింటిలోనూ ఆయా కాలాల స్థితి గతులకు కలిగిన కవుల హృదయ స్పందనే కనబడుతుంది.

కం. ఉపకారికి నుపకారము
విపరీతము కాదు సేయ వివరింపంగా
అపకారికి ఉపకారము
నెప మెన్నక చేయువాడె నేర్పరి సుమతీ!

- అంటాడు "సుమతీ శతక' కర్త "బద్దెన భూపాలుడు" లోకంలో మేలు చేసిన వారికి తిరిగి మేలు చేయటం ధర్మం. కానీ మనకు కీడు చేసిన వారికి సైతం మనం మేలు చేయాలని అదే మానవత్వానికి ప్రతీక అని దీని భావం.

"దయానంద సరస్వతి దీన్నే "విషపాన్ - అమృతదాన్" అన్నారు.

ఆంధ్ర దేశంలోని శతకాలన్నింటిలోనూ, వైశాల్యంలోనూ పెద్దది అయిన "వేమన శతకం" వైవిధ్యంలోనూ గొప్పదే. కొన్ని వేల పద్యాలు వేమనవి. అష్టోత్తర, షోడషోత్తర సంఖ్యనుమినహాయిస్తే మిగతా అన్ని లక్షణాలు వేమన పద్యాలకున్నాయి. కాబట్టి ఇది శతకమే. వేమన పద్యాలు మానవత్వానికి మచ్చుతునకలు.

ఆ.వె. చంపదగిన యట్టి శత్రువు తన చేత
చిక్కెనేని కీడు చేయరాదు
పొసగ మేలు చేసి పొమ్మనుటె చాలు
విశ్వదాభిరామ వినుర వేమ

మనకు ఘోరమైన అపకారం చేసిన శత్రువు నిస్సహాయుడై మన చేతిలో చిక్కినా అతనికి మనం కీడు చేయరాదట. పైగా మేలే చేసి పొమ్మనాలట. ఇది మానవత్వం తోడి ఉదారత్వానికి ఉదాహరణ.

ప్రపంచంలోని మానవులంతా ఒకే రకమైన రక్త మాంసాల్ని కల్గి ఉంటారు. అవగాహన లేకపోవటం వల్ల కులం అని; మతం అని; ఎక్కువ కులమని, తక్కువ కులమని భేదాలు కల్పించుకొని చీలి పోతుంటారు. ఇవన్నీ అజ్ఞానం వల్ల కలిగేవే అంటాడు వేమన తన పద్యాల్లో

ఆ.వె. మాల వాని నేల మరిమరి నిందింప
ఒడల నున్న మాంస మొకటి గాదె
వానిలోన వెలుగు వాని కులంబేది
విశ్వదాభిరామ వినురవేమ

మాల వానిలోనూ, మిగతా కులాల వారిలోనూ ఒకే రకమైన రక్త మాంసాలు ఉన్నప్పుడు కులాల పేర చీలిపోవటం అవివేకం అంటాడు వేమన.

అవగాహన లేని కొందరు అస్పృశ్యతని పాటిస్తారు. కలసి తినరు. కలసి మెలసి జీవించరు. ఈ భేదాలు పోవాలంటాడు వేమన.

ఆ.వె. ఉర్వి వారి కెల్ల ఒక్క కంచము బెట్టి
పొత్తు గుడిపి కులము పొలయజేసి
తలను చెయ్యి వెట్టి తగనమ్మ జెప్పరా
విశ్వదాభి రామ వినురవేమ

విశ్వ మానవులందర్నీ ఒకే పంక్తిలో కూర్చో బెట్టి; భోజనం పెట్టి సమానత్వాన్ని చాటి చెప్పాలంటాడు. అందరూ సమానమని ప్రమాణం చెయ్యాలంటాడు వేమన.

సమాజంలోని మానవుల మధ్య విభేదాలు కల్పించేవి ఆర్థిక అసమానతలు. ఒకరు కష్టపడి సంపాదిస్తూ ఉంటే మరొకరు కూర్చొని తినే విధానం సామాజిక సమతౌల్యానికి గండికొడుతుంది. సంపాదనాపరుడు సమాజానికి మేలు చేయాలనే ఉదార గుణాన్ని కల్గి ఉండాలి. లేనిచో వారి సంపాదన కుక్క చంటిలో పాలవలె నిష్ప్రయోజనమౌతుంది. అంటాడు "నరసింహ శతకం" లో "శేషప్ప".

సీ. తల్లి గర్భము నుండి ధనము తేడెవ్వడు
వెళ్ళి పోయెడి నాడు వెంటరాదు;
లక్షాధికారైన లవణమన్నమెగాని
మెరుగు బంగారంబు మ్రింగబోడు
విత్తమార్జన జేసి విర్ర వీగుటె గాని
కూడ బెట్టిన సొమ్ము కుడువ బోడు;
పొందుగా మరుగైన భూమి లోపల వెట్టి
దాన ధర్మము లేక దాచి దాచి

ఆ.వె. తుదకు దొంగల కిత్తురో దొరల కౌనొ
తేనె జుంటీగలియ్యవా తెరవరులకు
భూషణ వికాస శ్రీ ధర్మ పుర నివాస
దుష్ట సంహార నరసింహ దురిత దూర

ప్రకృతిలో ఆలోచనా శక్తి లేని క్రిమికీటకాదులు సైతం పరోపకార బుద్ధితో ప్రవర్తిస్తున్నప్పుడు మానవుడెందు కింత స్వార్థ పరుడైనాడో! తేనెటీగలు పుష్పాల నుండి మకరందాన్ని సేకరించి తమ సొంతానికి వాడుకొనక బాట సారులకు దారి బత్తెంగా సమకూర్చి పెడతాయి. కానీ పరమలోభి అయిన మానవుడు పరులను పీడించి చెడు మార్గాలు అవలంభించి ధనాన్ని సంపాదిస్తాడు. కనీసం తానైనా అనుభవిస్తాడా అంటే అదీ లేదు. నేలలో దాచి పెట్టి ధనాన్ని దుర్వినియోగం చేస్తాడు. అది వాని తెలివి తక్కువే కానీ మానవత్వ విధానం కాదు. తన దగ్గర సంపదలున్న దానికి సార్థక్యం ప్రక్క వారి అవసరాల్లో అది పనికి రావటమే.

చం. ఎడపక దుర్జనుం డొరుల కెంతయు గీడొనరించు గాని యే
యెడలను మేలు సేయడొక యించుక యైనను; జీడపుర్వుతా
జెడదిను నింతె కాక పుడిసెండు జలంబిడి పెంపనేర్చునే
పొడవగుచున్న పుష్ప ఫల భూరుహ మొక్కటినైన భాస్కరా

చీడ పుర్వుగు స్వార్థంతో మొక్కను సమూలంగా నాశనం చేసి తన కడుపు నింపుకుంటుందే కానీ ఒక చేరెడు నీరు పోసి ఎండిపోతున్న మొక్కను బ్రతికించలేదు. ఇది స్వార్థపరులు; శాడిస్టుల ఆలోచనా విధానము. కానీ "పరోపకారార్థం ఇదం శరీరం" - మనిషి అయి పుట్టినందుకు తోటి మనుషులకు వీలైనంత మేలు చేయటమే కర్తవ్యం. అంటాడు కవి "భాస్కర శతకంలో"

నిత్య వ్యవహారంలోని వస్తువులు ఒకటే అయినా వేరు వేరు భాషల్లో వానికి వేరు వేరు పేర్లు పెట్టి పిలుస్తున్నారు. పేర్లు వేరు అయినా అంతస్తత్వం ఒక్కటే అని తెలుసుకోవాలి మానవుడు. అదే నిజమైన మానవత్వం.'

ఆ.వె. కొండ కుధరమన్న కుండ భాండంబన్న
ఉప్పు లవణమన్న ఒక్కటె కదా
భాషలు వేరైనా పరతత్త్వ మొక్కటె
లలిత సుగుణ జాల తెలుగు బాల

"పర్వతాన్ని" తెలుగులో "కొండ" అంటే సంస్కృతంలో "కుధరము" అంటున్నాము. తెలుగులోని "కుండను" సంస్కృతంలో భాండం అంటున్నాము. ఒక వస్తువుకు ఒక భాషలో ఒక పేరైతే; మరొక భాషలో మరొక పేరు అవుతుంది. అంత మాత్రం చేత ఆ వస్తుతత్వంలో మార్పు రావటం లేదు. భాషలు వేర్వేరు అయినా పరతత్వం ఒక్కటి గానే భాసిల్లుతుంది. అట్లే "పసులకు వన్నెలున్నా పాలవన్నెలన్నీ ఒకటైనట్లు" గా మానవుల బాహిర శరీరానికి వన్నెలు ఉన్నా అంత: సౌందర్యమంతా ఒకటై విశ్వ మానవులంతా వసుధైక కుటుంబంగా జీవించాలంటారు - "కరుణ శ్రీ"

ఆ.వె. అణువు చేత జగములభివృద్ధి నందుచు
అణువు చేత జగము లణగి పోవు
అనువు దెలిసి పనుల నాచరించుట మేలు
విమల మతి నెరుంగ వినయరంగ

అంటారు తమ "వినయ రంగ శతకంలో" "నీల కంఠం పాండు రంగం" గారు.

మన ఎదుట పెద్ద పర్వతమున్నా దాన్నిండా నిండినవి పరమాణువులే. పరమాణువు అత్యంత శక్తివంతమైనది. ఆ శక్తివంతమైన పరమాణువును విశ్వ వినాశనానికి, విశ్వ కళ్యాణానికి వాడవచ్చు. మానవతావాది అయిన నరుడు ఉపాయంగా అణుశక్తిని మానవ జీవితావసరాలకే వినియోగిస్తాడే తప్ప విశ్వ వినాశనానికి కాదు. రాక్షస ప్రవృత్తి కలవాడు అణుశక్తిని విశ్వనాశనానికి వాడి తానూ మిడత వలె కాలిపోతాడు. అది ఆలోచన లేని పని.

ఆ.వె. కుల మతంబు లంచు కూర్చుండ ఫలమేమి
మంచి గుణము యౌను మనుజ కలము
పొరుగు తోడ ప్రేమ పొత్తె మతమ్మురా
విమల మతి నెరుంగ వినయ రంగ

కుల మతాల కుచ్ఛితాల అడ్డు గోడలు నిర్మించుకొని మనుషులు చీలి పోతుంటారు. మనిషిలోని మంచి గుణమే వాని కులము. ఇరుగు పొరుగులతో వాని మైత్రీ వ్యవహారం వాని మతం కావాలి. అపుడే వాడు విశ్వ శ్రేష్ఠుడైన నరుడు అవుతాడు.

ఆధునిక కాలంలోనూ అభ్యుదయ భావాలతో కొందరు శతకాలు రాస్తున్నారు. కాలానుగుణంగా విషయాన్ని మలచుకొంటున్నారు.

ఉద్యమాల పేర ఉద్యోగముల పేర
సంఘ సంస్కరణని చదువు మాని
వెంగళి వలె తిరుగు విద్యార్థి యీనాడు
ఆలకించు మయ్యా అంజనేయ

అంటాడు "ఆంజనేయ రాజు" తన "ఆంజనేయ శతకంలో"

ప్రతి పౌరుడు తన వాస్తవ కర్తవ్యాన్ని వదిలి మిగతా ఏవేవో పనులలో పాలు పంచుకొని ప్రముఖుడు కావడానికి ప్రయత్నిస్తుంటాడు. అది సరైంది కాదంటాడు కవి. విద్యార్థి మొట్టమొదటి కర్తవ్యం అధ్యయనం. ఆ తర్వాతిదే ఉద్యమం. తాను విద్యావంతుడై సంస్కరణ శీలుడైనపుడే సంఘాన్ని సంస్కరించ గల్గుతాడు. అంతేగాని తాను వెర్రి వెంగళప్ప వలె వీధుల వెంట తిరిగితే సంస్కరణ రాదు.

ఎవడు జీవకోటి కెగ్గులు సేయక
స్వార్థ చింత మాని సాయ పడునో
అట్టి వాడె ఘనుడు..... అంటాడు కవి

కులమతాల కుళ్ళునలదు కొనిన జాతి
నిలువ లేదు విలువ నిలుప లేదు
కుల మతాల గోడ కూల్రదోసిన మేలు....

అని కుల మతాల పేర వెలసిన సమాజ భవనం మీద కవి ఆవేశంతో విరుచుకు పడతాడు. అంతేకాదు మతం పేర మారణ హోమాలు జరిగి మానవత్వం మంట గలుస్తున్న నేటి సమాజపు తీరును తూర్పార బడతాడు.

---

మతము పేర నెన్నొ మారణహోమాలు

సలుపునట్టి నరుడు సాధువౌనె?

మనిషి చంపువాడు మానవుడే కాడు...... అని వివరిస్తూ మారణ హోమాలు చేసేది మతమే కాదని; ఆ దుష్క్రియలో పాల్గొనేవాడు మానవుడే కాదని, అంటే వాడు పశు సమానుడని తేల్చి చెప్పినాడు కవి.

ఈ విధంగా తెలుగు సాహిత్యంలోని కొన్ని శతకాలను పరిశీలించినపుడు అవి మానవత్వం, సహజీవనం, పరస్పర సహకారం, కుల మత భేద దూషణము, అస్పృశ్యతని పారద్రోలడం, త్యాగ గుణం; అంతా ఒక్కటే అనే సమానత్వాన్ని, కర్తవ్య పరాయణతను చాటి చెప్పేవిగా గోచరిస్తున్నవి. ఈ అన్ని గుణాల్లోనూ అంతర్గతంగా పూలలోదారం లాగా మనకు కనబడుతున్నది మానవత్వం, మమకారం; పరస్పర సహకారం; ఇటువంటి సాహిత్య ప్రక్రియలు మానవాళి మనుగడకు ఎంతో దోహదం చేస్తాయి. జాతి కీర్తి ప్రతిష్ఠలను దశదిశలకు వ్యాపింప చేస్తాయి. అందుకే -

శతకాలు - మానవతా మూల్యాల కెత్తిన పతాకలు

# ఊహా ప్రేయసి

పి. రాజేంద్రప్రసాద్ రెడ్డి
ఎం.ఏ. ప్రథమ, పి.జి. కళాశాల

ప్రియా! నిను చూసిన క్షణం

కలల లోకంలో నన్ను నేను విసిరేసుకున్నాను

మిణుకు మిణుకుమనే ఆశా దీపం

ఇప్పుడిప్పుడు ఆరిపోకుండా వెలుగునిస్తుంది

నీ స్నేహ హస్తంతో!

వెన్నెల తీరాలలో విహరించి

మల్లెల పరిమళాలను మనసు నిండా పూసుకొని

వేదనతో వేగిపోయే నాకు

శ్వాస స్పర్శ కోసం పడే తపన

నీ వీక్షణలో మంచులా కరిగిపోయి

ప్రవాహంలో పారదర్శకం కావాలని .

# అర్హత

కే. లావణ్య
యం.ఏ. ద్వితీయ మహిళా కళాశాల

ఓ భారత మాతా!
ఆలోచించే అంతస్సత్వముంది
ఆచరించే ఆత్మ స్థైర్యముంది
గాయపరచని మనసుంది
గౌరవించే సంస్కారముంది
మలినం లేని మమతానురాగముంది
మౌనంగా ఉండలేని మానవత్వముంది
అవధుల్లేని హృదయోల్లాసముంది
అలవోకగా కదంతొక్కే అంతరంగముంది
గుండెల్లో అగ్ని పర్వతాలు బద్ధలౌతున్నా
ముఖాన చిర్నవ్వు పూసుకు తిరిగే జీవకళుంది
ఇంకా ఏ అర్హత కావాలి తల్లీ!
ఓ జగజ్జననీ! భారత మాతా!!
పాశ్చాత్య సంస్కృతి నీలి నీడలో పయనిస్తూ
కుసంస్కారులౌతున్న నా వాళ్లనుద్ధరించడానికి
గత వైభవపు వేద కాలపు వెలుగులు
వెదలజల్లేలా చేయడానికి,

నిస్వార్థ దేశభక్తి రగుల్గొల్పడానికి,
నిశ్చల జాతీయ భావాన్ని పెళ్ళుబికించడానికి
ఈ, ఖండ భారతాన్ని మరిన్ని ఖండాలుగా
చేయకుండా ఉండడానికి,
అధికార వాంఛలేని వ్యక్తిత్వం గల
ప్రజా సేవకులను దరిజేర్చడానికి
అవినీతి, లంచగొండి తనాన్ని దూరం చేయడానికి,
నిస్వార్థ పరులను, వెలుగు చూడగల్గే వ్యక్తుల నిర్మాణానికి,
ఈ ప్రపంచానికి మళ్ళీ మార్గదర్శకం చేయడానికి
నాలో, నా వాళ్ళలో కావల్సిన అర్హతలు
ప్రసాదించు తల్లీ!!
ఓ లోకమాతా!! భారత మాతా!!!

1-4-48/2/ఎ, కామారెడ్డి టౌన్, నిజామాబాద్.

# అమృతం కురిసిన రాత్రి - మానవతావాదం

కె. సురేష్

ఎం.ఏ. ద్వితీయ ఆర్ట్స్ కళాశాల

ఆధునికాంధ్ర కవితా క్షేత్రంలో వెలసిన ఉజ్జ్వల సాహితీ మూర్తి దేవర కొండ బాలగంగాధర్‌తిలక్. కలల పట్టుకుచ్చులు ధరించి కవితామృత పానం చేసి అజరామరమై నిలిచిన చైతన్య దీప్తి. ఒక ప్రక్క భావ కవిత్వపు శబ్ద సౌందర్యము మరో వంక అభ్యుదయ భావాల మేలు కలయికతో, బహుముఖ కవితా రీతులను ప్రదర్శించిన ఘనాపాటి. వచన కవిత్వంతో శ్రీశ్రీ, నారాయణ బాబు, శిష్టా ఉమామహేశ్వరం మొదలగు వారు తమ అభ్యుదయ కవితా ప్రాభవమును చాటు కొనగా, దాని ప్రాబల్యానికి ఇతోధికంగా కృషి సల్పిన వారు కుందుర్తి అయితే తన సుకుమార సుందర శబ్ద సౌందర్య శైలి ద్వారా వచన కవితకు వన్నె తెచ్చిన వారు తిలక్.

"నా కవిత్వం కాదొక తత్వం
మరి కాదు మీరనే మనస్తత్వం
కాదు ధనిక వాదం, సామ్యవాదం
కాదయ్యా అయోమయం, జరామయం" అంటూ నిత్య నూతనంగా విలసిల్లే తన కవిత్వాన్ని ఇటువంటి ప్రమాణాలతో కాకుండా మానవత్వం అనే దృష్టితో చూడమన్నాడు. కవిత్వాన్ని తన అనుభవసారము నుండి పరిగ్రహించి మానవతా విలువలను నవ కవితా ప్రక్రియ ద్వారా బయలుపరచినాడు.

"కవిత కొత్త అనుభవాల పేటికను తెరవాలి కదిలించాలి" అంటూ - 'ఆధునికత ఉన్నంత మాత్రాన ప్రతిదీ శిరోధార్యము కాదు'అని చెబుతూ అది "అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చెయ్యాలి' అంటారు. ఏదో ఆధునికత ఉండాలని, అస్పష్టపు అనుభూతులను, అర్థం కాని భావాలతో రాసే'కలగా పులగపు వర్ణనలను నిరసించాడు.

1921లో పుట్టిన తిలక్ తన ప్రాథమిక విద్యాభ్యాసాన్ని స్కూల్ ఫైనల్ వరకు తణుకులో పూర్తి చేశాడు. పండిత పెన్మెత్స సత్యనారాయణ రాజుగారు తిలక్‌కు గురువులు. వారి దగ్గరనే ఛందస్సు, వ్యాకరణం నేర్చుకున్నారు. ఛందోబద్ధంగా పద్యాలల్లడం అప్పటి నుండే ప్రారంభమైంది. ఈ విధంగా సంప్రదాయ కవిత్వముతో ఆరంభించిన తన కవితా ఝరిలో ఊర్మిళ, గోరువంకలు, సీత వంటి కావ్యాలు వెలువడినాయి. అలాగే

మద్రాసు లయోలా కాలేజీలో చదువుతున్నప్పుడూ, ఆ తరువాత రాసిన గేయాలు 'ప్రభాతము-సంధ్య' అనే సంకలనంగా ప్రచురించారు. ఇవేవియు ఆయన కవితా ప్రాభవానికి ప్రాచుర్యము తీసుకొని రాలేకపోయాయి. తొలి రోజుల్లో భావ కవులందరి లాగే ఒక ఊహా ప్రేయసిని సృష్టించుకొని ప్రణయ కవిత్వం చెప్పిన వారే. ప్రేమ కవిత్వమును గూడ అందముగా కూర్చినవారే. 'నువ్వు లేవు నీ పాట ఉంది' అను వీరి ప్రేమ గీతం భావ కవిత్వమునకు మచ్చు తునక.

1940 తరువాత భావ కవిత్వపు ఎల్లలను దాటుకుంటూ వచ్చిన అభ్యుదయపు కవితా యుగంలోని కావ్య వస్తువు నిర్దిష్టమైన పరిధిలో కొన్ని అంశాలను మాత్రమే ప్రత్యేకించినట్లు కనబడినా, దాని పరిధిని విస్తృత పరచి సమాజంలోని - మానవ జీవితంలో భాగమయ్యే అన్ని రంగాలకు వ్యాపింపజేయాలనే మార్పు వచనకవితాయుగంలో వచ్చింది. అలా ఆ యుగపు నవ్య కవితా రీతులను గమనించి, రచనా విధానాన్ని మార్చుకొన్న తిలక్, వృత్తాలలో, గేయాలలో కాకుండా వర్తమాన కాలానికి అనుగుణంగా వచన ప్రక్రియ ద్వారా సమకాలీన కవిత చెప్పాలని గ్రహించారు. అన్ని రసాలను వచన కవిత్వం ద్వారా పలికించవచ్చని నిరూపించి సంప్రదాయ వాదుల మెప్పును కూడా పొందారు.

తిలక్‌ను నిజమైన మానవతావాదిగా గుర్తించుటలో ఏటువంటి సందేహం లేదు అమృతము కురిసిన రాత్రి లోని ఖండికలన్ని మానవతావాదానికి చక్కని ఉదాహరణలు ఇందులో కొన్ని ఖండికలలో సున్నితమైన హాస్యము వ్యంగ్యంతో కూడిన హేళన ధ్వనిస్తుంది అలాగే వచన కవిత్వానికి మాధుర్యాన్ని సంతరింపచేశారు.

'ఆర్త గీతం' కావ్య ఖండికలో సమాజములో అణగారిన మనుషుల జీవితాలలోని అగాధాలను, బ్రతుకు భారంతో కృంగిపోతున్న వారి వ్యథను, జనారణ్యములో దిక్కులేని జీవనం గడుపుతూ ఆకలితో అలమటించి అనాదరణకు గురియైన అనాథల గాథను, సంసార సాగరాన్ని ఈదలేక సతమతమవుతున్న మధ్య తరగతి సగటు మానవుని హృదయ ఘోషను తనదైన దృష్టితో చూసి స్పందించి తన కవిత ద్వారా ఆర్తనాదం చేసారు.

"నేను చూశాను నిజంగా ఆకలితో అల్లాడి మర్రి చెట్టు కింద మరణించిన ముసలి వాణ్ణి.

నేను చూశాను నిజంగా నీరంధ్ర వర్షాన వంతెన కింద నిండు చూలాలు
ప్రసవించి మూర్ఛిలిన దృశ్యాన్ని;

సేవను, గుండెలోతును కొలిచి చూడడం ప్రత్యేకంగా తిలక్ దృష్టికే కనబడుతుందేమో! అందుకే

"ఇన్ని యిళ్ళు తిరిగినా
నీ గుండె బరువు దింపుకోవడానికి ఒక గడపలేదు
ఇన్ని కళ్ళు పిలిచినా
ఒక నయనం నీ కోటు దాటి లోపలకు చూడదు

ఉత్తరం యిచ్చి నిర్లిప్తుడి లాగ వెళ్ళిపోయే నిన్ను చూసినపుడు తీరం వదలి సముద్రంలోకి పోతున్న ఏకాకి నౌక చప్పుడు" అని మనిషి కళ్ళలో ప్రతి ఫలించే మూగ బాధని, మనసులోని ఆర్ద్రతని గుర్తించి ఈ కవిత ద్వారా ఆవిష్కరించారు.

ఏ వస్తువు తీసుకున్నా అది సామాజిక అనుభవంలో నుంచి పుట్టి, నిత్య జీవితంలో మనకు అనేక సార్లు తారసపడి మనలను పలకరించేవిగా ఉంటాయి. 'చాలీ చాలని జీతంతో సంసారాన్ని ఈదలేక, ఇంట్లో భార్య నిత్యావసర వస్తువులకై అడిగే ప్రశ్నలకు సమాధానం చెప్పలేక, ఆఫీసులో బండ చాకిరీ చేస్తున్నా అజమాయిషీ చెలాయించే ఆఫీసరు అడుగులకు మడుగులొత్తుతూ, అర్హతకు తగిన అందలానికి చేరుకోలేని తన అదృష్టాన్ని తలచుకొని వగచి, సంఘంతో రాజీ పడలేక నిరంతరము కుమిలిపోతూ, రసహీనమైన జీవితాలు గడుపుతున్న వారి గాథలను 'గొంగళి పురుగులు' కవిత ద్వారా ఆవిష్కరిస్తారు.

ఇన్ని రకాల మనుషులను, ఇన్ని కోణాల నుంచి పరిశీలించి పరిశోధించి, వారిలో తానొకడుగా వారి ఆక్రందనలో, ఆవేదనలో పాలు పంచుకొని, ఆ అనుభూతులను తన కవితల ద్వారా హృద్యంగా వ్యక్తపరచి సహృదయులైన వారి మనసులను కదిలించి వేస్తారు. తదనుగుణంగా ప్రతి స్పందించి సమాజశ్రేయస్సుకై తమవంతు కర్తవ్యాన్ని నిర్వర్తించుటకై నిగూఢంగా ప్రబోధిస్తారు. జనులకు మానవత్వ బోధ చేస్తారు.

మానవ జీవితంలోని 'ప్రాత:కాలము' 'సంధ్య'లను వివరించినా, 'రాత్రి'లోని చీకటులను స్పృశించినా, మండు 'వేసవి' గురించి చెప్పినా వాన కురిపించినా, అమృతంకురిపించినా తనభావం 'వసుధైకగీతం' ఆలపించాలన్నదే తిలక్ కవితా లక్ష్యం.

సమాజంలోని సమకాలీన పరిస్థితులకు అద్దం పట్టే సమస్యలను వెళ్ళడించి వాటి పరిష్కారానికై దైవాన్ని ప్రార్థించినా ఆ దైవమే తన దగ్గరకు వచ్చి, తన సృష్టిలోని

కంపుకొట్టే కాలం కథలను, మానవ వ్యథలను చూసి విలపించి కన్నీరు కార్చినా, ఆ కన్నీటిని తుడిచి ఓదార్చి పంపే ఔదార్యం ఒక తిలక్ హృదయానికి మాత్రమే ఉంది.

మాతృదేశ సంరక్షణకై అహర్నిశలు పాటు పడుతూ శత్రు సైన్యాల కవ్వింపు చర్యలను త్రిప్పికొడుతూ, వానకు, చలికీ వణకుతూ విధి నిర్వహణలో చావో బ్రతుకో తెలియని సైనికుడి బ్రతుకులోని అలజడులను, తన క్షేమ సమాచారములను భార్యా పిల్లలకు తెలుపుతూ సాగే, 'సైనికుడి ఉత్తరం' వెచ్చని గదులలో ఆదమరచి హాయిగా నిదురపోయే ఆత్మలను కలవర పరుస్తుంది. మూసుకుపోయిన మానవతాకవాటాలాను తట్టి మేలు కొలుపుతుంది.

"నిజం ఎక్కడో. అక్కడ నా ప్రాణం వుంది

హృదయం ఎక్కడో అక్కడ ఉదయం ఉంది" అని తన 'కవి వాక్కు'ను ప్రపంచానికి తెలియపరచి, సత్యాన్ని అన్వేషించి, వివేకం లేని ఆవేశం విపత్కర పరిస్థితులకు దారి తీస్తుందని, సంయమనం లేని సౌఖ్యం విషాదానికి కారణమవుతుంది కాబట్టి సాంఘికసమస్యలను సామరస్యపూర్వకంగా పరిష్కరించుకోవాలని, ముఖ్యంగా 'మరచిపోకు అసలువాణ్ణి నీ సోదరుడైన మానవుణ్ణి' అని తోటి మనుషుల పట్ల మానవత్వాన్ని చూపించు, మమత పంచు, సహోదర ప్రేమను కురిపించి స్నేహ వారధిని నిర్మించాలి అనునదియే వారి కవితా పరమార్థం.

తన అందమైన కవిత ద్వారా అభ్యుదయ భావాలను మిళితం చేశారు కాబట్టే.

"నా అక్షరాలు ప్రజాశక్తుల వహించే విజయ ఐరావతాలు నా అక్షరాలు వెన్నెలలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు" అని చెప్పుకున్నారు.

తన స్వచ్ఛమైన భావాలతో ఆధునిక కవితా రంగములో తనదంటూ ఒక ప్రత్యేకమైన శైలి నేర్పరుచుకున్న తిలక్ 1966ల్లో తనువు చాలించారు.

"కొసరు కొంచమైనా వెయ్యని

పిసినారి కోమటి దేవుడు

అసలు తూకంలోనే మోసం చేసి

ఆనందాన్ని, ఆయుఃప్రమాణాన్నీ తగ్గిస్తాడు" అంటూ మానవుని క్షణభంగురమైన జీవితాన్ని ఆవిష్కరిస్తూ, తన అర్థాంతర జీవితానికి సంకేతతను సూచించాడేమో!

ఆ మరణవార్తను జీర్ణించుకోలేని మహాకవి శ్రీశ్రీ

"గాలి మూగదయి పోయింది

పాట బూడిదయి పోయింది

వయస్సు సగం తీరకముందే

అంతరించిన ప్రజాకవి

నభస్సు సగం చేరక ముందే

అస్తమించిన ప్రభారవి

మరి కనిపించడా?" అని ఆక్రోశిస్తూ

అతడు "నవ భావామృత రసధుని

కవితా సతి నొసట నిత్య

రస గంగాధర తిలకం

సమకాలిక సమస్యలకు

స్వచ్ఛ స్ఫాటిక ఫలకం" అని కొనియాడారు.

నిజముగా తన కవితా స్రవంతితో నవనవాలైన ఊహావర్ణార్ణవాల మీద ఉదయించి, నవభావామృతధారలను కురిపించి, సాహితీ ప్రియుల హృదయాలలో నిలిచిపోయిన తిలక్ అమరులు. కవి ఎప్పుడూ అమరుడే అన్న మాట తిలక్ ద్వారా మరోసారి రుజువయింది.

ఇం.నె. 4-11, గ్రా - మంఖాల్, మం-మహేశ్వరం, జి-రంగారెడ్డి

# మానవుడా! స్వార్ధం మానుకో

డి. సూర్య
ఎం.ఎ., ఫైనల్.,
మహిళా కళాశాల

ఓ మానవుడా!
నీ ప్రయాణం ఎటు ?
ఒకసారి తిరిగి చూడు,
నీవు ఎంత దూరం ప్రయాణించావో!
నీ సుదూరం యాత్రలో
ఎంతో సాధించావు;
ఆకాశానికి నిచ్చెన వేసే స్థితికి
చేరావు; కాని ఒక్కసారి....,
ఆలోచించు!
ప్రకృతినే వక్రిస్తూ,
నీ స్వార్థం తీర్చుకుంటూ,
ఇంకెన్నాళ్ళీ అశాస్త్రీయ పోరాటం?
ఇకనైన మేలుకో నీ స్వార్థం మానుకో;
స్వార్థాన్ని మానుకొని
ప్రకృతి సమతుల్యం కాపాడుకో!!

F-19, ఓయు క్యాంపస్, తార్నాక, హైదరాబాదు

# మా పల్లె

కె. రమేశ్
ఎం.ఏ., ఫైనల్., ఆర్ట్స్ కళాశాల

అంతుచిక్కని రూపము
చూడచక్కని హరితము
నదీ కాల్వలేక పోయినా
గర్భజలమే మాకు సన్నిధి
పచ్చని పొలాలకు పెన్నిధి
సాటి వానికి సాయపడితే
మంచి అన్నది పెంచుకుంటే
అంతకన్నా మేలేమి ఉన్నది?
'మాకు' తెలియదు కల్లాకపటం
అమాయకత్వమే 'మాది' తత్వం
ఇరుగు పొరుగును కలసి పోగా
'మా పల్లె' అంతా వెలిగి పోగా
లేదు సాటి 'మా పల్లె' కెందు
ఐకమత్యమే మాకు ప్రాణం
లోకహితమే మాది గానం
భాషాభేదాలను ప్రక్కనెట్టి
పల్లియలన్నీ కట్టకట్టి
'హరిత విప్లవం' సార్థకమైతే
సస్యశ్యామలమ్మే'గోళ'మంతా
పసిడి పంటలే దేశమంతా

గ్రా, పో. సర్వేల్, మం-నారాయణ పూర్, జి. నల్గొండ - 508 253.

# తెలుగు సాహిత్యం - శైవమత ప్రభావం!

వెలుదండ వేంకటేశ్వర రావు
ఎం.ఏ. ప్రథమ, పి.జి. కళాశాల

తెలుగు సాహిత్యంపై శైవ మత ప్రభావం మిక్కుటంగా కన్పిస్తుంది. శాస్త్రీయంగా చూస్తే శైవం అనేది ఒక మతం కాదు. హిందూ మతంలోని ఒక శాఖ. హిందూ మతంలో ప్రధానంగా రెండు శాఖలు కన్పిస్తాయి. 1) శైవం, 2) వైష్ణవం. శివున్ని కొలిచే వారిని శైవులు, విష్ణువును కొలిచేవారిని వైష్ణవులు అంటారు. శృతిమించిన శివభక్తి గల వారిని వీరశైవులంటారు. తెలుగు సాహిత్యంపై శైవ మత ప్రభావం ఎంతగా ఉందంటే సాహిత్యంలో 'శివ కవి యుగ'మనే ఒక యుగాన్నే సృష్టించింది. కేవలం హిందూ మతంలో ఒక శాఖగా అవతరించి కాలక్రమేణ ప్రజల్లో ఒక స్వతంత్ర మతంగా శైవం ముద్ర వేసుకుంది.

నన్నయ తర్వాత దాదాపు 200 సంవత్సరాలు శివకవులు తెలుగు శారదను వశపర్చుకొని, సాహిత్యంలో తమ ప్రత్యేకతను నిల్పుకున్నారు. బసవేశ్వరుడు కన్నడ దేశం నుండి వీరశైవ సిద్ధాంతాన్ని లోకానికి చాటారు. అదే సమయంలో దక్షిణ దేశంలో శ్రీ రామానుజుడు వైష్ణవ సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. ఈ రెండు సిద్ధాంతాలు హిందూ మతంలోని కుల భేదాలను రూపుమాపి సమ సమాజ స్థాపనకు కృషి చేశాయి. కాని అంతకంటే ప్రమాదకరమైన మత భేదాల సృష్టికి ఆ పరిణామం తావిచ్చింది. శైవులు, వైష్ణవులు ఎవరికి వారు తమ సిద్ధాంతమే గొప్పదని, అవతలి పక్షాన్ని హీనంగా చూశారు. తత్ఫలితంగా శైవ, వైష్ణవాల మధ్య కలతలు చెలరేగి దేశం రక్త పాతమైంది.

రెండవ వెలనాటి చోళుని సభలో బౌద్ధ పండితునికి, మల్లికార్జున పండితారాధ్యునికి తీవ్ర వాగ్వివాదం జరిగి, దూషణ ప్రతిదూషణలతో సభ అంతమైంది. పండితారాధ్యుని శిష్యులు బౌద్ధ పండితుడు తమ గురువును నిందించాడన్న అక్కసుతో ఆ రోజు అర్థరాత్రివేళ బౌద్ధమత గురువును దారుణంగా హత్య చేసినట్లు చరిత్ర మనకు చెబుతోంది. అదే సమయంలో కన్నడ దేశంలో బసవయ్య తన మత సిద్ధాంతాన్ని వ్యతిరేకించినందుకు, బిజ్జలుని ఆ స్థానంలో వుంటూ తన రాజునే దారుణంగా హత్య చేసి వీరశైవ మత ప్రచారానికి పూనుకున్నాడు. బౌద్ధ మత గురువును చంపినందుకు వెలనాటి చోళుడు మల్లికార్జున పండితారాధ్యునికళ్ళు ఊడ బెరికించాడు.

హనుమకొండలో చరిత్ర ప్రసిద్ధమైన పద్మాక్షి దేవాలయం జైనులది. రెండవ ప్రోలరాజు కాలంలోనో, ఆ తర్వాత కాలంలోనో అది శైవాలయంగా మారిపోయింది. విశ్వేశ్వర శంభువు అను మతాచార్యుడు కాకతీయ సామ్రాజ్యాన్ని ఏలిన గణపతి దేవునకు గురువు. ఈ విధంగా శైవ, వైష్ణవాలు ప్రజల్లో కలవరం సృష్టించి మత భేదాలకు కారణమయ్యాయి. అదే శైవ ప్రభావం సాహిత్యంలో కూడా కన్పించింది.

'శివకవి యుగం' (12, 13 శతాబ్దాలు)లో చాలా మంది కవులున్నా 'శైవ కవిత్రయం'గా ప్రసిద్ధి చెంది పేర్కొదగిన ముగ్గురు కవులు- 1) నన్నె చోడుడు 2) మల్లికార్జున పండితారాధ్యుడు 3) పాల్కురికి సోమనాథుడు, అనువారు.

ఈ కాలంలోని కవులందరూ సాహిత్యాన్ని మత ప్రచారం కొరకు వాడుకున్నారు. ఈ కాలంలో శైవ మత సంబంధ కావ్యాలే విరివిగా వచ్చాయి. భాషలోను, ఛందస్సులోను, భావంలోను శివ కవులు కొత్తదనాన్ని సృష్టించి తమ ప్రత్యేకతను నిలుపుకున్నారు. శివుని కంటే, శివభక్తులే గొప్పవారని వీరి సిద్ధాంతం.

**1) నన్నె చోడుడు** : 12వ శతాబ్దం ప్రారంభంలోనే ఇతడు 'కుమార సంభవమనే' 12 ఆశ్వాసాల స్వతంత్ర ప్రబంధాన్ని వ్రాసి తెలుగు సరస్వతికి సమర్పించాడు. శివకవి యుగంలో మొదటి వాడైన ఇతడు శైవుడే కానీ అపారమైన శివభక్తి గలవాడు. దేవతలందరి కంటే శివుడొక్కడే మహానుభావుడని నమ్మేవాడు. శివ కవులు లక్షణాలలో దేశికవిత ప్రధానమైనది. దీనిని నన్నె చోడుడు అపారంగా అభిమానించాడు. తన గురువైన జంగమ మల్లికార్జునుని మహేశ్వరునిగా భావించి అతనికే తన కావ్యాన్ని అంకితమిచ్చాడు. "కుక్క దొంతరులు పడదోయగలదు గాని పేర్చలేదు గదా" అనే లోకోక్తి ద్వారా కుకవులను తన కావ్యంలో దూషించాడు. నన్నె చోడుడు మొట్ట మొదటి సారి జాను తెనుగు, వస్తు కవిత అనే రెండు అంశాలను తన కావ్య పీఠికలో తెలియజేసాడు. "అరువది నాల్గు విద్యలలో నేర్పు నైసర్గికమై వాలిన సుకవులకు" అన్న మాటల ద్వారా కవి అయినవాడికి సర్వ శాస్త్రాలు కరతలామలకాలు కావలసిందే అని పరోక్షంగా సూచించాడు. తెలుగు సాహిత్యంలో దేశి కవిత్వాన్ని చొప్పించి, తిక్కన వంటి మహా కవులకు మార్గదర్శి అయిన ఇతని ప్రతిభ అసామాన్యం, అనితరసాధ్యం.

**2) మల్లికార్జున పండితారాధ్యుడు** : ఇతను క్రీ.శ. 1100-1170 మధ్య కాలంలో జీవించినట్లు తెలుస్తోంది. జన్మ స్థలం తూర్పు గోదావరి జిల్లా దాక్షారామం. బసవేశ్వరునికి సమకాలికుడు. ఇతడు ప్రమథుల అవతారమని, శివునితో, సమానమైన శక్తి గలవాడని

వీరశైవుల నమ్మకం. శృతులు, స్మృతులు, పురాణాలను శైవ పరంగా వ్యాఖ్యానం చేసిన గొప్ప పండితుడు. ఇతడు రాసిన 'శివతత్వసారము' అనే గ్రంథం నేడు తెలుగు సాహిత్యంలో విలక్షణ ప్రక్రియగా భావిస్తున్న శతక సాహిత్యానికి పునాది అయి తొలి తెలుగు శతకంగా ప్రసిద్ధి కెక్కింది. దీనిని పండితారాధ్యుడు సరళమైన శైలిలో రాసాడు. ఇక్కడ తొలి తెలుగు శతకం కూడా శైవ మత సంబంధమైనదే కావడం గమనించదగ్గ విషయం ఇందులో పరమతాలైన బౌద్ధ, జైన, అద్వైతాది మతాలు నిర్దాక్షిణ్యంగా ఖండింపబడి శైవమత ప్రాశస్త్యం, శివభక్తుల గొప్పతనం, వారి మహిమలు వర్ణించబడ్డాయి. ఇతనే 'మల్లికార్జున శతకము' కూడా రాసినట్లు తెలుస్తోంది. కాని ప్రస్తుతం అది అలభ్యం. శైవ సాహిత్యానికి పండితారాధ్యుడు బ్రహ్మ వంటివాడు. శివతత్త్వ సారంలోని పద్యాలన్నీ కంద పద్యాలే "శివ నింద చేసే పాపులను ఆలోచనకు తావు లేకుండా చంపివేయాలి' ' "శివ నింద చేసే గ్రంథాలను తగల బెట్టాలి" "శివభక్తులు చేసిన పాపమైనా పుణ్యమే అవు తుంది" వంటి ఎన్నో విద్వేషకరమైన మత భావాలను ఇతడుప్రచారం చేశాడు. ఈ భావాలే శైవాన్ని వీరశైవంగా మార్చి వేశాయి. మల్లికార్జున పండితారాధ్యుడు అవసాన దశను శ్రీశైల మహాక్షేత్రంలో గడిపినట్లు తెలుస్తోంది.

**3) పాల్కురికి సోమనాథుడు :** శైవ సంబంధ సాహిత్యానికి పండితారాధ్యుడు బ్రహ్మ వంటి వాడైతే, పాల్కురికి సోమనాథుడు విష్ణువు వంటివాడు. పాల్కురికి సోమనాథుడు 13వ శతాబ్దానికి చెందినవాడు. వరంగల్లు జిల్లా జనగామ సమీపంలోని 'పాలకుర్తి' గ్రామం ఇతని జన్మ స్థానం శివకవి సమూహానికి, వీరశైవ సిద్ధాంతాలకు కూడా గురుపీఠం అని చెప్పదగిన వాడు పాల్కురికి సోమనాథుడు. పాల్కురికి సోమనాథుని కవిత మొదట వృత్త రచనతో, నన్నయ శైలిని అనుకరిస్తూవచ్చి చివరకు దేశి సంప్రదాయాను గుణంగా ద్విపదతో జానుతెనుగుగా పరిణమించింది. సాహిత్యాన్ని సోమనాథుడు మత ప్రచార సాధనంగా వాడుకున్నాడు. పాల్కురికిసోమనాథుడు దేశి కవితా ప్రవక్త. భాషలో, భావంలో, ఛందస్సులో ఇతడు తత్పూర్వ ధోరణులను కాదని విప్లవాన్ని సాధించాడు.

పాల్కురికి సోమనాథుని గ్రంథాలు ఎన్నో వున్నాయి. వాటిలో అనుభవ సారము, చతుర్వేదసారము, సోమనాథ భాష్యము, వృషాధిప శతకం, బసవ పురాణం, పండితారాధ్య చరిత్ర మొదలైనవి ప్రసిద్ధాలు. ఇవన్నీ కూడా శైవమత సంబంధమైనవే కావడం ఇక్కడ గమనించ దగ్గ విషయం. ఇతనికి కవిత్వం కన్నా మతమే ప్రధానమైన అంశం తెలుగులో

తొలి శతకం 'శివతత్త్వ సారమే' అయినప్పటికీ మకుట లక్షణాలను కూడా సంతరించుకున్న సమగ్ర శతకం 'వృషాధిప శతకం.'

చం. "బలుపొడ తోలుసీర మునుపాప సలుల్ గిలుపాడుకన్నువె
న్నెలతలచేదు క్రుత్తుకమున్ నిండిన వేలుపుటూరున వల్గుపూ
సలు గలరేనిలెంకవని జానుతెనుంగున సన్నుతించెదన్
వలపు మదిం దలింప బసవా బసవా బసవా వృషాధిపా"

వృషాధిప శతకంలోని పై పద్యంలో అసలు దేశి కవిత అంటే ఏమిటో నిర్వచనమిచ్చాడు సోమనాథుడు. ఇది శివస్తుతి. వృషాధిప శతకం శివస్తుతి శతకం. వీనికి బసవేశ్వరుడు, నందీశ్వరుడు, వృషాధిపుడు అన్న పేర్లున్నాయి. సోమన సాంఘిక, సమకాలీన, దేశీయ ఇతివృత్తాలను స్వీకరించాడు. బసవన్న కథ, పండితారాధ్యుని కథ సమకాలీనాలు. ఛందస్సులో ద్విపద అనే కొత్త మార్గాన్ని అవలంబించి 'పండితారాధ్య చరిత్ర' అనే గ్రంథాన్ని రాసి తెలుగులో తొలి ద్విపద కావ్యకర్త అయ్యాడు. ద్విపద తర్వాత సోమన దేశి ఛందస్సు అయిన రగడను కూడా ఆదరించాడు.

పాల్కురికి సోమనాథుని తర్వాత పేర్కొనదగిన వారు పిడపర్తి కవులు.పిడపర్తి బసవన క్రీ.శ. 1475-1500 మధ్య కాలంలో 'పిల్ల నయనారు కథ' (అలభ్యము), బ్రహ్మోత్తర ఖండము, వీరశైవ దీక్షా బోధ అనే మూడు గ్రంథాలు ద్విపదలో రాసారు. బ్రహ్మోత్తర ఖండము స్కాంద పురాణాంతర్గత ఖండాలలో ఒకటి 'వీర శైవ దీక్షా బోధ' కన్నడ భాషలో కెరయ పద్మరసు అనే కవి రగడలలో రచించిన 'దీక్షా బోధమ'ను గ్రంథానికి తెలుగు అనువాదం.

పిడపర్తి బసవని పెద్ద కొడుకు పిడపర్తి సోమనాథుడు పాల్కురికి సోమనాథుని ద్విపద బసవ పురాణమును పద్య రూపంగా వ్రాసి అతనికే కృతి యిచ్చాడు. పిడపర్తి సోమనాథుని ద్వితీయ కృతి "ప్రభులింగ లీలలు" ఇది కూడా శైవ సంబంధమే.

ఈ విధంగా శివ కవి యుగంలోనే కాదు, శివకవి యుగం తర్వాత నేటి ఆధునిక కవుల వరకు కూడా శైవం ఎంతో కొంత ప్రభావాన్ని చూపుతూనే ఉంది. శైవ, వైష్ణవాల మధ్య మత భేదాలు పొడసూపి రక్తపాతానికి దారి తీయడం వల్లనే ఆ రెండు మతాల మధ్య సామరస్యాన్ని కలిగించాలన్న సదుద్దేశ్యంతో శివ, కేశవులకు భేదం లేదని లోకానికి చాటి - హరిహరనాథుని సృష్టించి - తన కావ్యాన్ని కూడా తిక్కన అతనికే అంకితమిచ్చాడు. తిక్కన ఆంధ్ర మహాభారత రచనకు కూడా ప్రధాన కారణం శైవ, వైష్ణవ మతాల మధ్య

ఏభేదాలను పరిష్కరించడానికేనని తెలుస్తోంది. అందుకే భారతాన్ని హరి హరనాథునకు అంకితమిచ్చాడు.

నన్నయ అర్థాంతరంగా వదలి పెట్టిన ఆంధ్ర మహా భారత రచనను కొనసాగించే సామర్థ్యం, పాండిత్యం పాల్కురికి సోమనాథునిలో ఉండి కూడా ఆంధ్ర మహా భారత రచనకు పూనుకోలేదని తెలుస్తోంది. దీనికి కారణం మహా భారతం విష్ణు సంబంధిత కథ కావడమే. తత్ఫలితంగా ఆంధ్ర మహా భారత రచన తిక్కన సాహిత్య రంగం మీదికి వచ్చే దాకా అనగా దాదాపు 200 సంవత్సరాలు ఆగిపోయింది.

14వ శతాబ్దిలో వచ్చిన శ్రీనాథునిపై శైవ మత ప్రభావం కన్పిస్తుంది. ఆయన రచనలైన హరవిలాసం, భీమేశ్వర పురాణం, కాశీఖండం, శివరాత్రి మహాత్మ్యము వంటివి శైవ సంబంధిత గ్రంథాలే కావడాన్ని ప్రత్యేకంగా పేర్కొనాలి. శ్రీనాథుని చాటువుల్లో కూడా శైవ ప్రభావం కనిపిస్తుంది.

"సిరిగల వానికి చెల్లును తరణుల
పదియాఱు వేల దగపెండ్లాడన్
తిరిపెమున కిద్దరాండ్రా పరమేశా!
గంగ విడుము పార్వతి చాలున్"

శ్రీ నాథుడు రాయలసీమలో తిరుగుతూ దాహం వేసి శివునిపై చాటువు చెప్పాడు.

క్రీ.శ. 1420 -1480 మధ్య కాలంలో జీవించిన పోతనపై కూడా శైవ మత ప్రభావమే ఆయనను 'వీరభద్ర విజయము' రచనకు పురిగొలిపింది. 13వ శతాబ్దివాడైన మారన వ్రాసిన 'మార్కండేయ పురాణం' సైతం శైవ సంబంధమే. 12, 13, 14 శతాబ్దాల్లో ఎన్నో విష్ణు సంబంధిత రచనలు కూడా వచ్చాయి. కాని శైవ మత ప్రభంజనంలో అవి నిలదొక్కుకో లేకపోయాయి.

ప్రబంధ యుగాన్ని సైతం శైవ మత ప్రభావం విడిచి పెట్టలేదు. ఈ యుగంలో కూడా శైవ సంబంధిత కావ్యాలు వచ్చాయి. అష్ట దిగ్గజ కవుల్లో ఒకడైన ధూర్జటి శివభక్తుడు. ఇతను 'శ్రీకాళహస్తి మహాత్మ్యము'; 'శ్రీ కాళ హస్తీశ్వర శతకము' అనే రెండు ప్రసిద్ధ శైవ సంబంధిత కావ్యాలు రాసాడు. ఆధునిక యుగంలో పద్యం రాసేవారు తగ్గిపోయారు. పద్య సాహిత్యంలో వచ్చినన్ని శైవ కావ్యాలు గద్య సాహిత్యంలో రాలేదని చెప్పవచ్చు. ఆధునిక యుగంలో కామినేని యల్లారెడ్డి అనే కవి 'శివధర్మోత్తరము' అనే

గ్రంథాన్ని రాసాడు. శివుని గూర్చే కాక, శైవ భక్తులను గూర్చి రచించిన గ్రంథాలు కూడా శైవ వాఙ్మయంలో చేరుతున్నాయి. ఆధునిక యుగంలో నవల ప్రధాన పాత్రను పోషిస్తోంది. 'చారిత్రక నవలా చక్రవర్తి'గా బిరుదు వహించిన ఆచార్య ముదిగొండ శివ ప్రసాద్ గారు. కళ్యాణి చాళుక్య రాజైన బిజ్జలుని వద్ద మంత్రిగా పనిచేసి వీరశైవ మతాన్ని ఝంఝా మారుతంలా వ్యాపింప చేసిన బసవేశ్వరుని జీవిత చరిత్రను 'అనుభవమంటపం' పేర నవలగా మలిచారు. వీరే 'బసవ గీత' అనే శైవ సంబంధ రచనను అనువదించారు.

నోరి నరసింహశాస్త్రి 'ధూర్జటి' అనే చారిత్రక నవలను వ్రాసాడు. 'ధూర్జటి' శివభక్తుడు. కనుక ఇది కూడా శైవ సంబంధమైనది గానే పరిగణించాలి.

ఈ విధంగా శైవ సంబంధ సాహిత్యం కూడా విశాలమైనదే. పురాణ మహాత్మ్యాలు, ప్రబంధ నాటకాలు, చరిత్రలు, కథలు, శతకాలు, నవలలు, యక్షగానాలు, దండకాలు, గేయాలు, వచనాలు మొదలైన ప్రక్రియలు ఎన్నో శైవ సాహిత్యంలో కన్పిస్తాయి. పుట్టపర్తి నారాయణాచార్యుల 'శివతాండవం' కావ్యం శైవ సంబంధమే.

శివ కవి యుగంలో ప్రారంభమైన శైవ మత ప్రభావం ఆధునిక రచయితలను కూడా విడిచిపెట్టలేదు సరికదా అంతకంతకూ పెరుగుతోంది. అయితే ఒక రకంగా చూస్తే శివకవి యుగంలో శైవానికి ఉన్న ఉధృతి మిగతా యుగాలలో లేదనే చెప్పవచ్చు.

# "మిగిలిన విషాదం

జె. శ్రీనివాస్
ఎం.ఎ. ప్రథమ, ఆర్ట్స్ కళాశాల

తమను కాపాడమంటున్నాయి
మిగిలిన జీవచ్ఛవాల్ని కదిలిస్తే
లోతైన కళ్ళ లోంచి కారే కన్నీళ్ళు
వాళ్ళ కష్టాన్ని మౌనంగా చెబుతున్నాయి
నేల రాలిన చెట్లు  కూలిన ఇండ్లు.
వెతుకు తున్నారు
ఆకాశంలోకి చూస్తూ
రాలే ఆహారము గూర్చి.
కడుపు చేత్తో పట్టుకుని నిలబడ్డారు
తమ ఇళ్ళ ఆనవాళ్ళ కోసం
బ్రతుకు బజారున పడకుండా నీడ కోసం.
చేతులు చాస్తున్నారు
క్లాత్ షోరూంలో అద్దాల మధ్య బట్టల్ని
బేరం చేయలేక
ఒళ్ళు దాచుకోడానికి బట్ట ముక్క కోసం.
ఎదురు చూస్తున్నారు
నష్టాల గణాంకాల కోసం గాక
పూట గడిపేందుకు నాలుగు మెతుకుల కోసం.
సమాధానం కోసం ఎదురు చూస్తున్నారు
కడుపు నింపుకోడానికి నివసించాలో
బ్రతుకు మీద ఆశతో ఇల్లు వాకిలి వదిలి
తాము పుట్టిన నేల ఒడిని
కాదని వలస వెళ్ళాలో తెలియక....

గ్రా బరిచెప్యాల, మం॥ సిద్ధిపేట, జి. మెదక్

# స్వతంత్ర స్వాతంత్ర్యాల మధ్య

## (గొలుసు కవిత)

స్వామి సునీల్, శ్రీను, బాబు, బ్రహ్మ

ఎం.ఏ. ప్రథమ, పి.జి. కళాశాల

మరణిస్తూ వెలుగునిచ్చే ప్రమిదను,
ఆశలను త్యజించి
మేలుకొలిపే అభ్యుదయ భ్రమరాల
ఆర్భాటాల మీద విదిలించిన
భావ ప్రభావత రేఖ
నా గుండె కిరణమై
ప్రభవించే ప్రస్తుత ప్రపంచంపై
స్వాతంత్ర్యాలు అందరికీ
స్వతంత్రాలు కొందరికే అవుతూ
స్వేచ్ఛగా వాడిపోతున్నది మానవ ధర్మం.
అయినా నిరంతరం
పయనించే నివురు గప్పిన నిప్పు రవ్వ
మొలకెత్తక మానుతుందా?.
మాటలలో త్యాగాలు
చేతలలో స్వార్థాలు
విరజిమ్ముతున్న మానవ కాలుష్యం.
మంచు పర్వతాలలో లావా పుట్టించినా
చైతన్య బిందు రగిల్చే
చల్లని విప్లవ హృదయంలో ఆరిపోక తప్పదు.
దోపిడీ వారసత్వం
ఆవిరవుతున్న చీకట్లో
మసి బారుతున్న మర్మ ధర్మంలో
కాలానికి నిప్పు పెడితే
మునుగుతూ తేలుతుంటాయి కాంతిరేఖలు.
భానుడి సమక్షంలో
మాటలలో నగ్న సత్యాలను
నిరంతరం నా చెమటను చిందిస్తాను
చిరస్మరణీయం కావాలని ఈ గీతం.

# 'పోతన కమ్మని కవిత్వం'

వి. పద్మ.

ఎం.ఏ. ద్వితీయ మహిళా కళాశాల

'లలిత స్కంధము కృష్ణ మూలము శుకాలాపాభిరామంబు మం।
జులతాశోభితమున్ సువర్ణ సుమన స్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తంబు మహా ఫలంబు విమల వ్యాసాల వాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరువుర్విన్ సద్ద్విజ శ్రేయమై"

భక్తికి మారుపేరుగా భాగవతాన్ని చెప్పుకుంటారు తెలుగు వారు. దానికి కారణం భాగవతంలోని భక్తి కథలు, పోతన కవిత్వం. భగవంతునిప్రేరణతో భాగవతరచన చేపట్టారు పోతన. కవిత్వం పోతనకు కైవల్యసాధనం, అందరికీ అందుబాటులో ఉండేది భక్తి. భక్తి మార్గం మధురాతి మధురమైనది. భక్తి ఒక విధమైన చిత్త పరిపాకం. ఆకలి అవుతున్న పసిపాప అమ్మ పాల కోసం అలమటించినట్లుగానే మానవుని అంతరాత్మ అఖండ చిన్మయానందం కోసం ఆరాటపడుతుంది.

భాగవత భక్తులలో తమోగుణ ప్రధానుడైన గజేంద్రుడు, రజోగుణ ప్రధానుడైన ధ్రువుడు, సత్వ గుణ ప్రధానుడైన ప్రహ్లాదుడు రక్తితో ఆరాధించే రమణులు ఉన్నారు. సర్వ మానవ హృదయాంతరాలలో భక్తి ప్రసూనాలు పరిమళింప చేసే సాహిత్య కల్పవృక్షం భాగవత మహా పురాణం.

'భక్తి' కవితలో రక్తి కట్టాలంటే శ్రవణ, కీర్తన, చింతన, అనే భక్తి మార్గాల కది పరిపాకంగా ఉండాలి. కవితకు లలిత శబ్ద సంయోజనం వల్ల మధుర అక్షర పునారావృత్తి వలన, అనుప్రాస యమకాది శబ్దాలంకార సంవిధానం వల్ల, శ్రవణ సుభగత్వం అలవడుతుంది. ధారావాహికమైన కవిత్వం వలన భగవద్గుణ సంకీర్తనం వలన రాగ రంజితమైన శైలి వలన అలవోకగా అవధానం చేయగలిగే పద్య విద్య వలన కవితలో సంకీర్తనకు సౌలభ్యం ఏర్పడుతుంది. భావ గాంభీర్యాలైన అర్థాలంకారాల వలన ఆలోచనామృతాన్ని వర్షించే సార్థక పద ప్రయోగం వలన వ్యంగ్య సౌరభాన్ని వెదజల్లే వాక్య విన్యాసం వలన అరటి పండు ఒలిచినంత తేలిగ్గా తెలిపే తాత్త్విక తాత్పర్యం వలన కవిత్వం పఠితలలో చింతనను రెకెత్తిస్తుంది. పోతన తన కవిత్వం ద్వారా ఈ గుణాలన్నింటిని సమన్వయ పరచి మనకందించినారు.

"మందార మకరంద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు"
ఇట్లాంటి పద్యాలలోని 'మాధుర్యం' 'శ్రవణాన్ని' ఆకట్టుకుంటుంది.
కంజాక్షు నర్చించుకరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
ఇందులో సంకీర్తనం స్వాదువుగా వినిపిస్తుంది
"ఇందు గలడందు లేడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలడు దానవాగ్రణి వింటే"
ఇందులో పాఠకునికి తాత్త్విక చింతనను చూపించారు.

పోతన భక్తి కవిత్వం ఆంధ్ర భాగవతానికి ప్రాణం. తెలుగుదనం కనపడే అతని వాక్యం స్వచ్ఛమైన అతని కాలానికి ప్రతిబింబం. రాజులను ఈసడించి రాముని ఆశ్రయించి భోగాలను గర్హించి భగవంతుని కీర్తించిన పోతన జీవితం ఉత్తమ మానవతకు ఉజ్జ్వలమణిదర్పణం.

"నీ పాద కమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యము" అని భక్తితో బాటు భూతదయను ప్రసాదించమని భగవంతుని కోరుకున్న దయామూర్తి పోతన. పోతన భాగవతం ప్రజల కోసం వ్రాశారు. భగవంతుని మీద నమ్మకం లేని పిచ్చి నాస్తికుడైనా అతని పలుకుబడికి పారవశ్యం పొంది ఆస్తికుడవ్వవలసిందే. పోతన భాగవత పద్యాలు రాని తెలుగు వారు ఉండరు. ఇంతటి ప్రజాదరణను చూరగొన్న పోతన కవిత్వంలోని కొన్ని పద్యాలను చూద్దాం.

పోతన కవితలో కట్టిన బొమ్మలు, అక్షరాలలో అమర్చిన శిల్పాలు పాత్రల మనఃప్రవృత్తికి నిగ్గుటద్దాలు. పోతన ఆశించింది కైవల్య సాధనే కానీ కాసులు కాదు. ఏదయినా ఒక విష్ణుకథ వ్రాయాలనుకున్నారు పోతన, భాగవతం తెలుగు చేస్తే భవబంధాలు తొలగుతాయని ఆనతిచ్చారు శ్రీ మహా విష్ణువు. పోతన అనుకున్నదే దొరికింది. కథేమో భాగవతం, పలికించే శక్తి స్వీయంకాదని, దివ్యమని, పలికితే కలిగే ఫలం తాను ఆశించిన కైవల్య సాధన. ఇవి పోతన కావ్య రచనా హేతువులు. భాగవతం ఒక ఫలం అది వేదమనే కల్ప వృక్షం నుంచి జారి పడింది.

'విశ్వశ్రేయ: కావ్యమ్'' అన్న కావ్య నిర్వచనానికి అద్దం పట్టిన కవి పోతన. డబ్బు కోసమో ధనికులకో అధికులకో అంకితం ఇచ్చి మెప్పు పొందడం కోసమో తాను రచించలేదు. ఆత్మ వంచన చేసుకోకూడదనుకొని భాగవతాన్ని శ్రీరామునికి అంకితం ఇచ్చారు.

మందార మకరంద మాధుర్యమున దేలు
  మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందానిల వీచికల దూగు
  రాయంచ సనునే? తరంగిణులకు
లలిత రసాల పల్లవ ఖాదియై చొక్కు
  కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరక
  మరుగునే సాంద్ర నీహారములకు...

సంస్కారాన్ని బట్టి మనసు, మనసుని బట్టి మార్గం. భగవంతుని పాదాలను భజించడంలో మత్తెక్కిన చిత్తానికి మరో చింత ఉంటుందా? ఉండదు.

మందార మకరందాల తీపి మరిగిన తుమ్మెద వుమ్మెత్త పూలను చేరుకుంటుందా? ఆకాశ గంగంలో ఉయ్యాల ఊగే రాజహంస వాగులూ వంకలూ వెళుతుందా? తీయని లేత మామిడి చిగుళ్ళు తిని పరవశించే కోయిల కొండమల్లెలు కోరుకుంటుందా? పండు వెన్నెల బయిళ్ళలో విహరించే చకోరం మంచు పొగవైపు పోతుందా? లేదు ఇన్ని మాటలెందుకు పరమాత్ముని వలచిన మనసు మరో వైపు పోతుందా? పోదు ఈ భావం భక్తికి పట్టుగొమ్మ.

పోతన నిరాండంబర జీవితానికి నిదర్శనం ఈ పద్యం.

చేతులారంగ శివుని పూజింపడేని
నోరునొవ్వంగ హరి కీర్తి నుడువ డేని
దయయు సత్యంబు లోనుగా దలుపడేని
గలుగ నేటికి దల్లుల కడుపు చేటు

అంటూ శివకేశవ అద్వైతాన్ని చాటి చెప్పారు. శివుని పూజించడం. హరిని కీర్తించడం దయను సత్యాన్ని ధర్మాలుగా భాసించడం జన్మ సాఫల్యానికి సాధనాలని పోతన ప్రగాఢ విశ్వాసం.

సూర్యుడు ఒక్కడే. కానీ జీవులు పెక్కురు. ఆ ఒక్క సూర్యుడే ప్రతి జీవికి ఒక్కొక్కడుగా కనిపిస్తాడు. భగవంతుడు కూడా ఒక్కడే అతన్ని భావించే కీర్తించే హృదయాలే అనేకాలు. ప్రతి హృదయానికి ఒక పరమాత్మ భాసిస్తాడు. సూర్యుడు కనిపించడం స్థూల దృష్టి. భగవంతుడు భాసించడం సూక్ష్మ దృష్టి. తాత్త్వికవిషయాన్ని అరటి పండు ఒలిచి నోటిలో పెట్టినట్టు బోధించారు.

లోకంబులు లోకేశులు
లోకస్థులు దెగిన తుదిన లోకంబగు పెం
జీకటి కవ్వల నెవ్వడు
నేకాకృతి వెలుగునతని నేసేవింతున్,

పగలు వెలుగు రాత్రి చీకటి ఇది సృష్టి నిత్య చర్య. సృష్టి మొత్తం చీకటి లోకాలు, లోకులు లోకేశ్వరులు ఆపెను చీకటికి మారు రూపాలు ఉన్నది ఒకే ఒక్క పరంజ్యోతి. అది ఒక్కటే అనశ్వరమైన ఆకృతి. ఆ వెలుగే తనకు శరణ్యమని గజేంద్రుడు వేడుకున్నాడు.

"కలడందురు దీనుల యెడ
కలడందురు పరమ పయోగి గణములపాలన్'
కలడందు రన్ని దిశలను
కలడు కలండనెడు వాడు కలడో లేడో"

గజేంద్రుడు ఆర్తుడు "భగవంతుడు అంతటాఉంటాడని అంటారు" గదా అని త్రికరణ శుద్ధిగా నమ్మాడు కానీ ఆ జీవి బుద్ధికి సంశయం ఏర్పడింది. ఒక్క గజేంద్రుడే కాదు. లోకంలోని కోటాను కోట్ల జీవులు పరమాత్ముని అస్తిత్వాన్ని నిరాకరించలేక నిశ్చయించలేక ఇప్పటికి సతమతమవుతున్నారు.

లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె ప్రాణంబులున్
ఠావుల్దప్పెను మూర్ఛ వచ్చె దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవే తప్ప నిత: పరంబెరుగ మన్నింపదగున్ దీనునిన్
రావే! యీశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా !

గజేంద్రుడు సంశయం నుంచి తేరుకొని తన్ను తాను అర్పించుకున్నాడు భగవంతుని అనుగ్రహానికి శరణాగతి తప్ప మరో మార్గం లేదని నిశ్చయించు కున్నాడు. ఫలితంగా గజేంద్రునికి భగవంతుని సాక్షాత్కారం లభించింది.

అలవైకుంఠపురం, ఆ పురంలో అంతఃపురం, అందులో ప్రధాన సౌధం ఆ సౌధ సమీపంలో అమృత సరోవరం అక్కడ చంద్రకాంత వేదికపై కలువల పాన్పుపై క్రీడిస్తున్న నారాయణుడు. ఇదా పోతన కట్టిన చిత్ర తోరణం. ఇంత వివరంగా ఎందుకు వివరించాడు? ఎందుకు వర్ణించాడు పోతన? ఎక్కడో గజేంద్రుడు. ఇక్కడ ఎంత తట్టి లేపినా లేవలేని స్థితి స్వామిది. ఇటువంటి సమయంలో స్వామి సంరంభించడం సామాన్య విషయం కాదు. ఇక్కడ జీవాత్మ పరమాత్మల సంబంధాన్ని చిత్రించారు. అదే "ఆపన్న ప్రసన్నుండు" ఎక్కడున్నా "ఆర్తత్రాణ పరాయణుడే" గజేంద్రుడు ఉన్న కరుణావస్థకు నారాయణుడున్న శృంగార స్థితికి మధ్య 'ఆర్తి' ఒక సేతువైనది. ఇందు గలడందు లేడని సందేహం అవసరం లేదు. ఎందుకంటే విశ్వమంతా విష్ణుమయమే. అని ప్రహ్లాదునితో పోతన చెప్పించారు.

నల్లనివాడు పద్మ నయనంబుల వాడు కృపారసంబు పై
జల్లెడువాడు మౌళి పరిసర్పిత ఫింఛము వాడు నవ్వురా
జిల్లెడు మోము వాడొకడు చెల్వల మానధనంబు దోచెనో
మల్లియలార! మీ పొదల మాటున లేడు గదమ్మ చెప్పరే?

ప్రణయ కలాపంగా కనిపించే గోపికా కృష్ణుల సంబంధం. నిజానికి జీవాత్మ పరమాత్మల అనుబంధం. ఎందరో గోపికలు ఒక్కడే కృష్ణుడు. ఇందరు ఒక్కరినే ఎందుకు వలచినట్టు? సూక్ష్మంగా పరిశీలిస్తే అతడు గోపాలకృష్ణుడు కాదు అవతార పురుషుడు.

ఏనీ గుణములు కర్ణేంద్రియములు సోక దేహతాపంబులు దాటిపోవు
నేనీ శుభాకార వీక్షింప గన్నుల కఖిలార్థ లాభంబు కలుగుచుండు
నేనీ చరణ సేవ లేపొద్దు చేసిన భవనోన్న తత్వంబు బొంద గలుగు
నేనీ లసన్నామ మే పొద్దు భక్తితో దడవిని బంధు సంతతులు పయు

నవ విధ భక్తులలో నాలుగు రకాల భక్తిని పోతన మనకు ఈ పద్యం ద్వారా తెలియపరచినారు. మొదటి పాదంలో శ్రవణం, రెండవ పాదంలో దర్శనం, మూడవ పాదంలో పాద సేవనం, నాలుగవ పాదంలో కీర్తనం.

ఇదే గాక ప్రాణేశ! నీ మంజు భాషలు వినలేని
కర్ణ రంధ్రంబుల కలిమి యేల?...... ఈ పద్యంలో రుక్మిణి దాస్య భక్తితో బాటు పోతన కవితా శక్తి ద్యోతకమవుతుంది. మానవ శరీరం పంచేంద్రియాల సంపుటి. చెవులు

వినడానికి, చేతులు తినడానికి, కళ్ళు చూడటానికి, జిహ్వా రుచికి, నాసిక వాసనకి ఇది సర్వ ప్రాణి సహజ లక్షణం. కానీ రుక్మిణి దృష్టిలో పాంచ భౌతికమైన తన శరీరానికి పరమావధి వేరు. ప్రాణేశ్వరుని సమాగమం ఆ ఆగమం వలన కలిగే మహానుభవం తన పంచేంద్రియాల కలిమికి పరమార్థం.

నమ్మితి నామనంబున సనాతనులైన ఉమామహేశులన్
మిమ్ము పురాణ దంపతులు మేల, భజింతు గదమ్మ మేటి పె
ద్దమ్మ దయాంబు రాశి గదమ్మ హరిన్ పతి సేయుమమ్మ నిన్
నమ్మిన వారికెన్నటికి నాశము లేదు గదమ్మ ఈశ్వరీ!

తెలుగు నాట కన్నె పిల్లలు భక్తి తత్పరతతో పాడు కోవలసిన పద్యం ఇది. ఈ పద్యంలో ఉన్న జీవశక్తి ఆ భక్తి భాగవతానికి ఇంత ప్రజా దరణ లభించడానికి ఒక కారణం అయితే ఈ మహా పురాణ కావ్యంలో గల భక్తి ప్రభావము, మంద్ర గంభీర గమనం గల పోతన పద్య శైలి వలన వచ్చినది. అది సహజ ధారా విలసితము. నన్నయ ధారా శుద్ధి, తిక్కన రసస్ఫురిత బంధము, ఎఱ్ఱన సూక్తి వైచిత్రీ, సోమన సాహితీ విదగ్ధత, శ్రీనాథుని ఎత్తుగడలన్నీ ఒక మూసలో కరగినచో పోతన శైలి పాంచ భౌతిక శరీరమవుతుంది.

ఆంధ్ర భాగవతము పోతన మహాకవియై మహాభక్తుడై ప్రజా హితమునకై సురభాష నుండి తెలుగు నేలకు దించుకొని వచ్చిన పారిజాతము.

ఇం.నె. 16-9-749/41, రేస్ కోర్స్ రోడ్, ఓల్డ్ మలక్ పేట్, హైదరాబాద్ - 36.

# మనిషి

వి. సావిత్రి
ఎం.ఏ. ప్రథమ, పి.జి కళాశాల

మనిషి !
నీ కళ్ళ ముందున్న యుద్ధ రంగంలో
నీ వెప్పుడు సైనికుడవే క్షతగాత్రుడివే.
కష్ట నష్టాల త్రాసులో ముల్లులా
నీవెప్పుడు నిమిత్త మాత్రుడవే.
అయినా!
అంతరంగంలో గాజు మేడలు సృష్టించుకుంటావు.
గాలి గుబులు నింపు కుంటావు.
ప్రతి క్షణం నీలో నీవు కాకుండా
చదరంగపు పావులాగా పరాధీనమైపోతావు.
మనుగడ స్వార్థమైన చోట
నీ ప్రతి బింబం వికృత చ్ఛాయలతో సాక్షాత్కరిస్తుంది

# పరిపక్వం

ఆర్. శైలజా రాణి
ఎం.ఏ., ద్వితీయ,మహిళా కళాశాల

తీపి, పులుపు, వగరు
పొగరు, ఫిగరుతో వున్నా
ఓ కాయ కాచింది,
తరువు అనే వృక్షానికి కాదు
తరుణికి, - రసవత్తరణికి,
కళ్లు తెరచినప్పటి నుండే
కన్నది అమ్మ కలలు
తన బిడ్డ దొడ్డవాడవ్వాలని.
మహాత్ముని౦తటి
మహనీయుడు కాకపోయినా
మంచితనానికి ప్రతి రూపమయి
ప్రఖ్యాతి గాంచాలని
ఆ మంచితనాన్ని మరుగుపరిచి
మరో పేరు సృష్టించినపుడే
అమ్మ అంతరంగాన ఆనంద తరంగాలు,
గొప్ప రాజకీయ నేత అయినా
సరే పొందదు ఆనందం
అతని దుశ్చర్యలు దురాగతాలను
వీక్షిస్తూ, ఉపేక్షించక తప్పదని
ఉస్సురుమనే మనస్సుతో
తనయుని తప్పు తన తప్పే
అనే తపన జపమై మది నిండా వ్యధ.
తన పెంపకములో ఏదైనా లోపమా?
అనే జవాబు లేని ప్రశ్నకు తలవంచి
తల్లడిల్లుతుందా కన్న తల్లి హృదయం.
కాచిన కాయ పరిపక్వమై
పండుగా మారి ఫలితం పొందాలంటే?
తలెత్తి తన తనయుడు మహా యోగి
మహా భోగి, గొప్ప దాత, గొప్ప నేత
అని 'సగర్వంగ, సవినయంగ, సంతోషంగ
పది మందికి చెప్పినపుడే
ఆమె కళ్లల్లో ఆనంద బాష్పాలు
ఎదనిండా దీవెనల అస్త్రాలు
ఆ అస్త్రాలకు తిరుగుండదు
ఆ అనురాగానికి వెలవుండదు.....

# 'ప్ర'పంచ పదుల పరమార్థం

నల్లపాటి వెంకటేశ్వర్లు
ఎం.ఏ. ద్వితీయ ఆర్ట్స్ కళాశాల

నేటి మానవ జీవితం, అందునా నగర జీవితం ఎంతగానో సంక్షుభితమై ఉంది. ప్రతి మనిషి ఎంత ఉత్సహించి బ్రతుకాలనుకుంటున్నా అంతకంతకు ఎన్నో సమస్యలు అతన్ని చుట్టు ముడుతున్నాయి. నిస్సహాయుని చేయ యత్నిస్తున్నాయి. ఆధునిక జీవితంలోని వేగానికి అడుగులు తడబడితే వచ్చే ముప్పును తెలుసుకుంటూ ఒకరికొకరు తోడుగా మసలుతూ ముందుకు సాగడం అవసరం. సహృదయుల ధైర్య వచనాలు ఒక విధమైన నిర్భీతిని కలిగిస్తాయి. అటువంటి సహృదయులు మాన్యులు, సి.నా.రె.నేనున్నానంటూ వెన్నుతట్టి, ధైర్యం చెప్పి, ముందుకు నడవండనే సందేశాన్ని 'ప్ర' పంచ పదుల్లో వినిపిస్తున్నారు. సార్వకాలికమైన సార్వజనీనమైన మానవ జీవన యత్నాలకు స్పందించిన తీరు దీనిలో మనకు ఆద్యంతమూ కనిపిస్తుంది. సామాజిక దృష్టితోనూ, లౌకిక ప్రబోధ విషయంలోనూ, తాత్విక దృష్టితోనూ ఎంతో లోతుగా దీనిపై వ్యాఖ్యానించవచ్చు. అనుభవాంకితమైన మనిషి జీవితాన్ని సమగ్రంగా అద్భుతంగా 'విశ్వంభర' కావ్యంలో దీనికన్నా ముందే ఆవిష్కరిం చారు. సి.నా.రె ఆ తర్వాత దాని అడుగుల్లో అడుగులు వేసుకుంటూ వచ్చిన ప్రపంచ పదుల్లో విశ్వంభరలోని వస్త్వైక్యత లేకపోయినా మరింత ఎదిగిన ఎదతో ఒక విధమైన ఏక సూత్రతతో ఆయన వెలయించిన ముక్తకాలు చదువరిని ముగ్ధుడిని చేస్తాయి. ప్రబోధం, ఎత్తి పొడుపు, అనునయం, వ్యాఖ్యానం, సిద్ధాంతం ఏది చేసినా మనిషి చుట్టే తిరగడం ఆ ఏక సూత్రత. ఆ క్లుప్తత, ఆ స్పష్టత, ఆ తాత్వికత, ఆ లోక పరిశీలనా దృష్టి మరో వేమనను స్ఫురింప జేస్తాయి.

సలక్షణమైన సృజనాత్మకతకు నారాయణ రెడ్డి మరో పేరు. ఫ్రీవర్స్ రాజ్య మేలుతున్న ఈ రోజుల్లో దానిలోని లోతులను ఆసాంతం చూపించి కూడ, తనివి తీరలేదు ఆయనకు. అందుకేనేమో ఎన్నో నియమ నిబంధనల చట్రాన్ని తానుగా నిర్మించుకొని ప్రపంచ పదుల రచన సాగించారు. సి.నా.రె. ఎన్నో నియమాలున్నా కొందరు రాస్తున్న ఫ్రీవర్స్ కన్నా సరళతను సాధించడం దీని ప్రత్యేకత. "అంత్య ప్రాసలు, అంత: ప్రాసలు, పద విరామాలు, సమదైర్ఘ్యత గల నాలుగు పాదాలు, అబ్బాయ ప్రధానమైన మధ్య

పాదం, రుబాయిలను, హైకూలును తలపింప చేసినా వాటిని మించిన విస్తృతి, నిర్మాణ శిల్పం 'ప్రపంచ పదుల్లో ఉంది''. అంటారు ఆచార్య గోపి.

ప్రపంచ పదుల్లో తాత్విక స్పర్శ (Philosophical Touch) తో సాగే పదాన్ని ముందుగా వ్రాయటాన్ని బట్టి తాత్వికతకే పెద్ద పీట వేశారని భావింపవచ్చు.

నింగి లోతును చూడ గోరితే నీటి చుక్కను కలుసుకో
రత్న తత్వం తెలియ గోరితే రాతి ముక్కను కలుసుకో
అణువనడిగితె తెలియదా బ్రహ్మాండమంటే ఏమిటో
మౌన శిల్పం చూడగోరితే మంచు గడ్డను కలుసుకో
మనిషి మూలం చూడగోరితె మట్టి బెడ్డను కలుసుకో

అన్న మొదటి పదమే పై వ్యాఖ్యకు సాక్ష్యం. మేఘంలో బిందువుగా ఉండి నింగిని మనకన్నా నీటి చుక్క ఎక్కువ పరిశీలిస్తుందను కోవాలి. క్లిష్టమైన రత్న నిర్మాణాన్ని తెలుసుకోవాలంటే దానికన్నా సరళనిర్మితి గల రాతి ముక్కను స్పష్టంగా అర్థం చేసుకోవాలి. ఆ పైనే మొదటిది సులువౌతుంది. ఆధునిక విజ్ఞానశాస్త్రం అణు నిర్మాణానికీ, సౌరకుటుంబానికీ, ఇంకా పాలపుంతలోని అనేక నక్షత్ర కుటుంబాల నియతికీ ఉన్న సామ్యాన్ని నిరూపించింది కదా! కనుక పరమాణువును అర్థం చేసుకుంటే సకల విశ్వం అర్థం అవుతుంది. 'మౌనశిల్పం' అని గొప్ప రూపకాన్ని వేసిన సినారే దాని గుణాన్ని తెలుసుకోవాలంటే, మెల్లగా చప్పుడు లేకుండా కరిగే మంచు గడ్డను కలుసుకోమని ఉపమానం చెప్పారు. పంచ భూతాత్మకమైన మనిషి మూలాన్ని తర్కించాలంటే ముందుగా వాటిలో మొదటిదైన మట్టిని తెలుసు కోమనటందీనిలోని ఆలోచనామృతానికి పరాకాష్ట.

మనిషిలో ఆర్ద్రత యొక్క అవసరాన్ని నొక్కి చెపుతూ ఉండనీ గాయాలు పచ్చిగ గుండెకెక్కిన మూర్తులై' (ప్ర.ప. 14) అంటున్నారు.

"ఎదమెత్త నౌటకై సొదగుందరా అంత
మది గల అహమ్మంత వదిలి పోవునురా"

అన్న బసవరాజు అప్పారావు గారి మాటలను తలపించిన ఈ గేయం చివరి పాదంలో మరింత లోతై.

'మిగలనీ త్యాగాలు మెత్తగ స్మృతుల కెక్కిన గురుతులై' అని ప్రబోధిస్తుంది. అంటే నీవు చేసిన త్యాగాలు తరతరాల, జనులు గుర్తుంచుకునేంత ఉన్నతంగా ఉండాలని చెబుతున్నారు.

ఉల్లాసంగా, విజయాలను రుచి చూస్తున్నప్పుడు గుర్తు రాని దేవుడు, బాధలు ముసిరి ముఖాన మొత్తినప్పుడు గుర్తు కొస్తాడు చాలా మందికి. అలాంటి వారిని హెచ్చరిస్తున్నారు సి.నా.రె.

"బాధలో దేవున్ని కొలిచే బాధ లెందుకులే
సోదితో రక్తాన్ని విరిచే బోధ లేందుకులే
నేడు రేపై రేపు ఆపై దూసుకొస్తుంటే
గతం పేరిట ఒళ్ళు మరిచే గాథ లెందుకులే
ధర్మపత్నుల వెన్ను పొడిచే రాధ లెందుకులే"

బాధలు ఛుట్టు ముట్టినప్పుడు మెట్ట వేదాంతం వల్లించి ఎదుటి వాడి సమయాన్ని వృధా చేయవద్దని, వాడికి పిరికి తనాన్ని ఎక్కించ వద్దని అంటున్నారాయన. నీ గతం వలన ప్రయోజనం లేనప్పుడు ఎందుకట చెప్పటం. రాధను మరో కోణం నుంచి చూసి, ధర్మపత్నుల కాపురాలకు చేటు తెచ్చేవారు ఎంతటి ప్రేమ మూర్తులైనా నిరసించాలని సూచిస్తున్నారు.

కొందరు కావాలనో, కాకతాళీయంగానో ఎదుటి వారి విపత్తులకు కారణమౌతారు. అది తెలసి వచ్చినప్పుడైనా సానుభూతితో సహాయమేదైనా చేయగలరేమో ఆలోచించాలి. పోనీ, అతని బాధ అతనిది. మన కెందుకులే అనే ఉపేక్ష పనికి రాదు. అలాంటి పరిస్థితి ఎదురైనపుడు వంచితుడెలా విలవిలలాడుతాడో పైకి ఏమీ అనక లోలోపల ఎలా బాధ పడతారో చెప్తున్నారు కవి.

"వెళ్ళితే కాదనను కాగే కళ్ళ ఆవిరి చూసిపో
వీడితే కాదనను మూల్గే నాడి ఊపిరి చూసిపో
అన్నీ తెలిసీ తెంచుకొని పోతున్న నీకో విన్నపం
నవ్వినా కాదనను మునిగే నావ అలజడి చూసిపో
కాల్చినా కాదనను మంటను కాస్త నిలబడి చూసిపో"

దీని గురించి ఎంత ఆలోచిస్తే అంత లోతైన అర్థాలు స్ఫురిస్తాయి. రాను రాను విశాలమై గోచరిస్తాయి. ఎంతో అన్వయ వైశాల్యమున్న పాదాలివి.

తమ కృషిలోని లోపాన్ని చాలా మంది గుర్తించరు. ఇంత కాలాన్ని వెచ్చించాను, ఇంత డబ్బును ఖర్చు చేశాను, ఇన్ని ప్రయత్నాలు వట్టిపోయాయే అని కొందరు

విచారిస్తుంటారు. నిజానికి వారు ఒప్పుకోటానికి ఇష్టపడని బలహీనత లుంటాయి. వాటిని కప్పి పెట్టి తమ ప్రయోజకత్వాన్ని ఏకరువు పెడుతుంటారు. అలాంటి వారికి సూటిగా తాకేలా...

ఎన్ని మెట్లు ఎక్కావని కాదు ఎంత యెత్తుకెదిగావనీ,
ఎన్ని మునక లేశావని కాదు ఎంత లోతు చూశావనీ,
గమనం సార్థకమౌతుంది నీ గమ్యాన్ని చేరినప్పుడే
ఎన్ని సభలు తిరిగావని కాదు ఎంత బుద్ధి పెంచావనీ
ఎన్ని కృతులు చదివావని కాదు ఎంత సిద్ధి పొందావనీ

మరో పదంలో కృషి లోపం ఉండకూడదని సూచిస్తున్నారు. ఈ రెంటినీ చక్కగా అన్వయించగలము.

ఎంత దున్నినా మట్టికి ఎప్పుడైన కలత ఉన్నదా?
ఎంత ఉరికినా ఏటికి ఎప్పుడైన నలత ఉన్నదా?

అందుకే సఫలత నొందాలంటే కలత, నలత లేని కృషి ముఖ్యం. క్లేశాన్ని తట్టుకుంటూనే గమ్యాన్ని లక్షించాలనే సందేశాన్నిస్తారు. ఆ పట్టుదలే ఉంటే వనరులకు కొరత లేదంటున్నారు అదే పదములోని చివరి పాదాల్లో

ఎంత ఎగిసినా నింగికి ఎప్పుడైన కొరత ఉన్నదా?
ఎంత పీల్చినా గాలికి ఎప్పుడైనా కోత ఉన్నదా?

ఇక్కడ, ఎంత ఎత్తుకు ఎగరగలం అనేది మన మీదే ఆధారపడి ఉంది గానీ, ఆకాశానికి హద్దేమీ లేదు. ఎగిసినా కొద్దీ అపారమైన అంతరాళం ఆహ్వానిస్తుంది. అంటే ఇక్కడ ఎగరటం అభివృద్ధిని సూచిస్తుంది. దానిపై ఆకాంక్షనూ సూచిస్తుంది. అలాగే మనం పీల్చే గాలి వంటిదే మన మెదడుకున్న శక్తి. ఉపయోగించిన కొద్దీ ఎక్కువగా లభ్యమౌతుంది మేధాశక్తి, రాను రాను పదునెక్కి మరీ లభిస్తుంది.

మానవుడెన్నడూ చల్లారబోడనీ, 'మంటలూ-మానవుడూ' కావ్యంలో ఒక చోట అన్నారు సినారె. చల్లారని జ్వాలతో మనిషిని పోల్చడం అతని చైతన్యాన్ని గుర్తింపజేయడానికే. నీరసపడి పోకయ్యా! నీ శక్తిని గుర్తించవయ్యా! అని ప్రపంచ పదుల్లో ఇంకాస్త స్పష్టంగా చెప్పి వెన్ను తట్టుతారు.

ఎన్ని మైళ్ళు నడిచావు నువ్వనీ ఇంతలోనే అలుపొచ్చిందా?
ఇంత దీర్ఘమా జీవితమంటూ అంతలోనే విసుగొచ్చిందా?
కడలి అంచులను చూసే దాకా పడిపోయే ఆ చేరవేదీ
వేడి నెత్తురు ఫరారై మంటను చూడగానే జడుపొచ్చిందా?
ఇంత పౌరుషం నీరై మంచును అంటగానే చెమటొచ్చిందా?

అంటే, మంటను చూసి మరికాస్త వేడినీ, హుషారునీ, రక్తానికెక్కించుకోమనీ, మంచుని చూసి స్వచ్ఛతనూ, గంభీరతనూ అలపరుచుకోమనీ ఆయన అన్నారనిపిస్తుంది.

ఆగ్రహం మనకు కొత్త కాదు. పుట్టినప్పటి నుంచి, తల్లిదండ్రులతో మొదలై గురువులు, హితులు, శత్రువులు ఇలా రక రకాల వారి ఆగ్రహాన్ని ఎన్నో సందర్భాల్లో కొద్దో, గొప్పో అందరం రుచి చూసే ఉంటాం. అయితే ఆయా వ్యక్తుల ఆగ్రహాల స్వభావంలోనూ, తీవ్రతలోనూ తేడా ఉంటుంది. కానీ, ఉదాత్తమైన ఆగ్రహం ఎలా ఉంటుందో సూచిస్తున్నారు కవి.

కుత్సిత గతులకు తలవంచక తొడగొడితే అది ధర్మాగ్రహం
పేరుకు పోయిన జడమతులకు చితిపెడితే అది కర్మాగ్రహం
ఆగ్రహాన్ని ఈ లోకమనుకునే అర్థంతో సరితూచకోయ్
మడమలు తిప్పని త్యాగానికి తలపడితే అది సత్యాగ్రహం
అడుగులు తప్పని నిజాయితికి నిలబడితే అది నిత్యాగ్రహం

మరో చోట తనకు నిగ్రహం ఉందని నిక్కినిక్కి చెప్పే వాడినీ, బల్ల గుద్ది మాట్లాడే వాని శాంతాన్నీ పరిహసిస్తారు. జీవితం ప్రలోభాలకు, వాటి మూలంగా వచ్చే సంఘర్షణలకు అతీతంగా ఉంటేనే సార్థకత అంటారు.

ఉప్పెనలో తలవొగ్గక నిలువున ఉబికొచ్చేదే జీవితం
ప్రలోభాలు పైబడినా నీతికి పడిచచ్చేదే జీవితం

ప్రపంచంతో పాటే ప్రశ్న పుట్టి ఉండాలి. ఏ రంగంలోని అభివృద్ధికైనా ప్రశ్నే మూల భూతం. ప్రశ్నలకు జవాబులు వెతుకుతూ పోయే ప్రక్రియనే అభివృద్ధి అనవచ్చు. ఎంతచెట్టుకంత గాలి యన్నట్లుగా జ్ఞానికీ, అజ్ఞానికీ, మౌనికీ, తేనికీ ఎవరికైనా ప్రశ్నలుంటాయి. వ్యక్తి పరిపక్వతను బట్టి ప్రశ్న లోతు ఉంటుంది.

తర్క సముద్రాలీదిన జ్ఞానికి తన మనసే ఒక ప్రశ్న
జనన హేతువు మథించిన మౌనికి తన తనువే ఒక ప్రశ్న
తనకే ప్రశ్నలు లేవంటే ఆ మనిషి నేలా నమ్మేది?
జన వాహిని నడిపించే వానికి తన నడకే ఒక ప్రశ్న
దైవ గతిని ప్రవచించే ధ్యానికి తన బ్రతుకే ఒక ప్రశ్న
కనుకనే మరొక ప్రపంచ పదిలో అంటారు సినారె
అన్నీ తెలుసునన్న వాడు అల్పజ్ఞుడు
అసలు తెలియదన్న వాడు ఆత్మజ్ఞుడు

మౌనం చాలా శక్తి వంతమైనది. దాన్ని ఆయుధంగా వాడుకునే సమర్థులు కొందరే ఉంటారు. కొందరి దృష్టిలో మౌనం అర్ధాంగీకారమో, అంగీకారమో! కాని అది ఒకోసారి తిరస్కారం, తీవ్ర నిరసన కూడా అవుతుంది. అప్పుడప్పుడూ ఇది మన అనుభవం లోనికి వచ్చేదే. అయితే ఆగ్రహం గురించి సినారె ఏమంటున్నారో చూద్దాం.

మాటల కోటలు కూల్చే బాణం మౌనం
మనిషికి మననం నేర్పే జ్ఞానం మౌనం
మౌనం లోతులు మాటల కందవు లేవోయ్
మగతల పొరలను చీల్చే మథనం మౌనం
మనసుకు వెలుగును చూపే నయనం మౌనం

సముద్రం కేవలం ఉప్పు నీటి నిధి కాదు. అది గంభీరతకూ, స్థిత ప్రజ్ఞతకూ చిహ్నంగా గ్రహించాలి. స్థితప్రజ్ఞుడు సముద్రం లాంటి వాడే. అతడు అలజడులకు అదరడు. కలకతలకు క్రుంగడు. నింగి విరిగి నేల మీద కూలినా లొంగడు. ఏ ఋతువులోనైనా ఒకే రీతిగా ఉండే సముద్రం లాగే గంభీరంగా ఉంటాడు, అంటారు ధ్వన్యాత్మకంగా (ప్ర. ప. 47).

దేవతలకు మరణం లేదంటారు. మనిషి కూడా మరణాన్ని జయిస్తే బాగుండునని కలలు కంటుంటాడు. కాని దానితో పాటు ముదిమిని జయించకపోతే ఎంత దుర్భరం. మృత్యువు కంటే భీతి గొల్పదూ! హృదయానికి మథనం, చరిత్ర కారునికి కథన సామర్థ్యం ఎంత అవసరమో వివరిస్తారు.

మట్టి ముద్దగ మారుతుంది హృదయం కొస్త మధనమే లేకుంటే
మట్టి మరగా కదులుతుంది మేధ ఒకింత మననమే లేకుంటే
కదను తొక్కే గతికి కలుగుతుంది హుషారు కాసింత కుదుపుతో
ఘట్టాల చిట్టాగ మిగులుతుంది చరిత్ర కథనమే లేకుంటే
తెరపడని ముదిమితో మూల్గుతుంది ధరిత్రి మరణమే లేకుంటే

ఈ జగతి నిండా ఏదో ఒక క్రమం కనిపిస్తుంది. క్రమ బద్ధమైన సహజత్వం ఏ వస్తువుకైనా శోభనిస్తుంది. గ్రహగతులలో, సముద్రపు ఆటు పోట్లలోని క్రమం ఎంత గొప్పది. మరి మనిషి క్రమంగా ఉండనంటేనో! అతనికీ భంగపాటు తప్పదు. ఇటువంటి భావాన్నే పంచుతున్నారు సినారె ప్రపంచ పదుల్లో

అడుగు తప్పితే జారి పడక తప్పదు మెట్టు నుంచి
పరిధి దాటితే మరుగు పడక తప్పదు జట్టు నుంచి
కుదురుగా ఉంటేనే పదవి కుంటుందిరా విలువ
పురులు చెదిరితే ఊడిపోక తప్పదు కట్టు నుంచి
పొంగు ముదిరితే పొర్లిపోక తప్పదు గట్టు నుంచి

మనిషి జీవితాన్ని విరివిగా ప్రభావితం చేసే డబ్బు, పదవి, తెలివితేటలు, బలం అనే శక్తులు ఎలా ఉంటే సఫలమౌతాయో చెపుతారు కవి సూటిగా

"కలిమికి సాఫల్యం అది నలుగురికీ దక్కినప్పుడే
పదవికి సాఫల్యం అది ప్రజల మనసు కెక్కినప్పుడే
వ్యక్తి చుట్టు తిరిగే ఆ శక్తి ఉండి లేనట్టేలే
తెలివికి సాఫల్యం అది తెరలు చీల్చుకొచ్చినప్పుడే
బలిమికి సాఫల్యం అది బలహీనులు మెచ్చినప్పుడే"

పై శక్తులన్నీ ఒక వ్యక్తి చుట్టూ పరిభ్రమిస్తే ఏ లాభం లేదని చెపుతున్నారు. నల్లడబ్బుగా మూలల్లో పడి మూల్గే కన్నా ఉత్పత్తి రంగంలో ఉపయోగపడే డబ్బుదే సార్థకత. తనతో పాటు పది మందినీ ఎరుకకు చేరువ చేసేదే తెలివి. సామాన్యుడికి అండదండగా ఉంటే బలశాలి జీవితం ధన్యం.

మానవుని నైజం చిత్రమైనది. అందుబాటులో ఉన్న వాటి విలువను గుర్తించం. కాని అదే కరువైనప్పుడు; అయ్యో కోల్పోయామే అని విచారంలో పడతాం. పూలనునుపు

ముళ్ల మొనలు తాకిన తర్వాత, వెలుగు విలువ చీకటి తెరకమ్మాక అర్థమౌతాయనీ చెప్పే పంక్తులలో చివరగా "సుఖం విలువ తెలుస్తుంది శోకం పైబడి తేనె"

జీవి అంతు తెలుస్తుంది చావులోతు తడితేనే"

అన్నప్పుడు భావంలోనూ, బరువులోనూ ఉన్నత స్థాయికి చేరిన వ్యక్తీకరణ ఔరా! అనిపిస్తుంది.

ఒక వ్యక్తి వృద్ధిలోకి వస్తున్నప్పుడు నాలుగు కళ్ళు అతని మీద పడటం సహజం. ఒక మేధావి వర్గం విషయానికి వస్తే ఒకరిపై ఒకరికి ఉండే అపోహలు, చేసుకునే విసుర్లూ, విమర్శలు కూడా ఎక్కువే ఉంటాయి. చెట్టు విరగ కాసినప్పుడే రాళ్ళ తాకిడి తగిలేది. ఇటువంటి భావాన్నే సినారె. 'రాశికి రావాలంటే విశేషమేదో ఉండాలి' అనే సమన్వయ వాక్యంతో చెప్పారు. ఆటుపోట్లు అలలుప్పొంగే కడలికే, చిగుర్రైనా చేవ్రైనా చేవ ఉన్న వృక్షానికే, అనే మాటలు సామెతలంత సూటిగా లేవూ! ఇంకా తర్వాత పంక్తులన్నీ చక్కని దృష్టాంతాలుగా భాసిస్తాయి.

"ప్రాణమున్న దేహానికి పడకైనా నడకైనా
రచ్చకెక్కు ఆసామికె రాళ్ళైనా పూలైనా"

కొందరు మనుషులుంటారు. పుట్టి పెరిగి తిరుగుతున్న పరిసరాలెటు వంటివైనా తమ ప్రత్యేకతను చూపిస్తారు. తమ జ్ఞానం కారణంగా పదిమంది చేత గౌరవింపబడతారు. హోదాలతోనూ భేదాలతోనూ వారికి పని ఉండదు. అలాంటి వారిని చక్కని ఉపమానాలతో సత్కరిస్తున్నారు కవి.

బురదలోన ఉంటున్నా తరగదు పద్మం విలువ
తాటాకున పడి ఉన్నా తగ్గదు పద్యం విలువ
అసలు సిసలు పస ఉంటే అవరోధించేదెవరు?
అరసికులే మంటున్నా చెరగదు గానం విలువ
మూర్ఖులు ముంచేస్తున్నా మునగదు జ్ఞానం విలువ

దీనిలో భావంతో పోటీపడిన పద్మం-పద్యం, జ్ఞానం-గానం జంట పదాలు, ప్రతి పాదంలోనూ ఆవృత్తియైన 'విలువ' అనే మాటతో ఎంతో శోభనిచ్చాయి.

లక్ష్యమంటే ఏమిటో గుర్తించిన వాడు దానికి తగ్గ మార్గాన్ని గుర్తించగలడు. నీరు పల్లానికి ప్రవహించినంత సహజంగా ఆ మార్గంలోకి పోగలడు. అలాంటి వారికి కొన్ని సహజ గుణాలుంటాయి. ఒకరు చెప్పనవసరం లేకుండా తమ ధర్మాన్ని నిర్వర్తించగలరు వారు. బహుశా ఈ భావాన్ని ఈ క్రింది ప్రపంచ పదితో బలపరచవచ్చు.

పరుగంటే ఏమిటో బోధించాలా పాదానికి?
స్వరమంటే ఏమిటో ప్రవచించాలా వేదానికి?
అనునిత్యం ఆ సత్యం మన ముందట కన్పించగ
క్షతి యంటే యేమిటో చూపించాలా హృదయానికి?
చితి అంటే యేమిటో వివరించాలా మరణానికి?

పాదానికి పరుగు, వేదానికి నాదం సహజ గుణాలు. హృదయం స్పందించడంతోపాటే ద్రవించడమూ నేరుస్తుంది. చితి వైపు దారి చూపే మరణానికి చితి గురించి ఎవరూ చెప్పనవసరం లేదు.

మనిషికి వ్యష్టిగా ఉన్నా సమాజగతమైనప్పుడైనా, లౌకిక జీవనంలో ఉన్నంత కాలం బాధలు తప్పవు. మనిషి వివిధ రంగాల్లో ఎదిగిన కొద్దీ బాధల స్థాయి కూడా అదే మోతాదులో పెరుగుతుంది. వ్యక్తికో, కుటుంబానికి, ఊరికి, దేశానికి బాధలు కల్పించే పరిసరాలే మారతాయి. బాధ సర్వంకష. దాని గురించి సినారె. ఏమంటారో చూద్దాం.

ఎంతటి సత్యానికైనా ఏవో కల్లల బాధలు
ఎంతటి దేశానికైనా ఏవో ఎల్లల బాధలు
బాధలు లేనిది యెవరికి ఏదో ఒక రూపంలో
ఎంతటి శీలానికైన ఏవో ధూర్తుల బాధలు
ఎంతటి సింహానికైన ఏవో దోమల బాధలు

మొదటి పాదంలో సత్యానికి కల్లల బాధలన్నప్పుడు గంభీరంగా ఆలోచనలో పడతాం. అలాగే నాలుగో పాదం దాకా కొనసాగుతాం. కాని చివరి పాదంలోనికి రాగానే హాస్యం లాస్యం చేసే పద ప్రయోగంతో తేలిక పరుస్తారు, సత్య నిష్ఠా పరులెవరైనా నిర్వేదంలో పడతారేమోనని.

'విధికి నువ్వు సిరసొగ్గితే విరుగుతుంది వెచ్చని రక్తం' అంటూ సాగే ప్రపంచ పదిలో మానసికంగా దృఢత్వం, స్థైర్యం అవసరమని గుర్తు చేస్తారు సినారె. అవి ఉన్నప్పుడు మన ప్రతి పనికీ సార్థకత ఉంటుంది. విధిపైన నెపం పెట్టి తప్పుకుంటే ఫలితం శూన్యం, విధికైనా ఎదురు తిరిగే స్థైర్యం విశ్వామిత్రుడిని ప్రతిసృష్టికి కర్తగా మార్చలేదా! సంపద చాలా ప్రలోభ పెడుతుంది. అటువంటప్పుడు స్థైర్యం మరీ అవసరం. సిరిపై మనసు మొగ్గితే స్వార్థం పెచ్చు రేగి యుక్తాయుక్తాలను మరిపించగలదు సుయోధనులను దుర్యోధనులుగా చేయగలదు.

ఎదురీదే చేతులుంటే ఏరు దారి యివ్వక ఏం చేస్తుంది?

పయనించే అడుగులుంటే బాట చేతులెత్తక ఏం చేస్తుంది?

గమ్యం చేరాలనుకునే వారికి ప్రయత్నమెంత ప్రధానమో చెప్పారు. ఈ పాదాల్లో దెబ్బ తిన్నా మరోసారి సాధిద్దామనే విశ్వాసం ఎంత అవసరమో, "అనుకోనిది బెడిసి కొడితే ఆశ నీరు గారొద్దు

అనుకోనిది ఎదురుపడితె అడుగు జారనీయొద్దు" అని నొక్కి చెబుతున్నారు.

ఎవరూవిప్పి చెప్పే పని లేకుండా ఆయనే ప్రపంచ పదుల తత్వాన్ని వివరించారు. నన్నయ గారు మహాభారత అవతారికలో కవిత్వ లక్షణాలను చెప్పుకున్నట్లుగా సినారె ఆఖరి ప్రంచ పదిలో ప్రపంచ పదుల లక్ష్యాన్ని వివరించారు.

ఒరిగి పడిన జాతికి వేను చరుపులీ ప్రపంచపదులు

మరుగు పడిన నీతికి కను మెరుపులీ ప్రపంచ పదులు

చేదో తీపో మధించి చెప్పాడు సుమా సినారె

కునికే అడుగులకు మేలు కొలుపులీ ప్రపంచ పదులు

మారే విలువలకు దారి మలుపులీ ప్రపంచ పదులు

సామెతల గురించి చెపుతూ "సామెతలను పుస్తకం చివర నిర్వచించాలి గానీ పుస్తకం మొదట చేయరాదు" అన్నాడో విమర్శకుడు. సామెతలకు సాటి వచ్చే రసగుళికల్లాంటి ప్రపంచ పదులను సృష్టించిన సినారె. కూడా అలాగే చేశారనిపిస్తుంది. 'లక్ష్యం తర్వాతనే లక్షణం' అనే వాక్యాన్ని గూడా, అన్నింటి తర్వాతపై పాదాలను చెప్పినందుకు వర్తింపజేయ వచ్చేమో!

ఒక వర్ధమాన కవి సినారె గారిని 'చేదబావి' అంటారు. ఆయన త్రవ్విన 'ప్రపంచ పదుల బావి నుండి పిపాసువులెంత తోడినా స్వచ్ఛ సాహితీ జలాలు ఊరుతూనే ఉంటాయి. అలా దాహం తీర్చుకుంటున్న వారిలో నేనూ ఒకడిని.

సినారె సాహితీ సౌధాన్ని 'ప్రపంచ పదుల సోపానాల ద్వారా అధిరోహిస్తే దాని ఎత్తును అర్థం చేసుకోవడం సులభమేమో! అలాంటి ప్రయత్నం మొదలు పెట్టే వారికి అవిశక్తి సోపానాలు. రక్తి సోపానాలు. యుక్తి సోపానాలు. బహుశా ముక్తి సోపానాలు కూడా.

పోస్ట్-ఊటుకూరు, జిల్లా-ఖమ్మం.

# అభిసారిక

ప్రాదం. మంజులత
ఎం.ఏ., ద్వితీయ ఉమెన్స్ కాలేజీ

తొలిరోజు నిన్ను చూసినపుడు అనుకున్నా
తొలకరి చినుకు కురిసిందని,
మలిరోజు నిన్ను కలిసినపుడు అర్థమయింది
నా మనసులో ప్రేమ విరిసిందని,
నా "అభిసారిక" వవుతావని అనుకున్నాను, కాని
అందని ఆకాశంలోని తారవవుతావనుకోలేదు
వెన్నెల రాతిరి తెల్లని మల్లెల సొగసులు
అందించే "జ్యోత్స్నాభిసారిక" వగుతావనుకున్నా కానీ,
వెండి వెన్నెలను కరిగించి వేదన మిగులుస్తావనుకోలేదు
'దివసాభిసారిక' వగుతావని దినదినము చూసాను
కాని దివి నీ నివాసమను కోలేదు
తారల తళుకులకు పున్నమివెన్నెలకు
తరలిపోయి దివిని వీడి నీవు రానంటే
నీ మధురాధర మాధుర్యాన్ని మథించే మధుర క్షణం కోసం
మరీ మరీ వేచిన నా మనసు మరణించదు.

ఇం.నె. 3-5-93, పోచమ్మవాడ, భువనగిరి

# త్రిశంకు

పానుగోటి శ్రీధర్
ఎం.ఏ. ద్వితీయ, ఆర్ట్స్ కాళాశాల

మమ్మల్ని మేం చూసుకున్నాం
తర తరాల నుండీ తడారని నీడలో
పట్టాభూమి సాగు చేయలేక
పల్లె తల్లిని బలవంతంగా వంచించాం.
బానిసత్వపు పట్ట భద్రులమై
పట్నం త్రిశంకు స్వర్గంలో చిక్కుకున్నాం
మా కోరికలకు ఆకాశం అడ్డు కాలేదు
ఆకాశాన్నంటిన గాలి మేడల్లా
జల పాతంలా వురికే పట్నం అందాలను చూసి
బలవంతంగా మూగపోయింది మా హృదయం.
ఇంటి దగ్గర కన్నీళ్ళు నిండిన మా కన్న తల్లి కళ్ళు
నిత్యం కళ్ళలో కలల్లో మెదులుతుంటే
సర్వీస్ కమీషన్‌ల వాయిదాల పద్ధతి
పోటి ప్రపంచంలో పరుగెత్తించే ఆంగ్ల భూతం
అడ్డుకుంటున్నాయి స్వేచ్ఛగాకార్చే మా కన్నీరును....

గ్రా- కుప్పాష్ పల్లి, మం-అనుముల, జి-నల్గొండ.

# చిల్లర దేవుళ్ళు - జన జీవన చిత్రణ

జి. బుచ్చయ్య
ఎం.ఏ., ద్వితీయ, పి.జి. కళాశాల

తెలుగు సాహిత్య చరిత్రలో అందులోనూ ఆధునిక యుగంలో వచన వాఙ్మయానికి విశిష్ట స్థానం ఉంది. తిరుపతి వెంకట కవులు చెప్పినట్లు కాలాన్ని, ప్రభుత్వాన్ని, దేశాన్ని అనుసరించి భాషా సాహిత్యాలలో మార్పు సహజం. అది కవితలో కావచ్చు లేదా వచన రచనలలో కావచ్చు. ప్రాచీన సాహిత్యంలో కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక, పాలవేకరి కదరీపతి శుకసప్తతి వంటి కావ్యాలలో మాత్రమే మనకు జన జీవితాన్ని గూర్చి తెలుసుకునే అవకాశం ఉన్నది. మిగతా కావ్య, ప్రబంధాలలో ఆయా వస్తువుకు సంబంధించిన పాత్రలవరకే పరిమితంకావడం కన్పిస్తుంది. ఆధునిక యుగంలోని రచయితలు ప్రాచీన సాహిత్యాన్ని అధ్యయనం చేసినా మారుతున్న కాలాన్ని అనుసరించి జన జీవన చిత్రణ చేయడంలో కూడా మార్పు కన్పిస్తుంది.

వందేళ్ళ తెలుగు నవలా సాహిత్యంలో కొన్ని వేల నవలలు వచ్చి ఉండవచ్చు. కానీ జన జీవితాన్ని చిత్రించిన నవలలు చాలా తక్కువ. అసలు జన జీవన చిత్రణ అంటే ఏమిటి? అని యోచిస్తే మనుష్యుల మధ్య ఉండే సజీవ సంబంధాలు మనుషులపై ఆయా పరిస్థితుల ప్రభావం ఇవన్నీ జన జీవన చిత్రణ కిందికే వస్తాయి. అటు వంటి జన జీవన పరిస్థితులు 'చిల్లర దేవుళ్ళు' నవలలో ఏవిధంగా చిత్రించబడ్డాయో వివరించడమే ఈ వ్యాస ఉద్దేశ్యం.

'చిల్లర దేవుళ్ళు' నవలను దాశరథిరంగాచార్య రచించారు. ఈ నవలలో 1937-38, నాటి తెలంగాణా గ్రామ జీవితాన్ని భూస్వామ్య వ్యవస్థను సూక్ష్మాతి సూక్ష్మంగా చిత్రించారు. అప్పటి స్థితిని అనుభవించిన ఆకళింపు చేసుకున్న మహోన్నత వ్యక్తి దాశరథి రంగాచార్య. ఆధునిక యుగంలో ఏ సాహిత్యం వెలువడినా నేపథ్యం తప్పని సరిగా కన్పిస్తుంది. ఈ నవల వెలువడటానికి కూడా నేపథ్యం ఉన్నది.

నిజాం నిరంకుశ పాలన, గ్రామాలు జమీందారి, జాగీర్దారీ భూస్వామ్య వ్యవస్థకు వెట్టి చాకిరికి నిలయమైన స్థితి, ప్రజలు అజ్ఞానంతో అసహాయతతో అణగారిన స్థితి ఉన్న రోజులవి. భారత దేశంలో స్వాతంత్ర్యం రాక ముందు హైదరాబాదు పోలీసు చర్య జరగక ముందు నిజాం రాష్ట్రంలో అంతర్భాగమైన తెలంగాణాలో కొన్ని ప్రత్యేక పరిస్థితులు

నెలకొని ఉన్నాయి. పోలీసు చర్యకు పూర్వం తెలంగాణా ప్రాంతంలో చిల్లర దేవుళ్ళు అధికారుల రూపంలో వెలసినారు. జాతీయోద్యమంతో సరిసమానంగా గ్రామాలను కుదిపేసిన ఉద్యమం తెలంగాణా విమోచనోద్యమం. విమోచనోద్యమంలో కీలకమయిన అంశం భూమి సమస్య రైతులు అణకువ దశ నుండీ పోరాటదశకు చేరుకున్నక్రమాన్ని చిత్రించే అవసరం సందర్భం ఏర్పడ్డాయి. రైతుల భూస్వాములు మధ్య పోరాటం అనివార్యమైంది. ఇటువంటి తెలంగాణా స్థితి గతులు చిల్లర దేవుళ్ళు రచనకు నేపథ్యాన్ని కలిగించాయి.

మన దేశంలో ఏ ప్రదేశంలో కన్పించని బలవంతపు 'మతపరివర్తన' నిజాం ప్రాంతంలోనే జరిగింది. ఎటువంటి పరిస్థితులలో హరిజనులు ముస్లింలుగా మారారో అదే విధంగా మరల హరిజనులు కావడానికి ఏ విధంగా తాపత్రయ పడ్డారో ఇందులో చిత్రించారు. మతం మారినా వాళ్ళ బ్రతుకులు మారలేదు. లేనిపోని ఇబ్బందులు నెత్తినపడ్డాయి. ముస్లిం మతంలో కలిస్తే స్వేచ్ఛగా బతుకవచ్చునని పెత్తందార్ల ఒత్తిడి తగ్గుతుందని హరిజనులు భావించారు. మతం మారిన వాళ్ళకు బట్టలు ఇచ్చారు కానీబతుకు మార్గం చూపించిన నాథుడు లేడు. మతం మార్చుకున్నా పెత్తందార్ల కాళ్ళ కింద ఉండక తప్పలేదు. అటు ప్రభుత్వం ఇటు పెత్తందార్లు హరిజనుల జీవితాలతో ఆటలాడుకున్నారు.

ముస్లింలుగా మారిన హరిజనులు తమ గోడును దొరకు విన్నవించే సందర్భంలో పై పరిస్థితులు కొట్ట వచ్చినట్లు కన్పిస్తాయి.

"బావుల్తవ్విస్త మన్నరు! బంతులు పెట్త మన్నరు కాదుర!

"నీ కాల్మొక్త మాకా బాయిలొద్దు, ఆ బంతులొద్దు, మీ కాళ్ళ కాణ్ణే పడుంటం కులంల కలుపురి. కోమటాయన అప్పు పుట్టనియ్యక పాయే. కుమ్మరోడు కుండ లియ్యకపాయే. మంగలాయన గొరగడాయె వడ్లాయన పని చెయ్యననె కులపోరు పిల్లనియ్యనన్రి. చెస్కోమన్రి. ఇక ఊళ్ళెట్లుంటం గుళా పోళ్లం ముత్తాలమ్మకు సుతకోపమొచ్చి మింగతాంది. బోనాలు పడ్తనంటే బైండ్లోడు పట్టనియ్యడాయె ఇగెట్ల బతుకుతముండి. ఎట్లనన్న చేసి కులంల కలుపురి మీ బాంచోల్లమై పుడ్తం". "ఎట్లనన్నచెయ్యిర్రి. నీ బాంచను కొట్టేటోరు మీరు పెట్టేటోరు మీరే" అని నేలకుదండం పెట్టి వెళ్ళిపోతారు. ఈ సన్నివేశం ఆనాడు గ్రామంలో ఉన్న వివిధ కులాల మధ్య ఉండే సంబంధం ఏమిటో, మతం మార్పిడి వలన కలిగే ఇబ్బందులేమిటో తెలియజేస్తుంది.

ఆచార బద్ధమైన, కులబద్ధమైన సామాజిక ఆర్థిక పరస్పర సహకరం కన్పిస్తుంది. సామాజిక జీవనంలో వస్తున్న అస్పృశ్యతా సమస్య ఇందులో చోటు చేసుకుంది. ఆనాడు హరిజనుల దయనీయ దుస్థితిని ఆసరాగా చేసుకొని మతం మార్పిడి చేయాలని ముస్లింలు ప్రయత్నించారు కానీ వారి అస్పృశ్యతను దూరం చేసే ప్రయత్నం చేయలేదు. వారు ముస్లీంలుగా మారడం వలన వారి కులంలో కూడా వెలివేయబడ్డారంటే అప్పటి ఆచార వ్యవస్థ, కుల వ్యవస్థ ఎంత పకడ్బందీగా ఉన్నాయో తెలుస్తుంది. ఈ విషయం స్పష్టం కావాలంటే ఈ కింది సంఘటన చక్కని ఉదాహరణ.

హరిజనులు ముస్లింలుగా, మారిన తర్వాత భోజనాలనుపెట్టే సమయంలో "మేం మాదిగోండ్లతో తినముండి. తురకోండ్ల మైతే మాత్రం కులం తగ్గుతదా, మాదిగోండ్లు, మాదిగోండ్లే మాలోండ్లు, మాలోండ్లే" అని మాలలంతామేం తినమంటే మేం తిన మని లేస్తారు.

చాలా వరకు నవలల్లో కొందరు వ్యక్తుల జీవితానికి సంబంధించిన చిత్రణే కన్పిస్తుంది. అయితే దాశరథి వారు కొందరు జీవితాలను గాక అప్పటి సమాజానికి సంబంధించిన సంపూర్ణ గ్రామ జీవితాన్నే కథా వస్తువుగా స్వీకరించి నారు. ఒక గ్రామంలో రెడ్డి, కరణం, రైతు, కోమటి, చాకలి, మంగలి, మాల మాదిగలు గ్రామ వ్యవస్థలో గ్రామ జీవితానికి సప్తాంగాల వంటివారు. వీరే ఆలంబనగా నడుస్తున్న గ్రామ వ్యవస్థలో పడికట్టు రాళ్ళవలె ఉన్న కొన్ని అమానుషమైన ఆచారాలను దారుణమైన అధికార లాంఛనాలను నవలలో చిత్రించారు. ఆనాడు గ్రామాలలో పెత్తందార్ల అధికారాన్ని అలవాటుగా విధిగా అంగీకరించడమే కానీ ఆలోచించడానికి ప్రశ్నించడానికి వీలులేదు.

కరణం వెంకట్రావుకు లంబాడీలతో గొడవ జరిగిన సంఘటనలను పరిశీలిస్తే ఈనాటి లాగే గ్రామ పెత్తందార్ల, ఆగడాలకు పోలీసుల వత్తాసు ఆనాడు కూడా ఉందని అర్థమవుతుంది. కచ్చడపు బండి నుంచి అమీన్ సాబ్ దిగగానే ఒక మస్కూరు పరుగెత్తి కోమటింట్లోంచి చాకలి వానితో మంచం తెప్పించి వేశాడు. ఖాకీ యూనిఫారంలో ఉన్న అమీను తన చేతిలో ఉన్న కత్తిని కర్రను మంచం మీద పెట్టి కూర్చొని అరే! మస్కూర్ నీళ్ళ ఘడా ఏదిబే! అన్నాడు మస్కూరు పరుగెత్తి కుమ్మరి వానితో నాలుగు కూజాలు పట్టించుకొని వస్తాడు. కుమ్మరి అమీన్‌కు వంగి సలాం చేశాడు. కుండలు పెట్టడానికి సావట్లోకి వెల్తుంటే "ఏం బే!మస్తీ ఎక్కిందీ బే నీకు, సర్కారు వస్తదని ఎర్రెబీ ఘడాల్పెట్టవ్! చమ్డ ఒలిపిస్తా అని ఉరిమాడు అమీను.

"మస్కూరాయ్న రాంగనే పట్టుకొస్తనే ఉంటి గులాపోన్న"

"అం! జవాబ్బీ చెప్తవ్ బే బద్మాష్" అని కర్రతో కుమ్మరిని బాదుతాడు. ప్రభుత్వానికి హరిజనులే కాదు. ఇతర కులాల వారు కూడా భయపడతారు. ఇదే సందర్భంలో కోమటి వెంకయ్యను, గౌండ్లను ఇబ్బంది పెడ్తాడు. ఇది ఆనాటి ప్రభుత్వ అధికారుల ఆగడాలకు నిదర్శనం ఈ ప్రభుత్వం దుశ్చర్యలు గ్రామాలలో మాత్రమే ఉంటాయని పాఠకుడు సందేహించ నవసరం లేదు. ఎందెందు వెతికి చూచిన, అందందే గలదు అన్నట్టుగా పట్టణాలలోనూ, మా ఈ చర్య కన్పిస్తుంది.

ఉదా: సారంగపాణి హైదరాబాదు వచ్చి మాడపాటి హనుమంతరావును కలిసిన తర్వాత రోడ్డు వెంట వెళుతుంటే ఒక విచిత్ర సంఘటన కనిపించిందతనికి

"సైకిలు మీద ఒకతను వెలుతుంటాడు. పోలీసు వాడు వాడిని ఆపి "సైకిల్ కోలైట్ కహా హై" అని అడిగితే దిన్ మే లైట్ క్యాసాబ్ అని సైకిలు వాడంటాడు. పోలీసు- "సైకిల్ కో లైట్ రహనా! దిన్ క్యా రాత్ క్యా" అని సైకిలు లాక్కొని సైకి లెక్కి బయలుదేరపోతుంటే సైకిలు వాడు ఏదో కోపంగా అంటాడు. సైకిలు వాడిని తన్ని తన బాటను తాను వెళ్ళిపోతాడు. ఇది ఆకాలంలో పోలీసుల నిత్య చర్య. వారికి ఇది అతి సాధారణ విషయం అంటే ఆనాటి అణగారిన ప్రజల ఆర్తనాదాలు ఏ విధంగా ఉన్నాయో అర్థం చేసుకోవచ్చు.

ఆనాడు గ్రామాలలో దొరల అకృత్యాలకు పీరిగాని మృతి ఒక నిదర్శనం. గ్రామంలో ఉన్న చెట్లు తన సొంత చెట్లు కూడా కాదు. ఆ చింత చెట్ల నుండీ చింతకాయలు తెంపాడని దొర పీరిగాన్ని ఆవేశంలో కొట్టి వాని చావుకు కారణం అయ్యాడంటే దొరల అహంకారాలు తెలుసుకోవచ్చు. వృత్తులు, ఉద్యోగాలు, పరిసరాలు పరిస్థితులు ఆర్థిక సమస్యలు మన విశ్వాసాల విషయంలో ప్రముఖ పాత్ర వహిస్తాయి. ఇక్కడ దొర పీరిగాన్ని చంపడానికి కారణం అతని పరపతి తగ్గుతుందనే భయమే.

కరణం వ్యక్తి కాదు దౌష్ట్యము మోసము కలిసిన రూపము. ఇతరుల ధన మాన ప్రాణాలు నిలువునా తీసి నిండు కుండలా నిలకడగా వుండే నేర్పు కలవాడు. అతని బుద్ధి కత్తికన్నా పదును ఆ కత్తికి ఎరగాని వ్యక్తి లేడు. పుల్లి భర్త వీరయ్యను చంపి మామిడి తోటలో పాతి పెట్టడం లంబాడీలను భూముల విషయంలో మోసం చేయడం లంబాడోల్ల లక్ష్మి భర్త బీక్యా మరణానికి కారకుడు కావడం, తన భార్యకు పిచ్చి పట్టడానికి కారణం ఇలా ఇతని పాపాలు వర్ణనాతీతం. అందుకే చివరికి లంబాడీల చేతిలో చస్తాడు. అన్యాయం మితిమీరితేఎవరికైనా కోపం వస్తుంది. ఆ ఆవేశం మనిషి

మరణానికి కూడా దారి తీస్తుంది. ఈ ఘట్టాన్ని దాశరథి వారు 'గ్రామం అంటే పోరాటం' అన్ని రీతిలో చిత్రించారు.

లంబాడోళ్ళు పోలీసు స్టేషనులో ఉన్నప్పుడు కుమ్మరి మాటలను బట్టి ఆనాటి జనజీవితం తెలుస్తుంది. "ఈ దేశంల ఏమన్న సర్కారున్న దనుకుంటున్నావ్ర దొరలు కరణాలే రాజ్యమేలతాను) పోలీసోళ్ళు వాళ్ళ చేతిల కుక్కలు ఎప్పుడిరగడై పోతదో ఈ దొరల రాజ్యం"

గ్రామంలో జరిగే ప్రతి సంఘటన దొర సమక్షంలోనే జరుగుతుంది. 1938లోనే న్యాయస్థానాలలో కూడా ఉన్నవాడిదే న్యాయం లేనివానిది పాపం అన్న స్థితి పై మాటలలో ధ్వనిస్తుంది. దీనికి ఉదాహరణలు లక్ష్మీ కేసు, బీక్యా మరణకేసులే.

ప్రజల చైతన్యానికి ఉత్తేజం ఉద్దీపన భూమి సమస్యే. భూస్వామ్య వ్యవస్థ వికృత దశను చేరుకొని ప్రజల జీవితం ఏ విధంగా దుర్భరం చేసిందో ఇందులో కన్పిస్తుంది. ప్రభుత్వం తన కర్తవ్యాన్ని మరచిపోతే ఇక ప్రజలే తమ కర్తవ్యాన్ని ఎంచుకుని నిర్వహిస్తారు అని నవలలో కరణం మరణం ద్వారా దాశరథి తెలిపారు. సాంఘిక చైతన్యం, సాంఘిక విలువలు, సాంస్కృతిక దృక్పథం, స్త్రీ పురుష సంబంధాలు, ప్రేమ, రక్త సంబంధం రాజకీయ సంబంధంలోకి చైతన్యంగా ఎదిగే క్రమం నవలలో కన్పిస్తుంది.

కరణం ఇంటి ముందు లంబాడీల గుంపు భోజనాల ఘట్టం, బతకమ్మను పేర్చేందుకు తెచ్చిన పువ్వులు, పువ్వులు దొంతరలుగా పేర్చడంలో స్త్రీలు ప్రదర్శించిన నేర్పు ఆనాటి ఆచార వ్యవహారాలకు సంప్రదాయాలకు మచ్చు తునకలు. బతకమ్మను పేర్చడంలో కూడా దొరలదే పైచేయి ఆనాటిపెత్తందార్లందరూ కళలను కూడా తమకు అనుకూలంగా మలచుకున్నారనిస్తుంది. బహు భార్యత్వం ఫ్యూడల్ సాంఘిక నీతి అంగీకరించిన ఆచారం, ఇతర స్త్రీలను ఉంపుడు కత్తెలుగా ఉంచుకోవడం ఒక ప్రతిష్ఠగా ఉండేది. "చిల్లర దేవుళ్ళు'లో ఆడబాప వనజ బహుశా పుట్టుక నుంచి చచ్చే వరకు అడుగడుగునా భూస్వామ్య వ్యవస్థ చేసిన గాయాలతోను మచ్చలతోను గడిపింది. ఆనాటి స్త్రీ స్థితికి ప్రత్యక్ష సాక్ష్యం వనజ, వనజలా కాకపోతే పురుషాహంకారానికి బలి అయిన మరో స్త్రీలా, రెండు రకాల స్త్రీలు ఈ నవలలో కన్పిస్తారు.

ఈ విధంగా నాటి చారిత్రక సామాజిక సాంఘిక పరిస్థితులను ఆధారం చేసుకుని తెలంగాణా విమోచనానికి తనవంతు సాయం చేసే ప్రయత్నం చేశారు. తెలంగాణా

మాండలిక భాషలో పాటు వాస్తవి కత ఈ నవలను ఉన్నత స్థానానికితెచ్చింది. నవలయినా, నాటకమయినా, కథానిక అయినా కృత్రిమత్వం మితిమీరకుంటేనే రాణిస్తుందనేది చారిత్రక సత్యం. జన జీవితాన్ని ప్రతిబింబించే విధంగా ఈ నవలను చిత్రించి దాశరథి 'చిల్లరదేవుళ్ళ' ఆగడాలను పోరాటం ద్వారా ఎదుర్కొమ్మని ఉపదేశించారు.

ఈ విధంగా ఆయా కులాల వర్గాల గ్రామాల పట్టణాల స్థితి గతులను ఆయా ప్రాంతాలలో నివసించే ప్రజల మనస్తత్వాలను పరిస్థితుల కనుగుణంగా నడిచే మనిషి బుద్ధిని ఈ నవలలో చిత్రించారు. ఇంత సూక్ష్మాతి సూక్ష్మంగా జన జీవితాన్ని పరిశీలించిన నవలలు తక్కువ. అందునా ఉపదేశ పూరితమైన 'చిల్లర దేవుళ్ళు' వంటి రచనలు అరుదు. అందుకే చిల్లర దేవుళ్ళు నాటికీ నేటికీ జన జీవన చిత్రణలో మహోన్నత రచన.

గ్రా - చందుపర్ల -(బి), నల్గొండ జిల్లా - 508 213.

# జాగృత !

కె.కె. రత్నాలు
ఎం.ఏ. ద్వితీయ, ఆర్ట్స్ కళాశాల

నేను నిర్మించుకున్న ఆశా చంద్ర శాలలో
కాలం కరిగి చీకటయింది
నా గుండెలో ప్రతి నిమిషం
ఏడుపు గట్లవార పాట వినిపిస్తూనే ఉంది
ఎందుకో తెలుసా?
అన్న! స్వార్థంతో తమ్ముణ్ని చంపిన
దృశ్యాన్ని నేను చూసాను.
ఎంత అర్థ విహీనమై పోయింది సర్వం.
ఆవేళ పూవులన్నీ వాడిపోయిన రోజు
నిజం నమ్మలేక పోయాను నేను.
సన్నని చార కట్టిన రుధిరం
నా కళ్ళలోకి పాకినట్లనిపించింది
నా అడుగుల క్రింద కపాలాలు
వికృతంగా నవ్వినట్లనిపించింది
అగ్ని పర్వతాలు పగిలినట్లనిపించింది
నా రోదన నాలోనే బలవంతాన ఆపుకున్నాను
'గల గలా ఫెళ ఫెళా విరిగిపడుతుంది
స్వార్థానికి బలి చేసిన వీని రంగు
గాజు పెంకుల మేడ ఒకనాటికి' అని
నా మనస్సులో నేను ఇట్లా అనుకున్నాను, కాని

చట్టాలూ, న్యాయ శాస్త్రాలు
వానినేమీ చేయలేక పోయినాయి
అంతా స్వార్థం
డబ్బు మయం, కాని
ఓ స్వార్థ పరులారా!
న్యాయం తన భద్ర ఛత్రం విప్పినపుడు
ధర్మం న్యాయరక్షణ బావుటా ఎగురవేసినపుడు
నవ్వి, అరచి,
చప్పట్లు చరచే
చీకట్లకు ఉరికొయ్యలు
మొలుస్తాయి జాగ్రత్త!

ఇం.నె. 128, గౌతమి నగర్, వనస్థలిపురం

# అంతర్ ఘోష

కె. రాములు

ఎం.ఏ., ప్రథమ, పి.జి. కళాశాల

ఏదో చెయ్యాలని, చెయ్యమని
న్యాయాన్ని ఎదుర్కొనమని
దేశ ద్రోహుల నుండి భారతమాతను రక్షించమని
సమ సమాజ స్థాపన చెయ్యమని
మతాల మారణహోమాలు వద్దని
కులాల కుమ్ములాటలు మంచివి కాదని
నిరంతరం నా వెంట ఉండే
నా మనసు చెబుతుంది
దానికి తెలియదు పాపం
మానవత్వం ఇక్కడ చచ్చిన శవమని
బురదలో కూరుకుపోయిన
వ్యవస్థ జీవిని నిర్జీవి చేస్తుందని....

గ్రా. పుల్సుమామిడి, మ. వికారాబాద్, జి. రంగా రెడ్డి - 501 101.

# కృష్ణశాస్త్రి కవితా వైభవం

యస్. అపర్ణ

ఎం.ఏ. ద్వితీయ, మహిళా కళాశాల.

స్వేచ్ఛ కోసం అలమటించి మానవతకు నీరాజనం పట్టి, సౌందర్య దాహంతో తపించి, ఊర్వశీమ్మూర్తిని ఎదనిల్పుకొని, కన్నీరు మానవ హృదయ మాలిన్యాన్ని కడగగలదని భావించి ప్రణయంలో ప్రకృతిని ఈశ్వరుని దర్శించి ప్రతి మనిషి నడిచే దైవమని నమ్మిన మహాకవి శ్రీ దేవులపల్లి కృష్ణ శాస్త్రి అయన తూర్పు గోదావరి జిల్లాలో పిఠాపురానికి సమీపంలో ఉన్న చంద్రంపాలెంలో క్రీ.శ. 1897లో ఒక విద్వత్కవి కుటుంబంలో జన్మించారు. శ్రీ చెళ్ళపిళ్ల వెంకట శాస్త్రి "దేవులపల్లి వంశమున దేవులు పుట్టిరి." అని ఈ వంశాన్ని ప్రస్తుతించారు.

తండ్రీ, బాబయ్య, ఇద్దరూ చంద్రంపాలెం నుండి పిఠాపురం రాజస్థానానికి వెళ్ళినపుడు బాలుడైన కృష్ణశాస్త్రిని తీసుకొని వెళ్ళేవారు. తమ పాలికాపు మూపు మీద కూర్చొని పిఠాపురం వెళ్తూ తండ్రుల సాహిత్య సంభాషణ ఆయన ఆలకిస్తూండేవారు. తన పదవ యేటనే "నందనందన ఇందిరానాధవరద" అనే పద్యం చెప్పారు. పదవ యేట రామతీర్థంలో కవిత చెప్పారు. తండ్రి పెద తండ్రులి[illegible]ద్ది కాలవ్యవధిలో కాలధర్మం పొందారు.

తర్వాత కాలంలో "కృష్ణ పక్షము" అనే కావ్యాన్ని పిఠాపురం రాజారావు వెంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దూరు వారికి అంకితమిస్తూ

"తరుణ శృంగార మధుర మాధవుడ వీవు
కలికి పాటల కోయిల కొలము మాది
తావకీన సభావన తరువితాన
శాఖజల నిత్య నూతన స్వాదుగా,
జీవసారము గురించి చివురులెత్త
బాడుకొన్నారు మాకులస్వాములెల్ల
స్వచ్ఛకీర్తి! మనోజ్ఞ వసంతమూర్తి
పిక కుమారకు నన్ను బాడుకొననిమ్ము
మాలగా దొలిపాటలు పూలతోడ

హృదయమే కూర్చి నీ కొఱకెదురు చూతు!"నన్నారు. తన పిత్రూణాన్ని కృష్ణ శాస్త్రి యీ విధంగా తీర్చుకున్నారు.

పుంఖాను పుంఖంగా వెలువడిన కృష్ణశాస్త్రి రచనలు వారి అలసత్వం వల్ల చాలా ఆలస్యంగా గాని అచ్చుకాలేదు. ఇప్పటికీ పుస్తక రూపం ధరించని రచనలు ఉన్నాయి. పుస్తక రూపంలో వచ్చిన వాటిలో "కన్నీరు" కృష్ణపక్షము, ప్రవాసము,ఊర్వశి, మహతి, పల్లకీ, బుగ్వీధి అప్పుడు పుట్టి ఉంటే, బహుకాలదర్శనం, పుష్పలావికలు, శర్మిష్ఠ ధనుర్ధాసు, తిరుప్పావు మేఘమాల , అమృతవీణ, మంగళకాహళి, వ్యాసావళి 4 సంపుటాలు ప్రధానమైనవి. ఇంకా వెలుగు చూడవలసినవి "క్షీరసాగర మధనం, విప్రనారాయణ చరిత్ర, మాళవికాగ్నిమిత్రం, రామానుజకథ, ముఖలింగం : శివకవికథ, ప్రసన్న పారిజాతం, విశ్వదాభిరామ వినుర వేమ" మొదలైనవి ఉన్నాయి.

"కాళిదాస భవభూతుల, యామున వేదాంత దేశికుల తిక్కన పెద్దనల కబీరు సూరదాసుల, షెల్లీ, బైరనుల వరసలో నిలబడే కవి కృష్ణశాస్త్రి" అని తిరుమలరామచంద్ర కవిత్వంలో కృష్ణశాస్త్రి ఉన్నత స్థానాన్ని గురించి తెలిపారు.

"విశ్వనాథ - కృష్ణశాస్త్రి-శ్రీశ్రీ" అనే యీ ఆధునిక కవిత్రయంలో ఒకరైన దేవులపల్లి వారి కవితావైభవాన్ని, చూపుడు వేలితో చందమామను చూపినట్లు చూపటమే నా చిన్న ప్రయత్నము

## కృష్ణశాస్త్రి కవితా వైభవము

"చిననాటి భావవల్లిని పూచినది, వాడ
నిది, వాసనల వీడనిది, ఒకండు
కోరిక నాల్గు దిక్కుల భూ భువన మంత
లవలేశమును వదలకయె తిరిగి
ప్రతిగేహగేహళి పదమాగి ప్రతి హృద
యద్వార తోరణమట్టెత్రోసి
లోనికి జొచ్చి నాలోని స్నేహక్షీర
మొక్కింత ఒక్కింత ఒలకబోసి

"అనుగు సోదర మరలి రానా యటంచు
సెలవడిగి సాగి పోయెడు చిర పథికుడు
కావలయునంచు ఆశ ఆకాశమంత
పటిమ ధీన విహంగ మిప్పటికీ అంతె -"

భారత జాతి మొట్టమొదటి రిపబ్లిక్ దినోత్సవ శుభ సందర్భంలో గొంతెత్తి తెలుగు కవి సకల మానవ జాతి కోసం పలికిన శుభాశంసనమిది. మనిషిని పిచ్చిగా ప్రేమించిన మనిషి శ్రీ దేవుల పల్లి కృష్ణశాస్త్రి. ప్రతి హృదయ ద్వార తోరణమూ తెరిచి మనస్సు లోపలికి ప్రవేశించి తనలోని క్షీరాన్ని ఒలకబోసి 'అనుగు సోదర!' అని నోరారా పిలిచి "మరలిరానా' ' అంటూ సెలవు తీసుకొనే మహాపథికుడాయన. ఆయన జీవితం ఒక నిరంతర అన్వేషణ. మనిషిలో దాగి ఉన్న మనిషిని వెతుక్కొని ఆ మానవత్వాన్ని పూజించిన మహాకవి కృష్ణశాస్త్రి, అందుకే ఆయన

ప్రతి మనిషీ నడిచే దైవం
ప్రతి పులుగు ఎగిరే దైవం
అడుగడుగున గుడి ఉంది
అందరిలో గుడి ఉంది - అని సంభావించారు.

"సృష్టిలో తీయనిది స్నేహమేనోయి!" అన్న ఇంద్రగంటి వారి వాక్కును సార్థకం చేస్తూ సృష్టికంతటికీ స్నేహ క్షీరాన్ని పంచి పెట్టడానికి పూనుకున్నారు కృష్ణశాస్త్రి తోడుగా మనుష్యులు లేకపోతే తోచేది కాదాయనకు. కొందరు కవులు తమ మనస్సుకు నచ్చిన పుస్తకాలుంటే తమకింక మరింకేమీ అక్కరలేదంటారు. కాని కృష్ణశాస్త్రి మాత్రం తనకు మనుష్యులు తోడు లేకపోతే జాగిలా పడిపోతాననేవాడు.

"ఏను స్వేచ్ఛా కుమారుడ నేను గగన
పథ విహార విహంగమ పతిని నేను
మోహన వినీల జలధరమూర్తి నేను
ప్రళయ ఝంఝూ ప్రభంజ స్వామి నేను"

ఈ "నేను" అనే ఖండ కావ్యంలో కృష్ణ శాస్త్రి స్వేచ్ఛా కుమారుడననీ, ఆకాశ వీధిలో విహరించే విహంగమ పతిననీ, నీల మేఘశ్యాముడననీ తెలిపారు. అంతటితోఆగక తనను ఝంఝూ ప్రభంజన స్వామిగా కూడా అభివర్ణించుకున్నారు. ఆయన తీసుకు వచ్చిన ప్రళయ ప్రభంజనం ఏమిటి? అని ఆలోచిస్తే "జగము నిండ స్వేచ్ఛాగాన

ఘురులు నింపటం. క్రౌర కౌటిల్య కల్పిత కఠిన దాస్య శృంఖలములు చెదిరిపోయేటట్లు చేయటం ఇంకా ఎన్నో విధాల ప్రళయమే అనదగిన మార్పు తేవటం జరిగింది.

మహాభక్తుడైన కృష్ణశాస్త్రి తీవ్ర స్వరంతో "రాజవీధుల రతనాల రథము నెక్కి వెడలు నిర్జీవ పాషాణ విగ్రహంబు! చిమ్మ చీకటి పొగల నిశీథమందు, క్షుద్రమందిరాంతర జీర్ణ కుడ్య తలములందు కన్నులు మూసి, ఒడలు మరచి కులుకు దివాంధమా చలువరాతి మేడల చెఱసాల లందు తళుకు బంగారు సంకెళ్ళు దాల్చి, లోకపాలకుని బోలె మరియునో బానిసీడ"! అని దైవాన్ని సంబోధించి "నేను స్వేచ్ఛాకుమారుడను" అని ఘంటాపథంగా పల్కడం జంఝా ప్రభంజనమే!

"ఆకులో ఆకునై పూవులో పూవునై
కొమ్మలో గొమ్మనై నునులేత రెమ్మనై
ఈ యడివి దాగిపోనా! ఎట్లైన నిచటనే యాగిపోనా!
ఆకలా దాహమా, చింతలా వంతలా
ఈకరణి వెట్టినై యేకతమ తిరుగాడ
ఈ యడవి దాగిపోనా! ఎట్లైననిచటనే యాగిపోనా!

నవ్యకవులకు ప్రకృతి నూతన రూపంలో కన్పించసాగింది.

ఒకప్పుడు కృష్ణశాస్త్రి నల్లమల అడవుల గుండా రైలులో ప్రయాణం చేస్తున్నారట! రైలు చప్పుడులో ఊయలల నూపినట్లుగా కదులుతున్న ప్రయాణంలో చూచినంత మేరా పరుచుకున్న అడవి సౌందర్యం ఆయనను ముగ్ధుణ్ణి చేసింది. ఆ ప్రకృతి సౌందర్యానికి పరవశించి "ఆకులో ఆకునై, పూవులో పూవునై ఆకులో ఆకుగా భావించుకోవడమూ, అడవిలో దాగిపోనా అనుకోవటమూ నవ్య కవిత్వానికి కూడ నవ్యభావన.

"గలగల మని వీచే చిరుగాలిలో కెరటమ్మై. జలజలమనిపారే సెల పాటలో తేటనై యీ యడవి దాగిపోనా?" అన్నారు. ఇంకా "పగడాల చిగురాకు తెరచాటు తేటినై! పరువంపు విరిచేడై చిన్నారి సిగ్గునై యీ యడవి దాగిపోనా? అని కూడా అన్నారు. ఎఱ్ఱని చిగురాకు చాటున దాగిన తేటిని పగడాల చిగురాకు తెరచాటు తేటిగా ఊహించటం కొత్త ఊహా అంతకంటే బాగా వికసించిన పుష్ప సౌందర్యాన్ని పరవంపు విరిచేడె చిన్నారి సిగ్గుగా తలచటం ఇంకాకొత్త భావన "తరులెక్కి అలనీలగిరి నెక్కి మెలమెల్ల జడ లెక్కి జలదంపు నీలంపు సిగ్గునై - యీ యడవి దాగిపోనా!" అన్నారు తరువు నీలగిరి చదలు, జలదమూ అన్నీ నీలమే. అంతేగాక సిగ్గు కూడ నీలంపు సిగ్గు" అనటం కవి భావనా వైచిత్రిని తెలుపుతున్నది

"ఇది మల్లెల వేళయని ! ఇది వెన్నెల మాసమని
తొందర పడి ఒక కోయిల
ముందే కూసింది!
విందులు చేసింది!!"

రచించిన సినిమా పాటలన్నీ కవిత్వమే అనిపించే విధంగా రచించిన ఖ్యాతి తెలుగు సినిమా కవులలో కృష్ణ శాస్త్రికి వున్నది. ఆయన పాటలలో మార్దవం సినిమా ప్రేక్షకులందరికీ తెలుసు "ఆయన పాటలు పాడే పాత్రలు గొప్ప కవులు కానక్కర్లేదు. అయినా వాటిలో స్వచ్ఛమైన కవిత్వం వుంది. ఈ సామరస్యాన్ని సాధించిన జీనియస్‌ను విశ్లేషించటకు సాధ్యం కాలేదు" అని కొడవటిగంటి కుటుంబరావు కృష్ణ శాస్త్రి గారి సినిమా పాటల ఔన్నత్యాన్ని కొనియాడారు.

"సుఖదు:ఖాలు' సినిమాలో ఒక సామాన్యపాత్ర సన్నివేశాని కనుగుణంగా పాడిన పాట "ఇది మల్లెల వేళయని! ఇది వెన్నెల మాసమని తొందరపడి ఒక కోయిల ముందే కూసింది! విందులు చేసింది! అనేది అయినా జీవితంలో ఎన్నో సందర్భాలకు యీ పాటనువర్తింప జేసుకోవచ్చు.

"కసిరే ఎండలు కాల్చుననీ! ముసిరే వానలు ముంచుననీ, ఎరుగని కోయిల ఎగిరింది. విరిగిన రెక్కల ఒరిగింది? నేలకు ఒరిగింది! మరిచిపోయేది మానవ హృదయం! కరుణ కలిగేది చల్లని దైవం! వాడే లతకు ఎదర్రైవచ్చు! వాడని వసంత మాసం! వసివాడని కుసుమ విలాపం! ద్వారానికి తారామణి హారం! హారతి వెన్నెల కర్పూరం! మోసం ద్వేషం లేని సీమలో! మొగసాల నిలిచే నీ మందారం" అనే యీపాటలో "కరుణ కలిగేది చల్లని దైవం" అనే సందేశం మహత్తరమైనది.

## కృష్ణశాస్త్రి జీవన వేదాంతం

నేను హృదయ వాదిని వట్టి హృదయ వాదిని
నాకు కవిత్వం ప్రాణం
సంగీతం మరీని

అన్నిటికన్నా నాకు కావలసింది మనిషి అని కృష్ణశాస్త్రి తరచుగా అంటూ ఉండేవారు. ఆయన నిరంతర ఆశావాది. లోకమంటే వల్లమాలిన ప్రేమ. మనుషులంటే పిచ్చి ప్రేమ. ఎప్పుడు చుట్టూమనుషులు ఉండాలని కోరుకునేవారు కొలువు తీర్చినట్లు కూర్చోని మిత్రులతో గోష్టి సల్పటం ఆయనకు మిక్కిలి ఇష్టమైన పని.

'దిగిరాను దిగిరాను దివి నుండి భువికి' అనే పంక్తి స్వేచ్ఛాగానము కావ్య ఖండికకు సంబంధించినదే గాని ఆయన సాహిత్యమంతటికీ వర్తింపజేయదగినది కాదు. మామూలు మాటలలోనే ఆయన కవిత్వం చెప్తున్నట్లనిపించేది. రచనలు ఎంతో తీర్చిదిద్దినట్లు మామూలు మాటల స్థాయికి మించనట్లు ఉండాలని ఆయన కోరిక.

ఒక్కసారి చినుకులు టపటపా పడినట్లనిపిస్తాయి. కాని ఆయన చెవిలో మాత్రం పాట పాటగా వినిపిస్తాయి. నిత్యమూ సామాన్య జనుల మాటలలో నుండి కవిత్వాన్ని ఏరుకోవాలనేది ఆయన అభిమతం. కవి అన్నవాడికి చెవిలోపల చెవి ఉండాలనేవారు. చెవితో విన్న మాటలను గుండెలలో పదిలపరుచుకొని తగిన దానిని ఉపయోగించాలనేవారు.

కవిత్వ రచన ఆయన కొక తపస్సే. ఒక్కోసారి రచన అంతాపూర్తయి ఏ ఒక్క మాటో సరియైన పదం, పడినట్లనిపించక పోతే దాని కోసం ఎంత కాలమైనా నెలలు సంవత్సరాలైనా నిరీక్షించేవారు శబ్దం రంగూరుచీ వాసనా తెలిసిన కవి కావటం చేత ఆయన రచనలో పొల్లుమాటలకు తావిచ్చే వారు కారు.

విశ్వకవి రవీంద్రుడు కృష్ణశాస్త్రిగారికి ఆదర్శం. ఏవిస్మృత అయనాన ఏ ఆషాఢ ప్రథమ దివసాన వ్రాసి తివయా మేఘదూతను అని రవీంద్రుడు కాళిదాసును ప్రశ్నిస్తే కృష్ణశాస్త్రి రవికవిని ఫాల్గుణ సంధ్యా సమయాన ఏవైశాఖ పూర్ణిమా రజనీ ముఖాన నీ భావకావ్యాలను రచించి తివయా అని మరీ మరీ అడగాలని ఉంటుందన్నారు. ఎప్పటికీ వాడని పరిమళము చెడని కవిత్వం రచించిన కృష్ణశాస్త్రిని మనసున మల్లెల మాలలనూ, కన్నుల వెన్నెల డోలలనూ ఊగించిన కలికి పాటల కోయిలా ఎక్కడిది నీకీ కవిత అని అడగాలనిపిస్తుంది.

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి కృష్ణశాస్త్రి గారిని ప్రాచీన నవీన ప్రగతి వాదాల త్రివేణీ సంగమంగా భావించారు. ఔను శ్రీ ఆరుద్ర తలచినట్లు

"కొంత మందిది యువత
కొంత మందిది నవత
కృష్ణశాస్త్రి కవిత"

ఇం.నె. 1-5-79, ముషీరాబాదు, హైదరాబాదు.

# ఓ మనసా!

నీరుడు భద్రయ్య
ఎం.ఏ., ప్రథమ, పి.జి. కళాశాల

ఓ మనసా!
కిరణానికి వికసించే కమలానివి
నీరధిలో కెరటానివి
ప్రమిధలా వెలుగు నిస్తూ
సమిదలా కాలుతూ
మెరిసే మేఘంలా
కురిసే వర్షంలా
అనుక్షణం నిన్ను వేధిస్తూ
కంటికి రెప్పలా
ఈనాటి మన బంధం
కనిపించని నీ రూపం
సుఖం లేని యీ జీవితం
ఎన్నాళ్ళూ ఈ గమనం

గ్రా - బుద్ధారం, మం.జి. నల్గొండ - 508 001.

# నాలో నీవు

జీ. జ్యోత్స్న
ఎం.ఏ., ద్వితీయ, మహిళా కళాశాల

నీ భావమే ఒక ఆలోచనై
మెదిలింది నాలో
నీ రూపమే ఒక చిత్రమై
చిత్రించుకున్నా నాలో
నీ చూపు ఒక విరితూపుగా
ముద్రించుకుంది నాలో
నీ పలుకే ఒక రాగమై
పలికింది నాలో
నీ గీతమే ఒక ఆలాపనై
వినిపించె నాలో
నీ మనసే ఒక అద్దమై
కనిపించె నాలో
నీ నామమే ఒక గీతమై
మ్రోగింది నాలో
నీ స్పందనే నా భావానికి
ప్రాణ ప్రతిష్ఠ నాలో....

---

సింగరా చార్యులు
శంకర్ మఠ్, అభ్యుదయ నగర్, హైదరాబాదు.

# అత్యాధునిక కవితలో స్వప్న ప్రలాపన

ఎమ్వీ రమణ
ఎం.ఏ. ద్వితీయ ఆర్ట్స్ కళాశాల

ఆధునిక కవిత్వం (80 వరకు) ఒక సిద్ధాంతాన్ని ప్రాతిపదికగా, రాజకీయ నేపథ్యం భూమికగా తీసుకొని వచ్చింది. తెలుగు ...త్వం (అధునిక) శ్రీశ్రీ ప్రభావచ్ఛాయలు (వస్తుపరంగా, రూపపరంగా, శైలీపరంగా) లీలగానో, అంతర్లీనంగానో మనకు గోచరిస్తుంది. కాని 80ల తర్వాత వచ్చిన కవిత్వంలో పరిణామము గుణాత్మకంగా వచ్చిందని చెప్పవచ్చు. ఈ కవిత్వం "సామాజిక పునాదిని గుర్తిస్తూనే, దాని భిన్న కోణాల మూలాల్లోకి వెళ్ళింది. సంకుచితమైన పరిమితులన్నింటినీ నిరాకరించటం ద్వారా కవిత్వ స్థాయిని ఉన్నతం చేసింది". ఏ కాలంలోనైనా ఏదో ఒక రూపంలో కవిత్వం మారుతూ ఉంటుంది. కవిత్వంలో వస్తువు, శిల్పం, శైలీ మారుతూ ఉంటుంది. కవి జ్ఞాన పరిధిని బట్టి ప్రతీకలు మారుతుంటాయి.

"తెలుగులో కవితా విప్లవాల స్వరూపం" అనే తమ సిద్ధాంత గ్రంథంలో వేల్చేరు నారాయణ రావు" కవిత్వం మారినపుడు రచనా సూత్రాలు మారుతాయి ఆ మార్పుని విస్మరించి అంతకు ముందున్న కవిత్వ, ప్రమాణాలతో కొలవటం మొదలు పెడితే కవిత్వం కవిత్వం కాకుండా పోతుంది"- 80ల తర్వాత కవిత్వంలో వచ్చిన మార్పును గుర్తించి ఈ రకమైన కవిత్వాన్ని ఆధునికానంతర కవిత్వం అన్నారు. అఫ్సర్ ఆధునికానంతర కవిత్వానికి అత్యాధునిక కవిత్వం అని పేరు పెట్టాడు. నిజానికి అత్యాధునిక కవిత ఒక ఆల్కెమీ.

అత్యాధునిక కవిత్వంలో మనకు కనిపించనిఅంతర్ని గూఢమైన ప్రేరక, ప్రేరణ, వ్యక్తికి సమాజానికి ఉండే సున్నితమైన అంత: సంఘర్షణ, ఆ సంఘర్షణలో జనించిన వేదనా భరిత అనుభూతి, బాధాపరమైన జీవితం కనిపిస్తుంది. కవి ఇక్కడ "తన ఆలోచనను అనుభవంగా ప్రవేశ పెట్టకుండా అనుభవాన్ని అనుభవంగా. ఉద్వేగాన్ని ఉద్వేగంగా ప్రవేశపెట్టడం ద్వారా ఈ కవిత్వం సఫలీకృతం అయ్యిందనే చెప్పాలి. తద్వారా ఆత్మాశ్రయ, వస్త్వాశయతల మధ్య మౌళిక భావన అదృశ్యమైంది.

కవి ఎన్నో కోణాల నుండి కవిత్వాన్ని సృజించినా తన మానసిక ప్రపంచాన్ని కార్యోన్ముఖుడిని చేసే, వాస్తవ, భ్రమల, సుఖదు:ఖాల, ఉద్వేగ, ఉద్రేకాలకి, ఆదర్శ

ప్రమాణాలకు నైతికతకు భూమిక అయిన సామాజిక ప్రపంచాన్ని విస్మరించలేడు. కవి ఆత్మిక మూలాలు సమాజ కోణాల్లోంచి వచ్చేవి అయ్యుంటాయి. సమాజం యొక్క ప్రభావం కవిపై ఉన్నట్లే కవికి సమాజం పట్ల బాధ్యత ఉంటుంది. అయితే కవి విషయంలో వ్యక్తీకరణ, సృజన ఒక్కొక్కప్పుడు స్పష్టంగాను, మరొక్కప్పుడు అస్పష్టంగానూ ఉంటుంది. కవి ఆశలు, ఆశయాలకు, విభిన్నంగా ఉన్న వాస్తవానికి కవి వేసే లంకె అస్పష్టతకు పునాదిగా మారుతుంది. వాస్తవాన్ని కవి అవగాహన చేసుకొని వ్యక్తీకరించే విధానంలో (యథాతథంగా) సంక్లిష్టత ఉండటం వలన కొంత అస్పష్టతకు దారి తీస్తుంది. నేటి అత్యాధునిక కవిత్వ సృజనలో ఈ అస్పష్టత వ్యక్తీకరణ బలహీనత వల్లకాక ఆత్మిక ప్రపంచంలోనూ, సామాజిక ప్రపంచంలోనూ ఉన్న సంక్లిష్టత వల్ల కలుగుతుంది.

నేటి యాంత్రిక యుగంలో ప్రతీ వ్యక్తి (కవితో సహా) సరళత నుండి మనో ప్రపంచంలో ఉన్న కేంద్రంలోకి ప్రయాణిస్తున్నాడు. అయితే ఇదంతా ఆత్మాశ్రయత అనుకోవడానికి వీలులేదు. ఎందుకంటే మారుతున్న మానవ విలువల్లో మనిషి మనోప్రపంచం కూడా ముఖ్య భూమిక నిర్వహిస్తుంది. వ్యక్తీకరణ విషయానికి వస్తే కవి తన ఉద్వేగాన్ని, ఆశయాలను వేదనను వ్యక్తీకరించడానికికొత్త ప్రక్రియ ఎన్నుకోవలసి వచ్చింది. అదే వచన కవిత్వానికి నాంది.

కవి అంతర్ముఖుడై, తన ప్రతిబింబాన్ని, విశ్వ ప్రతిబింబాన్ని అద్దంలో కాని స్థితిలో దర్శించి, ఆ దర్శనసారాన్ని పరిగ్రహించి వ్యక్తికరించిన స్థితి ఈ స్వప్న ప్రలాపన. ఇక్కడ ఫ్రాయిడ్ మనో విశ్లేషణ సిద్ధాంతం కనిపిస్తుంది. చేతనా అంత:చేతన ఘర్షణ గుప్తమైన సుషుప్తి స్థితి నుండి కవిని స్వప్న ప్రలాపన స్థితికి తీసుకు వెళ్ళింది. మనిషికి వరంలాంటిది స్వప్నం. కవి అంత: స్వాప్నికుడు అయితే సమాజానికి దోహదకారి అవుతాడు. అయితే వాస్తవ మూలాలను విస్మరించిన కవి కేవలం స్వప్నపు కారడవుల్లో సంచరించేవాడు అవుతాడు.

ఈ ధోరణి కవిత్వ వస్తువుపై భావ అనుభూతి కవిత్వచ్ఛాయ కనిపిస్తుంది. లీలగా గోచరించే స్వప్న భావాన్ని అందుకునే ప్రయత్నం బలంగా కన్పిస్తుంది. ఇలాంటి స్వప్న ప్రలాపన స్థితి తిలక్‌లో కనిపిస్తుంది. తిలక్ ఒక స్వాప్నికుడు. కాకపోతే సంస్కృతపదాడంబరత తన కవిత్వంలో కనిపించటం వలన అత్యాధునికుల సరసన చేర్చలేము. అలాగేశ్రీశ్రీలో కూడా ఈ స్థితి మనకు అగుపిస్తుంది. ఇప్పుడు వస్తున్న కవుల్లో కొందరు కవులలో, వారి

వారి కవితా ఖండికలలో ఈ స్వప్న స్థితి అక్కడక్కడ కనిపిస్తుంది. అయితే ఈ కవులలో పూర్తిగా స్వప్న స్థితి భూమికగా కలిగి కవిత్వం వ్రాస్తున్నవారిలో కనిపించేవారు అజంతా, వేగుంట మోహన్ ప్రసాద్, సిద్ధార్థ.

ఈ కవుల దృష్టిలో కవిత్వం స్వప్నానుభూతి పరమైన అనుభవాన్ని వ్యక్తీకరించటమే. వాస్తవికత పరిధిఅంతమై అధివాస్తవికతలోకి ప్రవేశించే తత్వం కనిపిస్తుంది. అజంతా 'స్వప్నలిపి'లో తన కవిత్వం గూర్చి చెబుతూ... "కవిత్వం ఒక స్వప్న ప్రక్రియ. నేను శోధన నాళికలలో జీవిస్తున్నాను, అర్థ సత్యాలతో జీవిస్తున్నాను. భిన్న భిన్న రసాయనచ్ఛాయలతో జీవిస్తున్నాను. భ్రమ, విభ్రమాలతో బ్రతుకుతున్నాను ఒక వైపు భయంకరమైన వాస్తవం మరొకవైపు కాలావధులకు అతీతంగా కలలపై పరిభ్రమిస్తున్న నైరూప్య ప్రపంచం. నా అన్వేషణ ప్రారంభం ఇక్కడే. ఉన్నది ఉన్నట్టుగా కనబడే ప్రపంచం వాస్తవం కానే కాదు. వాస్తవం ముసుగు తీయటమే వాస్తవం అంటే. మనిషిలో అంతర్భూతమై ఉన్న స్వప్న శక్తి సార్వభౌమాధికారాన్ని వినిర్గతం చేయటంద్వారా అతడు ఆశిస్తున్న కొత్త ప్రపంచాన్ని ఆవిష్కృతం చేయగలగాలన్నదే నా కవిత్వ పంథా! స్వప్న విద్య నాకు పుట్టుకతో వచ్చినదే. అంతా ఒక 'చిత్కళ' చిత్ర విచిత్ర, వాక్య సముదాయం స్వప్న లిపి అంటే ఇదే, అజేయంగా ఉన్నదల్లా స్వప్న శక్తి".

అజంతాలో స్వప్నాన్వేషణలో సత్యాన్ని శోధించటంలో తపన కనిపిస్తుంది. స్వప్నాల్లో సత్యాన్ని అన్వేషించటం కోసం జీవిస్తున్నట్టనిపిస్తుంది. అందుకే "ఉన్నది ఉన్నట్టుగా కనబడే ప్రపంచం వాస్తవం కాదని వాస్తవం ముసుగు తీయటమే వాస్తవమని' అది కేవలం స్వప్న జగత్తులో సాధ్యమని ఇతని విశ్వాసం. స్వప్నాలలో వాస్తవం అసలు రూపం దొరుకుతుందని చెప్పటం విమర్శకులకు మింగుడు పడని విషయం.

"చీకట్లో ఉన్నవాడే జీవన రేఖపై అఖండ దీపాన్ని స్పష్టంగా చూడగలడని"అన్న వాక్యంలో చీకటి అంటె శూన్యమని చాలామంది అభిప్రాయం. స్వప్నం జీవితం మీద ఎటువంటి ప్రభావం చూపదని అభిప్రాయపడుతుంటారు. అజంతా అందరికి భిన్నంగా ఉంటాడు. స్వప్నంలో సత్యం గ్రహించి వాడే, అందరికి తాను కనబడకున్నా అందరిని తనలో చూసుకుంటాడు'

"అంతా ముసుగేసు కున్నవాళ్ళే
అక్షరాలకు ముసుగు; ఆలోచనలకు ముసుగు
ముఖం వెనుక మరో ముఖం, స్వచ్ఛమైన
సూర్యోదయాలను అంతా భూస్థాపితం చేసుకున్నవాళ్ళే"

భౌతిక ప్రపంచంలో జరుగుతున్న గారడీలు కవి మనసును గాయపరచాయి ఆ గాయాలు మానకుండ ఎప్పుడూ బాధ పెడుతుంటాయి. ఆ బాధ వెనుక విషాదం ఈ రూపంలో అంటే స్వప్న ప్రలాపన స్థితిలో కనిపిస్తుంది.

"జీవన వ్యూహంలో మనిషి
శిలా విగ్రహంగా మారుతున్న దృశ్యం చూడలేను, చూడలేను
నిత్యం అదే జీవితం, అదే రోడ్డు, అదే గోడ
అదే గడియారం, అదే ముఖం, దుస్సహం, దుర్భరం"

మానసిక ప్రపంచం బహిష్కరించిన వాస్తవాల ప్రతిమలు నిరంతరం ఏదో రూపంలో స్వప్నంలో వెంటాడుతుంటాయి. పై వాక్యాలలో ఈ స్థితి ప్రత్యక్షంగా కన్పిస్తుంది.

ఇదే ధోరణిలో వేగుంట మోహన ప్రసాద్ తనదైన సొంత ముద్రలో కనిపిస్తాడు. వచనంలా రాస్తూనే పద్య వ్యవస్థని విచ్ఛిన్నం, చేయటం ఆయన కవిత్వ, నిర్మాణంలో ప్రధానాంశమైంది ఈయన కవిత్వంలో శబ్దాలకున్న పాత అర్థాల్ని పొగొట్టే ప్రయత్నం కనిపిస్తుంది.

వేగుంట మోహన ప్రసాదు తన కవిత్వం గూర్చి చెప్పుకునేప్పుడు "నా కవిత్వమేనాకు అర్థం కాదు నేను కాని స్థితిలో సమాజానికీ శూన్య గోళాన్ని ఊహించుకుంటు అనుభవిస్తున్న స్థితిలో భాషని, సంభాషణ కోసం గాక, డైలాగ్‌గా గాక 'DUELOGUE' గా ఉపయోగించుకున్నప్పుడు ఈ అక్షరాలు నేనేం చేసుకోను అనుకునేటప్పుడు కవిత్వం లాంటి అక్షరాల్నే రాస్తాను అవి నాకు అర్థం కావు"

స్వప్నావస్థలో ఉన్నప్పుడు మనిషి మరో ప్రపంచంలో సంచరిస్తుంటాడు. ఒక మానసిక అగమ్య గోచర స్థితిని అనుభవిస్తుంటాడు ఆ అనుభవాన్ని తిరిగి యథా ప్రపంచానికి వచ్చేసరికి కళ్ళ ముందు వాస్తవం భ్రమగా కనిపిస్తుంది తద్వారా మనో ప్రపంచానికి బద్ధుడైన తను ఒక నిర్దిష్ట క్రమంలో ప్రయాణించలేక పోతున్నాడు. అందువలన అధివాస్తవికత వైపు దృష్టి సారించి అక్కడ అలసట తీర్చుకుంటాడు. కావున కవి ఇక్కడ స్వప్న ప్రలాపన స్థితిని ప్రత్యక్షంగా కాక పరోక్షంగా అంగీకరిస్తున్నాడు అన్న మాట.కాబట్టి "నేను కాని స్థితిలో సమాజానికీ, ఎవరికీ కాని స్థితిలో శూన్యగోళాన్ని ఊహించు కుంటూ!" అని అంటాడు మోహన్ ప్రసాదు ,ఈయన వ్యక్తీకరించిన ధోరణి

అర్థం అపేక్షించకుండ, స్వచ్ఛందంగా స్వేచ్ఛగా ఉద్దేశ్య రహితంగా రాస్తున్నట్టు అనిపిస్తుంది.

వేగుంట మోహన ప్రసాదు కవిత్వానికి, కవిత్వంలో వస్తు రూప, శైలికి ఒకానొక ప్రేరకం స్వప్నం. ఈ క్రింది వాక్యాలు గమనించండి.

"ఎప్పుడు రైలెక్కుదామన్నా, అంతలోనే గార్డు బిగులూదుతాడు
పచ్చదీపం పిట్ట రెక్కలు విచ్చి గాలిలోకి ఎగరేస్తాడు, గర్భిణీ
రైలు తపోనిద్రలో వున్న శిశువుల్తో కదిలిపోతుంది
కాని నేను రైలందుకోలేను
రైలాగే అరుగుమీంచి, చేతుల్నిండా ఏవో కాగితాలుంటాయి'
టికెట్టు కొన్నట్లు జ్ఞాపకం లేదు, ఎక్కవలసింది ఏక్లాసో తెలియదు
కాగితాలు ఎగిరిపోతాయేమోనని భయం"

భయం స్వప్నానికి నాంది 'పచ్చదీపం పిట్ట రెక్కలు విచ్చి గాలిలోకి ఎగరేస్తాడు. నేను రైలందుకోలేను 'చేతుల్నిండా ఏవో కాగితాలుంటాయి' టికెట్టు కొన్నట్టు జ్ఞాపకం లేదు కాగితాలు ఎగిరిపోతాయేమోనని భయం' ఈ కవితాత్మక వచనాన్ని గమనిస్తే స్వాప్నిక స్థితి కనిపిస్తుంది. ముఖ్యంగా కవి తన ఆర్తిని స్వప్నంలో తీర్చుకుని, ఆ స్వప్న మిశ్రమ రూపకాల ప్రతీకలను అక్షరబద్ధం చేసి ఆయాసం తీర్చుకుంటున్నట్టనిపిస్తుంది. మోహన ప్రసాదులో 'చితి-చింత నుండి ఇప్పటి 'పునరపి' వరకు స్వప్నావేదన అధిక మొత్తంలో కనిపిస్తుంది.

అజంతా మోహన ప్రసాదు మార్గంలో మరోకవి తారసపడతాడు అతడు 'దీపశిల' సిద్ధార్థ. తెలుగు కవిత్వంలో నాలుగేళ్ళ క్రితమే దూసుకువచ్చిన సిద్ధార్థ తనకంటూ ఒక సొంత ముద్రను సృష్టించుకున్నాడు. ఇతని కవిత్వంలో అస్థిత్వ వేదనతోపాటు సత్యాన్వేషణ తపన కనిపిస్తుంది. ఆ తపన స్వాప్నికతతో, మిళితమై ఈయన కవిత్వంతో అగుపిస్తుంది. సిద్ధార్థలో తాత్వికుడు, నైతికుడు ఆర్తికుడు, ఒక స్వాప్నికుడు కూడా కనిపిస్తాడు.

"నీలాంతర్ద్వారాలపై దీపాన్ని పెడుతూ.... అన్న కవితలో సిద్ధార్థ,
"మనల్ని తిరిగి శిల్పించే కాలపు స్పర్శ ఎప్పటికైన ఒకటుంటుంది
కనబడే దృశ్య పత్రాలన్నిటి మీదా
అందరూ మృత్యులేఖనాన్ని రాస్తున్నా
అసంబద్ధంగా ఉండే దుఃఖ లక్షణాలని
నెత్తుటి భాషలో వ్యక్తం చేస్తున్నా

ఈ సంకీర్ణ స్వప్న ద్వీపం నుండి ఉదయాంతర కోశం దాకా
స్వేచ్ఛా సంధ్యల్ని రాల్చడానికి
నౌక తప్పకుండా బయలుదేరుతుంది"

ప్రతి మనిషి భౌతిక ప్రపంచంలో, మనో ప్రపంచలో పొందని ఆనందానుభూతిని కాని, వేదనా పరమైన అనుభవాన్ని కాని, మూడో ప్రపంచంలో పొందుతాడు. ఆ ప్రపంచమే స్వప్న ప్రపంచం. ఈ కవి ప్రపంచంలో ఇదే పరిస్థితి ఎదురైంది. తాను పొందిన అనుభవాల పట్ల సంక్లిష్టతను స్వప్న ప్రపంచంలో సాధించుకుంటాడు. పై కవితా వ్యాసాలలో ఈ విషయం స్పష్టంగా గోచరిస్తుంది.

ఈ అత్యాధునిక కవిత్వ సృజనలో కవి నిరంతరం స్వాప్నిక జగత్తులో విహరిస్తుంటాడు. అయితే ఫ్రాయిడ్ చెప్పిన 'స్వప్న విశ్లేషణ' సిద్ధాంతం ప్రకారం స్వప్నాలు కూడా జీవితంలో భాగాలే, స్వప్నాలు జీవితాన్ని నిర్దేశిస్తాయని విశ్వసించే ప్రతివాడు ఆ స్వప్న మిశ్రమ రూపాలతో కూడుకొని వున్న ఈ స్వప్న కవిత్వం ఆరోగ్యకరమైనదే అని నమ్మాలి. కాకపోతే స్వప్నం చాలామందికి అర్థం కానట్టే ఈ అత్యాధునిక కవిత్వం అర్థం కాదు. స్వప్నాన్ని అర్థం చేసుకున్నవాడే స్వప్న కవిత్వం రాయగలడు, ఆ కవిత్వాన్ని అర్థం చేసుకోగలడు. ఈ అత్యాధునిక కవిత్వ సృజనలో పాఠకుడికి కవిత్వం అర్థం చేసుకోవటంలో కవికి ఉన్నంత బాధ్యత ఉంది.

# కాలమా!

కె. లలిత
ఎం.ఏ., ప్రథమ, మహిళా కళాశాల

వేచి చూస్తున్నా వేకువ కోసం
నా దిన చర్యలో రవ్వంత మార్పు కోసం
నేను పరుగు తీస్తున్నా నీ బంధనం కోసం
నీ కంటే నేనెప్పుడు ముందే నంటావు నీవు
నీతో కదం కలిపి పరుగుపెట్టినా
ఒక్కింత జాప్యంతో నన్ను వెనక్కి తోసేస్తావు
అందలేని ఆశవు నీవు
అందినట్లే అంది అందలం చూపిస్తావు
నిమిషమాగు! నీ కోసం నేనొస్తానంటే
కాలయాపన అని అందంగా వెక్కిరిస్తావు
అదృష్టానికి అందమైన రూపం నీవు
భవిష్యత్తుకు బలమైన టానిక్‌నీవు
మూడు యుగాలలో నీ నడక నల్లేరు
కలియుగంలో నీ వేగం అమోఘం
రేపటి ముసుగులో ఆశలు తలదాచుకుంటాయి
నువ్వు మాత్రం మాకందకుండా తారు రోడ్డుపై పరుగిడుతావు
కరిగిపోయే కమ్మని కలవు
కదలనివ్వనంటే కాలదంతావు
ఎప్పుడో ఒకప్పుడు గుర్తొస్తాననే ధీమా కదూ! నీకు
నీలో వచ్చే మార్పు రోజుకోవింత
వింతలన్నిటినీ సొంతం చేసుకోవాలనే తపన, నాలో !!

ఇం.నెం. 18-7-599/67 ఉప్పుగూడ, హైదరాబాద్ - 500 253.

# ఓ.......... కోయిలా!

సోమా రామచంద్రం
ఎం.ఏ. ద్వితీయ, ఆర్ట్స్ కళాశాల

ఓ..... కోయిలా విన్నాను నీ స్వరఝరి తొలిసారి
ఆ మధుర సరాగ డోలికలు, కూ, కూరావాలు
ఆలకించే అచిర కాలంలోనే
నా చేజారిపోయింది కాలం
ఎంత అందంగా పాడతావు నీవు
అదే నీకు పరిపూర్ణాలంకారం
వ్యథ చెందకు నీవు అందవిహీనురాలివని
నా హృది నైజం నీకు వల్లిస్తా
ప్రస్తుతం అదే నా యిజం
పలుగాయక శిఖామణులు
పఠిస్తారు నిత్యం నీ పేరును
ఎంత గొప్ప అదృష్టం నీది
నాకు నీపై ఉన్నది అసూయో? అనసూయో?
ఆ అదృష్టమే నాకుంటే.....
ఎంత దూరం? ఎటు నీ పయనం?
రావాలని 'నీతో' గొంతు కలపాలని వుంది నిరంతరం
నీ సాన్నిహిత్య రాహిత్యం
నా స్వర పేటికలో అపశృతులు పలికించింది
మూగవోయింది చివరకు.
నా గొంతు శృతి చేసేందుకైనా
నీవు వస్తావనే ఆశే...
నన్ను అడుగు వేయిస్తుంది ముందుకు......

ఇం. నెం. 11-23-317/A., ఎల్.బి. నగర్, వరంగల్

# స్త్రీవాద సాహిత్యం -మరో చూపు

ఎన్. సంధ్యారాణి,

ఎం.ఏ. ద్వితీయ, పి.జి. కళాశాల

80వ దశాబ్దంలో ఉప్పెనలా వచ్చిన ఉద్యమమే స్త్రీవాద సాహిత్యం. ఈ ఉప్పెనకు పూర్వ రంగం చాలా ఉంది. ముఖ్యంగా స్త్రీ స్వేచ్ఛను గూర్చి స్త్రీ ఉన్న సామాజిక పరిస్థితులకు వ్యతిరేకంగా పోరాడిన చలం "స్త్రీకి కూడా శరీరం వుంది. దానికి వ్యాయామం ఇవ్వాలి. ఆమెకు మెదడు వుంది. దానికి జ్ఞానం ఇవ్వాలి. ఆమెకు హృదయం వుంది దానికి అనుభవం ఇవ్వాలి" అని మొట్టమొదటిసారి స్త్రీ హృదయం గూర్చిన ఆలోచనలు లేవనెత్తారు.

ఈ నేపథ్యంలో స్త్రీ సమస్యలను గురించి తీవ్రంగా స్పందిస్తూ అనేక కథలు, కథానికలు, కవితా సంకలనాలు వచ్చాయి.

"కవిత్వం మనకు విలాసం కాదు
కవిత్వం మనకు సరదా పని కాదు
మన ఉనికి కోసం మనం
అత్యవసరంగా కవిత రాస్తాం" అంటూ

వచ్చిన కవితా సంకలనమే "నీలి మేఘాలు". శరీరానికి, మనసుకి వున్న సంబంధం చాలా బలమైనది కనుక శరీరాన్ని బట్టి స్త్రీని నిర్వచించినపుడు స్వతంత్రంగా ఆలోచించగల స్త్రీ తన ఆవేదనను ఖచ్చితంగా వ్యక్తపరుస్తుంది.

"పాలింకి పోవడానికున్నట్లు
మనసింకి పోవడానికి
మాత్రలు వుంటే బావుండు" అనే

పాటిబండ్ల రజని ఆవేదన అబార్షన్ అంటే అతి మామూలుగా పిల్లలు వద్దనుకుంటే చేయించుకునే ఒక సర్జరీ లాగ కాకుండా దాని వెనుక వున్న మాతృ హృదయావేదనను అద్భుతంగా చిత్రించింది. తన "అబార్షన్ స్టేట్‌మెంట్"లో అలాగే

"చావడానికి మా దగ్గరకు రాకండి
బతకటానికి నానా చావూ చస్తున్న వాళ్ళం" అనే

మెహందీ స్త్రీల బాధలను అతిశక్తివంతమైన పదాలతో వ్యక్తీకరించిన 'ఓల్గా' "మెహందీ స్త్రీల విజ్ఞప్తి" ఆ స్త్రీల దుస్థితి పట్ల, ఆ పరిస్థితి కల్పించిన సమాజం పట్ల తీవ్ర. ద్వేషం తెప్పించకమానదు. ఆడ, మగ మధ్య వివక్షతను నిశితంగా పరిశీలించిన 'శ్రీమతి'

"అమ్మ కట్టుకున్న చీరకున్న అంచుల్లా
అమ్మకు మేమిద్దరం

అమ్మ దృష్టిలో వాడు ప్లస్ నేను మైనస్" అంటూ నేటి సమాజంలో వున్న వివక్షతను తీవ్రంగా నిరసించింది.

అసలు స్త్రీకి స్వేచ్ఛా స్వతంత్రాలు లభించాలంటే ఖచ్చితంగా ఆమెకు ఆర్థిక స్వతంత్రత ఉండాలి. చలం అన్నట్లు అన్నిటికన్నా విద్య కన్నా ముఖ్యం స్త్రీ స్వతంత్ర ఆర్జన. మనుషుల్ని గానీ, దేశాల్ని గానీ, అణగదొక్కాలంటే ఆర్థిక అసహాయత్వం ముఖ్య సూత్రం. అందుచేతనే ఆర్థిక స్వతంత్ర్యంలేని స్త్రీ బానిస అవుతుంది. "అణగదొక్కబడే వాళ్ళు వుంటే అణిచే వాళ్ళు ఎప్పటికి ఉంటారు." వ్యక్తిత్వం ప్రధానంగా ఏర్పడే ఏ సంబంధంలోనైనా బానిసత్వం ప్రసక్తే ఉండదు. అలాగే ఆధారపడడమే అణగదొక్కబడడానికి ప్రధాన కారణం అని చాలా మంది అభిప్రాయం.

ఉద్యమాలు ఎప్పుడూ అసంతృప్తి కారణంగానే వస్తాయి. ఈ నేపథ్యంలో వచ్చిన స్త్రీవాద ఉద్యమ సాహిత్యం పురుషాహంకారం పట్ల తమ నిరసనను ఖచ్చితంగా వ్యక్తపరిచి, స్త్రీకి ఆర్థికంగా, సామాజికంగా, రాజకీయంగా సమానత్వం కావాలంటూ వేయి గొంతుకలొక్కటై నినదిస్తున్నాయి. ఇది హర్షించదగ్గ పరిణామం.

"మేం పాలిచ్చి పెంచిన జనంలో సగం
మమ్మల్ని విభజించి పాలిస్తోందని" వారు

తీవ్రంగా విమర్శించారు ఇది నిజంగా ఆలోచించదగ్గ అంశం.

ఇకపోతే సమాజంలో స్త్రీ ఎన్ని రకాల చిత్రహింసలకి గురవుతున్నదో పరిశీలిస్తే వీటన్నింటికి కారణం స్త్రీలకి తమ సమస్యల పట్ల సరైన అవగాహన లేకపోవడమేననిపిస్తుంది. వరకట్న చావులూ, లైంగిక వేధింపులు మొదలైన వాటిని ఎదిరించే మానసిక ధైర్యం లేకపోవడమే ఈ చర్యల కొనసాగింపుకు కారణమనిపిస్తుంది. స్త్రీలకు విద్య ఒక్కటే కాదు తమ సమస్యలను తామే పరిష్కరించుకునే శక్తి యుక్తులు కూడా ఉండాలి. నా ఉద్దేశ్యంలోనైతే స్త్రీకి అసలు సమస్యలు వీరు చెప్పినట్లు

(క్షమించాలి కొంత మంది స్త్రీవాదులు) లేబర్ రూములు మాతృత్వాన్ని పాస్ అనడాలు, మెన్సెస్ పీరియడ్స్, మోనోపాజ్‌లు కావు కానే కావు. ఎందుకంటే అవన్నీ స్త్రీ సహజ ప్రకృతి ధర్మాలు. వాటిని ఎక్కువ చేసి మనం చెప్పుకోనవసరం లేదనుకుంటా! దాని వల్ల మనకు ఒరిగేది ఏమి లేదు. పైగా సానుభూతి ఒకటి. ఈ సానుభూతి వల్లనో, జాలి వల్లనో వచ్చే సమానత్వం స్త్రీలకు అక్కర్లేదనే నిశ్చితాభిప్రాయం ఉంది.

మాతృత్వాన్ని ఎందుకు పాస్ అనాలి? వీరి విపరీత ధోరణి వలన పిల్లల ఆటల్నీ, అల్లరినీ, వారి మలమూత్ర విసర్జననీ అసహ్యించుకుని మాతృత్వాన్నే వద్దనుకుంటున్నారు. ఇది ఎంత వరకు సమంజసం? మన అమ్మే ఇవన్నీ అసహ్యించుకుని మాతృత్వాన్నే వద్దనుకుంటే మనం వుండే వాళ్ళమా? అసలు ఈ సృష్టి ఉండేదా? అసలు ఏ సమస్యకైనా పరిష్కారం ఆ సమస్య నుండి పారిపోవడం కాదు.

"ఈ స్త్రీ, పురుష సంబంధంలోంచి సుఖం రావాలంటే వికాసం కలగాలంటే దేశపు ఆర్థిక పరిస్థితి పూర్తిగా మారాలి. వంటా, చాకిరీ, పిల్లల్ని కనడం, పెంచడం అనేది సులభమూ, సుఖమూ కావాలి స్త్రీకి" అన్నాడు చలం. కాబట్టి సమస్య అనేది ప్రతిదాంట్లోనూ ఉంటుంది. దాన్ని అవగాహన చేసుకొని, అర్థం చేసుకుని పరిష్కరించుకోవాలే తప్ప దాని నుంచి తప్పుకునే ఉద్దేశంతో విపరీతపు ఆలోచనలు చేయడం తప్పు.

పైటను తగలెయ్యాలి అంటున్నారు పైటను తగలేస్తే పురుషాహంకారానికి పరిష్కారం దొరుకుతుందా? వేషధారణను మార్చుకుంటే తప్ప సమానత్వం రాదా? అయినా స్త్రీత్వాన్నే బానిసత్వంగా జనరలైజ్ చేసి పైటను పురుష అహంకారానికి ప్రతీకగా చేసి దాన్ని తగలెయ్యమంటున్నారు. దాంతో వాళ్ళ అహంకారం అణుగుతుందా? స్త్రీల వ్యక్తిత్వం నిలబడుతుందా?

అయినా సమానత్వం అంటే మన వేషధారణను వారిలా మార్చుకోవడం కాదనుకుంటా (ఆలోచించండి?) జడ, బొట్టు, గాజులు ఇవన్నీ స్త్రీ స్వతంత్రానికి బంధనాలు కాదు. వ్యక్తిత్వం లేకపోవడం, ఫాటి మనిషిని మనిషిగా చూడలేని వీరి (సగటు మనుషుల) మానసిక జాడ్యమే బానిసత్వానికి ప్రధాన కారణాలు.

అలాగే కొన్ని కథలు, నవలలు, స్త్రీ స్వేచ్ఛను అకాంక్షిస్తూ వచ్చినవన్నీ వారి సమస్యలకు కుటుంబాన్ని వదిలివేయడం లేదా, వివాహాన్ని రద్దుపరుచుకోవడం వంటి నేపథ్యంలో సాగాయి. ఇది ఎంత వరకు హర్షణీయం?

ఒక స్త్రీ తనకున్న సమస్యల కారణంగా వీరన్నట్లు భర్త నుండి దూరంగా వచ్చేస్తే మరి ఆమెకి ఈ సమాజం నుండి ఎలాంటి ఆదరణ లభిస్తుంది? వీరు (స్త్రీలు) భర్తలను వదిలేసుకున్నా, వారి పిల్లల గతి ఏం కావాలి? మన దేశంలో పాశ్చాత్య దేశాల మాదిరిగా మనం వదిలేస్తే ఆ పిల్లల్ని (తల్లి, తండ్రులున్న అనాథ పిల్లలను) చూడడానికి ఏ ప్రభుత్వాలు లేవుగా? ఎందుకంటే ఆ పిల్లలకు సమాజం నుండి ఎలాంటి ఆదరణ లభిస్తుందో మనందరికి తెలుసు.

పిల్లల కోసమో, సంఘం కోసమో బ్రతికినంత కాలం సమస్యల వలయంలో బ్రతకమనడం లేదు. కాని వదిలివేయడం మన సమస్యకు పరిష్కారం కాదేమో ఆలోచించమంటున్నాను. క్రూర మృగాలను (Sorry!) సైతం మచ్చిక చేసుకొని అవసరమైతే వాటితో సహజీవనం సాగిస్తున్నాం ఈ మనుషులదేముంది చెప్పండి? (వాటికంటే భయంకరమైనదా? వీరి అహంకారం)

ఈ స్వేచ్ఛా స్వతంత్ర్యాలకు నిజమైన అర్థం తెలియక కొంత మంది స్త్రీలు ఎంత వ్యర్థంగా ఆలోచించి కుటుంబాలను నాశనం చేసుకుని తరువాత తీరిగ్గా బాధపడుతారో చెప్పే చక్కటి నవలే ఈ మధ్య 'ఇండియా టుడే'లో వచ్చిన డి.కామేశ్వరి "ఎండమావులు' ' ఈ నవలలో రచయిత్రి "వివాహ వ్యవస్థ యొక్క ఔన్నత్యాన్ని ఎండమావులను చూసి పరిగెత్తితే వచ్చే అనర్థాన్ని" చక్కగా వివరించారు.

స్త్రీ సమస్యలను గూర్చి ఉద్యమాలు చేసే ఇంత మంది మేధావులు కలసి స్త్రీల యొక్క అసలైన సమస్యలను వదిలివేసి అనవసరమైన విషయాలకు అధిక ప్రాధాన్యతనిస్తున్నారేమో అనిపిస్తుంది. స్త్రీకి బానిసత్వం అనేది పెళ్ళవగానే హఠాత్తుగా రాదు. తను పుట్టిన ఇంట్లోనే వివక్షత అనేది మొదలవుతుంది. దానిని నివారించాల్సింది కూడా ఒక స్త్రీనే (అంటే తల్లే) కాబట్టి సమానత్వం అనేది అక్కడి నుండి రావాలే తప్ప పెళ్ళయిన తరువాత భర్త లోపాల్ని చూసి అసంతృప్తి చెంది, వివాహ వ్యవస్థ మీద విరుచుకుపడడం వల్ల రాదు సమానత్వం.

ఏదైనా సమస్యకు పరిష్కారం రెండు విధాలుగా వుంటుంది. (1) రాజీ పడటం, (2) పోరాడటం ఈ రెండింటిలో ఏది చేసినా సమస్య పరిష్కారం అవుతుంది. రాజీపడలేని సమస్య అయినప్పుడు పోరాటం తప్పనిసరి కాని ఆ పోరాటంలో మనల్ని మనం ఎప్పుడూ కోల్పోకూడదు (అంటే మన అస్థిత్వాన్ని కోల్పోకూడదు).

ఉప సంహారం :

స్త్రీ సమస్యను వారి గొంతుతో విన్పిస్తే సమస్య యొక్క తీవ్రత అనేది అర్థం అవుతుంది. అలాగే స్త్రీ స్వేచ్ఛా స్వతంత్ర్యాల కోసం జరిగే ఈ ఉద్యమాలు (1) స్త్రీకి అసలైన సమస్యలైన ఆర్థిక సామాజిక సమస్యలకు చక్కటి మార్గాన్ని చూపగలగాలి. అంటే ప్రతి స్త్రీ కూడా ఆర్థిక స్వతంత్ర్యంలో వున్న సౌఖ్యాన్ని తెలుసుకోగలిగేలా చేయాలి.

(2) రాజీపడలేని కుటుంబ సమస్యల వల్ల ఏ స్త్రీ అయినా భర్త నుండి విడాకులు కోరి దూరంగా వచ్చేస్తే ఆ స్త్రీని, ఆమె పిల్లలను సమాజంలో నిరాదరణకు గురికాకుండా ప్రభుత్వం వారు బాధ్యతను తీసుకోవాలి.

(3) లైంగిక వేధింపులకు గురిచేసిన వారికి కఠిన శిక్షలను అమలు చేయాలి. (4) ముఖ్యంగా స్త్రీలకి గాని పురుషులకు గానీ, వివాహ విషయంలో ఆకర్షణ ప్రధానంగా కాక, ఆలోచించి పూర్తి స్వేచ్ఛగా నిర్ణయాలు తీసుకునే హక్కు ఉండాలి.

అన్నిటికంటే ముఖ్యంగా నేటి యువత (కొంత మంది) స్వేచ్ఛ అనే పదానికి అర్థం తెలియక నాగరికత అనే మోజులో విశృంఖలత్వానికి, నాగరికతకు తేడా తెలియక తమని తాము కోల్పోతున్నారు. కాబట్టి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల యొక్క పరిపూర్ణమైన అర్థం తెలుసుకుని వాటి వల్ల వచ్చే సౌఖ్యాన్ని సంపూర్ణంగా అనుభవించగలగాలి. ముఖ్యంగా వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకొని ఒక శక్తిగా మారి తన సమస్యల పట్ల స్పందిస్తూ పరిష్కారం వైపు ప్రయాణించాలి. ఈ ప్రయాణంలో ఎదురైన అవరోధాలను ఎదుర్కొనే మానసిక బలం చేకూర్చుకోవాలి.

అలాంటి ధైర్యం ప్రతి స్త్రీకి రావాలని మనస్ఫూర్తిగా కోరుకుంటాను.

(ఈ వ్యాసం చదివి కొందరైనా ఆలోచిస్తారని ఆశిస్తూ....)

# బాల్యం తిరిగి రావాలని ఉంది

జి. అంబాదాస్ శంకర్,
ఎం.ఏ. ప్రథమ, ఆర్ట్స్ కళాశాల

తల్లి చేతి గోరుముద్దలు తిని
ఒడిలో సేదతీరే బాల్యాన్ని అనుభవించినా,
ఆట పాటలతో కన్నీళ్ళు తెలియక
సమాంతరంగా సాగిన బాల్యాన్ని చూసినప్పుడు,
పుస్తకాలతో హుషారుగా
స్కూలుకెళ్ళే బాల్యాన్ని పలకరించినా,
నన్నెత్తుకుని ముద్దాడే అమ్మ కళ్ళలో
ఆనంద బాష్ప ధారలు చూసినా,
నన్ను, బాల్యం తాలూకు జ్ఞాపకాల తెరలు
ఈ యాంత్రిక జీవిత ఎడారిని దాటి
బాల్యంలోకి రమ్మంటుంటాయి.
అందుకే! నాకు బాల్యం తిరిగి రావాలని ఉంది.

ఇం. నెం. 8-137, సుభాష్ నగర్ కాలనీ, సిద్ధిపేట - 502103.

# గమనం

లక్ష్మణ్
ఎం.ఏ. ప్రథమ, పి.జి. కళాశాల

దినదిన గండం జీవన పయనం
ప్రకృతి తల్లి ఒడిలో పెరిగే ప్రళయం
ఆకలి మంటల రోదనతో, అనారోగ్యాలకు ఆలవాలమై,
నిలువుటెండలో కష్టానికి చెమటోడ్చే కర్షకుడివై
పట్టెడన్నం కోసం కష్టించే నిష్కల్మషుడివై
స్వశక్తుల ప్రయోజనాలకు తొలిమెట్టువై
ఆద్యంతం అంధకారంలో మగ్గుతున్న అభాగ్యుడా!
మీ జీవితాలను వెంటాడుతూనే ఉంది,
స్వతంత్రులై అర్థశతాబ్ది గడిచినా
ఆశనిపాతంలా దారిద్ర్య దెయ్యం.
మీ వేష ఘోషలను పరికించే వారెవ్వరు
స్వార్థం సంకుచిత అధ్యాయంలోని
యుగ పురుషులా! భాగ్యవంతులా!
అభాగ్యవంతుల పాలిటి అపశృతులు
నాటికీ నేటికీ జీవన సమాజ చక్రాలు
మార్పుకు నోచుకోలేదు ఇంతవరకు
కండలు ధారపోసి కష్టించే కర్షకుడా
దేహ కష్టాన్నే సంపదలా భావించే కర్షకోత్తముడా

ఈ సమాజ విధి విలాసాలు నిన్ను పలకరించవు
ధన వారధిలో ఆడంబరాలను అనుభవించే
జన సమూహానికి నీ ఘోష అర్థం కాదురా
మరి ఏనాడు నిర్మితమవుతుంది నీ కలల భారతావని!
అందుకే! కర్షక కపోతకులారా! సత్యనిష్ఠాగరిష్టులారా
దారిద్ర్య దాహంతో ఉన్న నివురు గప్పిన నిప్పుల్లారా
మీలోనే ఉంది భారతావని నిజస్వరూపం
ప్రతి ఒక్కరు ప్రతిన పూని ఉద్యమించి
భ్రష్టు పట్టిన వట వృక్షాలను పెకిలించుటకై
ఓటనే గీటురాయితో ప్రజాస్వామ్య ఉద్ధరణకు
మూకుమ్మడి పోరాటానికి సంసిద్ధమై
స్వావలంబన ఊపిరితో కదలిరండి
మీ కలల భారతావనిని నిర్మించండి
మీ చేతిలోనే ఉంది భారత గమనం.

# "సంకలన గ్రంథాల సాహిత్య సేవ"

సి హెచ్. లక్ష్మణ చక్రవర్తి
ఎం.ఏ. ద్వితీయ, ఆర్ట్స్ కళాశాల

సాహిత్యం మార్పుకు లోనవుతున్న కొద్దీ దానిలో అనేక ప్రక్రియలు ప్రవేశించి సాహిత్య చరిత్రలో ఒక విశిష్ట స్థానాన్ని కల్పించుకున్నవి. అలా వచ్చిన నూతన ప్రక్రియ తెలుగులో కనిపించే సంకలన గ్రంథాలు. కావ్యాలు వ్రాయకున్నా తాను ఎన్నుకున్న అంశం పరిధిలోని కవితలను, పద్యాలను, గేయాలను ఒక్క దగ్గరగా చేర్చి కూర్చడం ఈ ప్రక్రియ లక్షణం. ఈ ప్రక్రియ తెలుగు సాహిత్యానికే పరిమితమైనది కాదు. ఇతర భాషా సాహిత్యాలలో కూడా ఈ ప్రక్రియ ఉన్నది. ప్రాచీన కాలం నుండీ తెలుగు సాహిత్యం పై సంస్కృత ప్రభావం ఉన్నందువల్ల దాని ప్రభావంతో ఈ ప్రక్రియ కూడా వచ్చినదని చెప్పవచ్చు.

## సంస్కృత సంకలన గ్రంథాలు:

సంస్కృత సాహిత్యంలో వెలువడిన ఈ సంకలన గ్రంథాలకు ఒక విశిష్ట స్థానం ఉన్నా తెలుగులో వచ్చిన సంకలన గ్రంథాల కంటే ఒక మెట్టు కిందికే ఉన్నాయనడంలో సందేహం లేదు. ఎందుకంటే తెలుగులో ఈ ప్రక్రియ విశిష్ట పంథాలను తొక్కింది. అయితే సంస్కృతంలో వచ్చిన సంకలన గ్రంథాలన్నీ ఇంచుమించుగా నీతి బోధకాలుగానే ఉండడం దీనికి కారణం. విద్యాకరుడి సుభాషిత రత్నకోశమ్, నూరుమంది ఉత్తర భారత కవుల నీతి శ్లోకాలతో వెలువడ్డ వల్లభదేవుని సుభాషితావళి, శాస్త్రీయ పద్ధతిలో అమర్చబడినదిగా చెప్పబడుచున్న జల్హణుని సూక్తి ముక్తావళి, 20వ శతాబ్దిలో వచ్చిన శివదత్తుని సుభాషిత రత్న భాండాగారం మొదలైనవన్నీ నీతిని బోధించేవిగా ఉండడం పైన నేను పేర్కొన్న అంశాన్ని స్పష్టం చేస్తాయి. వీటికి కొంత భిన్నంగా వెలువడ్డవి శ్రీకృష్ణుని వర్ణన స్తుతి గల రూపాగోస్వామి-పద్యావళి, నీతి బోధక విషయాలతో పాటు సంగీతం, చిత్రకళ, జ్యోతిష్య, వాస్తు, అలంకార శాస్త్రం మొదలైన విషయాలతో కూడిన శ్లోకాలను "మానసోల్లాస" మనే పేరుతో సంకలనం చేశారు. సంస్కృతంలో వీటిని 'సంగ్రహ గ్రంథాలు' అంటారు. ఈ సంగ్రహ శబ్దాన్ని తెలుగులో నిందార్థంలో (దొంగతనం) వ్యవహరిస్తారు. అందువలన వీనిని తెలుగులో సంకలన గ్రంథాలుగా

వ్యవహరిస్తున్నారు. సంస్కృత సంకలన గ్రంథాలలో చాలా వరకు నీతి బోధకాలు కాగా కవితా సౌందర్యాన్ని తెల్పేవి, భక్తి భావాన్వితమైన సంకలన గ్రంథాలు కూడా కొన్ని వచ్చినవి.

ఈ ప్రక్రియ పేరు చెప్పగానే చాలావరకు ప్రాకృతంలో హాలుడు సంకలనం చేసిన 'గాథాసప్తశతి' గుర్తుకు వస్తుంది. దీని ఆధారంగా ఈ ప్రక్రియ మొదట ప్రాకృతంలో వచ్చిందని చెప్పవచ్చు. ఈ గ్రంథం ద్వారా ఆనాటి జనుల సాంఘిక పరిస్థితులు ఆచారవ్యవహారాలు మొదలగు అనేక అంశాలు తెలుసుకోవచ్చు. ఈ గ్రంథాన్ని తెలుగులోనికి కొంత వరకు రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ అనువాదం చేశారు. కొందరు ఆలంకారికులు ఇందులోని గాథలను (పద్యాలను) ధ్వనికి ఉదాహరణలుగా గ్రహించి ధ్వని భేదాలు నిర్వచనాలు చెప్పే ప్రయత్నం చేశారు.

ప్రాకృతంలో వచ్చిన సంకలన గ్రంథం ద్వారా జన జీవన విధానాన్ని తెలుసుకోగలిగితే సంస్కృత సంకలనాల ద్వారా విస్మృత కవుల విషయం, కవి కవితాపాటవం, కవుల కాల నిర్ణయం మొదలైనవి నిర్ణయించడానికి సాహిత్య చరిత్రకారులకు అవకాశం దొరికింది.

## తెలుగు ప్రాచీన సంకలన గ్రంథాలు:

తెలుగులో సంకలన గ్రంథాలుగా చెప్పబడేవి తక్కువగా వచ్చినా వచ్చిన ప్రతీ సంకలన గ్రంథానికి ఒక విశిష్ట దృక్పథం ఉన్నట్టు కన్పిస్తుంది. మడికి సింగన సకల నీతి సమ్మతమే ప్రప్రథమ సంకలన గ్రంథంగా విమర్శకులు సాహిత్య చరిత్రకారులు నిర్ణయించినారు. ఈ గ్రంథం ద్వారానే తెలుగు వారికి సంకలన గ్రంథాలతో పరిచయం ఏర్పడింది. ఇదేగాక వేటూరి ప్రభాకర శాస్త్రి, ప్రబంధ రత్నావళి, చాటుపద్యమణిమంజరి, మోది జగన్నాథం శృంగార పద్యావళి, సమర్థి రంగయ్య శెట్టి ఋతుచక్రం, కట్టమంచి సుబ్రహ్మణ్య రెడ్డి సంకలితం చేసిన భారత సార ముక్తావళి, భాగవత సార ముక్తావళి, భట్టిప్రోలు రామచంద్రయ్య ఆంధ్ర కవితా రత్నాకరము, కూర్పరి ఎవరో తెలియకుండా ఉన్న ప్రబంధమణి భూషణము మున్నగునవి తెలుగులో వచ్చిన సంకలన గ్రంథాలు.

ఈ సంకలన గ్రంథాలలో సంస్కృతంలో ఉన్నట్టు నీతిని బోధించేవి మాత్రమే గాక భిన్న అంశాలను ఎన్నుకుని సంకలనం చేయడం కన్పిస్తుంది. "సకల కథాసార సంగ్రహం" పేరుతో పుత్తేటి రామభద్రయ్య ఒక కథా సంకలనం కూర్చారు. అయితే ఇది పద్య రూపంలో ఉన్న కథలను మాత్రమే గ్రహించింది. ఈ సంకలన, వలన కథా సంకలనాలు కూడా తెలుగు సాహిత్యంలో ప్రవేశించాయి.

సకల నీతి సమ్మతములో నీతి సారము, పంచతంత్రమ్, భారతము, నీతి భూషణము, కుమార సంభవము, నీతి తారావళి, పద్మ పురాణము, చారుచర్య, బద్దెన నీతి, మున్నగు కావ్యాల నుండీ రాజనీతికి సంబంధించిన జనులు తమ వర్ణ ధర్మాలను అనుసరిస్తూ నడువవలసిన విధానాన్ని ఆయా వర్ణాలకు సంబంధించిన నీతిని గూర్చిన పద్యాలను సేకరించి ఒక చోట కూర్చినారు. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ గ్రంథంలో రాజ్యాంగంలో అన్ని వర్గాల వారు పరస్పరం ప్రవర్తించవలసిన విధానాన్ని నీతి మార్గాన్ని సంకలితం చేసి ఒక గ్రంథంగా కూర్చారు. మడికి సింగన దీనిని ప్రబంధంగా పేర్కొన్నా సాహిత్యచరిత్రకారులు విమర్శకులు దీనిని సంకలన గ్రంథం గానే గుర్తించినారు.

క్రీ.శ. 1550 వరకు గల అనేక మంది కవుల పద్యాలు ప్రబంధ రత్నావళిలో సంకలనం చేయబడ్డాయి. ఇది ఐదు ఆశ్వాసముల గ్రంథము. ఈ గ్రంథములో వాఙ్మయ చరిత్రకు తోడ్పడేవి అలభ్యములైన చాలా కావ్యాలు కలవు. ఈ సంకలనం ఆధారంగానే "ఉదాహరణవాఙ్మయచరిత్ర" తాను రచించానని నిడుదవోలు వెంకటరావు చెప్పుకున్నారు.

'శృంగార పద్య రత్నావళి'లో ప్రబంధముల నుండీ సేకరించిన శృంగార పద్యములు కలవు. 'ఋతు చక్రము'లో ప్రబంధాలలో ప్రాచీన కావ్యాలలో గల ఋతువర్ణన పద్యాలు సంకలనం చేయబడినవి. 'భారత సార ముక్తావళి'లో రాజకీయ, సాంఘిక, ఆధ్యాత్మిక, నీతి వ్యవస్థలకు సంబంధించిన పద్యాలు ఆయా శీర్షికలుగా విభజించి సంకలనం చేయడం విశేషం. కొందరు పండితులు భారత విమర్శలకు ఆధారభూతమైనదిగా ఈ గ్రంథాన్ని ఉదహరిస్తున్నారు. 'భాగవత సారముక్తావళి' కూడా పైదాని లాగే కానీ ఇందులో ఆధ్మాత్మిక విషయం అధికంగా ఉన్నది. దీనితో పాటు . జగదుత్పత్తి, సుగుణ, నిర్గుణ, స్తుతి, అనే నాలుగు ప్రకరణాలు కూడా ఉన్నాయి. ఈ గ్రంథం ఆధారంగా పోతన భక్తి తత్త్వమును భారతీయుల విశ్వాసాలను తెలుసుకోవచ్చు. 'ఆంధ్ర కవితా రత్నాకరము' అనే సంకలన గ్రంథంలో 18వ శతాబ్దానికి ముందుగల కవుల సూక్తులు, లోకోక్తులు, అకారాదిగా కూర్చినారు. ప్రబంధాలలో గల అష్టాదశ వర్ణనలకు సంబంధించిన ఆణిముత్యాల వంటి పద్యాలను సేకరించి కూర్చిన సంకలన గ్రంథం వర్ణనరత్నాకరము. ఇందులో మూడు వందల ప్రబంధాల నుండీ అష్టాదశ వర్ణనల పద్యాలను సేకరించి దాసరి లక్ష్మణస్వామి సంకలితం చేశారు.

పై సంకలన గ్రంథాలన్నీ ఒక ఎత్తు అయితే 'ప్రబంధమణి భూషణము' అనే సంకలన గ్రంథం ఒక ఎత్తు. ఇందులో పైన ఉదహరించబడిన సంకలన గ్రంథాల లాగే పద్యాలను ఇతర కావ్యాల నుండీ తాను ఎన్నుకున్న అంశానికి తగినట్టుగా గ్రహించినా ఆయా పద్యాలను కూర్చే విధానంలో కొత్తదనం కన్పిస్తుంది. పద్యాలను సేకరించి అనౌచిత్యం కలగకుండా ఒక కథ ప్రకారం ఈ గ్రంథాన్ని సంకలితం చేయడం జరిగింది. దీని కూర్పరి "ఉజ్జయినీ మహారాజు సుకీర్తి నరేంద్రుని కుమారుడు పాండ్యభూపతి కూతురి స్వయంవరానికి వెళ్ళి వరింపబడినాడు" అనే కథా వస్తువును ఎన్నుకుని పద్యాలను సేకరించి ఎక్కడ ఏ పద్యాన్ని చేర్చవలెనో ఆ స్థానంలో ఆ పద్యాన్ని చేర్చి కథగా ఈ సంకలన గ్రంథాన్ని కూర్చారు. దురదృష్టకర విషయమేమంటే ఈ గ్రంథ సంకలనకర్త ఎవరో తెలుగు సాహిత్య లోకానికి తెలియదు. తెలుగు సాహిత్యంలో చాటువులకు ఒక విశిష్ట స్థానం ఉన్నది. అందుకే వేమన "చాటు పద్యమైన చాలదా ఒకటి" అన్నారు. ఇంతటి విశిష్టత ఉన్న చాటువులను చాటు పద్యమణిమంజరి. 'చాటు పద్య రత్నాకరము' అనే సంకలనాలు వెలికి తెచ్చాయి. ఈ సంకలనాల ద్వారా తెలుగు కవుల చతురోక్తులు, లోకోక్తులు, సూక్తులు, పిట్టకథలతో బాటు తెలుగువారి ఆచారవ్యవహారాలు, సాంఘిక విషయాలు తెలిసే అవకాశం ఉన్నది.

తెలుగు సాహిత్యచరిత్రలో ఇంతటి విశిష్టత కలిగిన ఈ సంకలన గ్రంథాలను ఒక పద్ధతి ప్రకారం కూర్చాలంటే అందుకు కావ్యం వ్రాయడం కంటే ఎక్కువ కష్టపడవలసిన అవసరం ఉన్నది. ముందుగా సంకలన కర్తకు అంతకు ముందున్న గ్రంథాల కావ్యాల విషయం స్పష్టంగా తెలిసి ఉండాలి. ఆయా గ్రంథాల కావ్యాల సేకరణ చేయాలి. తాను ఎన్నుకున్న అంశానికి తగిన పద్యాలను శ్లోకాలను ఒక చోట కూర్చి జ్ఞాపికలు ఇవ్వాలి. వాటిని శీర్షికల క్రింద విభాగం చేసిన తర్వాత గ్రంథంగా వ్రాయాలి.

ఈ విధంగా సంకలన గ్రంథాన్ని కూర్చడం వలననే ఒక్కొక్క సంకలన గ్రంథానికి ఒక్కొక్క విశిష్ట స్థానం ఉందని చెప్పడం స్పష్టం. ఈ విధంగా సంకలన గ్రంథాలను కూర్చడం వలన ఏమిటి ప్రయోజనం? ఎక్కడో ఉన్న పద్యాలను ఒక దగ్గర కూర్చడం వలన లాభమేమి? అనే విషయాలను పరిశీలిస్తే కావ్యం గాని, గ్రంథం కానీ, కలకాలం నిలిచేది కాబట్టి ఆ విధంగా సంకలనకర్తకు కీర్తి, సాహిత్యానికి పరిపుష్టి.

ఈ గ్రంథాల వలన కొన్ని అలభ్య కావ్యాలను గూర్చి తెలుసుకోవచ్చు. ఈ గ్రంథాల ద్వారా వాఙ్మయ చరిత్రను రూపొందించే అవకాశం ఉన్నది. ఈ గ్రంథాల వలన

కవుల కాలనిర్ణయం చేసే అవకాశం ఉన్నది. విస్మృత కవులు ఎంత మంది ఉన్నారో తెలుసుకోవచ్చు. ఈ ప్రయోజనాల్ని గుర్తిస్తే ఈ సంకలన గ్రంథాలు స్థూల దృష్టిని ఆకర్షిస్తాయి.

సూక్ష్మంగా పరిశీలిస్తే సాహిత్య విమర్శకు సాహిత్య చరిత్రకు విస్తృత సేవను ఈ సంకలన గ్రంథాలు చేస్తున్నాయి. ఉదా:- సాహిత్యాన్ని గూర్చి పద్యానికి ఉన్న విశిష్టతను గూర్చి ఉన్న పద్యాలను అవలోకించండి.

ఉదయ ప్రాణ విహారమై విహిత వర్ణోద్య ద్విభక్తి క్రియా
సదనం బైన దలంకృతి ప్రభవమై సద్విక్రమా వాసమై
విధి తార్థాకరమై ప్రసన్న పదమై వృద్ధ శ్రవోవైభవా
స్పదమై రాజును బ్రోలె గ్రాల వలదా పద్యంబు హృద్యస్థితిన్

సాహిత్యాన్ని గూర్చి:

సాయంకాలనటన్మహానట జటా చంచద్వియ ద్వాహినీ
స్ఫాయ ద్వార్లహరీ విజృంభణ కళా ప్రౌఢుండు సత్కావ్యమున్
చేయంబోలిన బోలుగాక సుకవి శ్రేణీ సముచ్ఛిష్టవా
క్ఛాయా హరులకెంత దవ్వు రసవత్ సాహిత్య సౌహిత్యముల్

ఈ విధంగా ప్రతీ ఒక అంశాన్ని గూర్చి, వస్తువు గూర్చి ఈ గ్రంథాల ద్వారా తెలుసుకోవచ్చు. కావ్యాన్ని గూర్చి కవిత్వాన్ని గూర్చి, షష్ఠ్యంత రచనల భేదాన్ని గూర్చి కావ్యావతారిక లక్షణాలను గూర్చి కావ్య వర్ణనలను గూర్చి నీతిని గూర్చి సుమనోహరమైన పద్యాలెన్నో ఈ సంకలన గ్రంథాలలో మనకు లభిస్తాయి. సాధారణ వ్యక్తి సాహిత్య అధ్యయనం చేయదలిస్తే ఈ సంకలన గ్రంథాలను పరిశీలిస్తే ఇంచుమించుగా సాహిత్యమర్మాలన్నీ తెలుసుకోగలుగుతాడు.

## ఆధునిక యుగ సంకలనాలు:

ఆధునిక యుగంలో వచ్చిన సంకలనాలను ముందుగా రెండు విభాగాలు చేయవలసిన అవసరం ఉన్నది. ఎందుకంటే ఈ యుగంలో వచ్చిన సంకలన గ్రంథాలలో కొందరు 'సంకలనకర్త'గా తమ పేరును సూచిస్తే మరికొందరు 'సంపాదకుడు' అని తమ పేరును సూచిస్తున్నారు. సంపాదకుడిగా చెలామణీ అవుతున్న వ్యక్తిని సంకలనకర్త అనవచ్చా? ఇతడు సంకలనం చేసిన గ్రంథం సంకలన గ్రంథం అవుతుందా?

అని యోచించవలసిన అవసరం ఈనాడు ఉన్నది. అందువలన వీరిద్దరికీ గల భేదం ఏమిటో? అలాగే వీరు సంకలనం చేసిన గ్రంథాలలో గల భేద ఏమిటో పరిశీలిద్దాం.

ఇంతకు ముందే మనం సంకలనకర్త చేసే పనిని చెప్పుకున్నాం కదా! ఈ వ్యాస పరిధిలో వచ్చిన 'సంపాదకుడు' తాను ఎన్నుకున్న లేదా తాను తెలియచేయదలచిన దృక్పథం గల కవితలను ఎన్నుకొని కూర్చి పుస్తకంగా ప్రకటిస్తున్నాడనేది స్పష్టము. అయితే వీరిద్దరిలో చిన్న భేదం కన్పిస్తున్నది. సంపాదకుడు తాను ఎన్నుకున్న అంశాన్ని వివరిస్తూ పత్రికా ప్రకటన ఇచ్చి కవితలను తన దగ్గరికి రప్పించుకుంటాడు. సంకలనకర్త వలె ఇతను కవితలను గానీ పద్యాలను గానీ తానుగా గ్రంథాల నుండీ సంపాదించడు. అయినా సంపాదకునిగా చెలామణీ అవుతాడు. ఈ వివరణను బట్టి చూస్తే సంకలనకర్త పనియే కొంత కష్టమని భావించకతప్పదు. 'సంకలనకర్త' కంటే తక్కువగా కష్టించినా ఇంచుమించుగా ఇతను కూడా తాను ఎన్నుకున్న అంశం పరిధిలోని కవితలను పద్యాలను ఒక గ్రంథంగా ప్రకటిస్తున్నాడు. కాబట్టి వీటిని కూడా సంకలన గ్రంథాల క్రింద చేర్చవచ్చు. వీటిన సంకలన గ్రంథాలుగా గుర్తించి ఆమోదించినప్పుడు సంపాదకుడిగా ప్రకటిస్తున్న వారిని సంకలనకర్తగా గుర్తించవచ్చు. సంపాదకుడి స్థానంలో నలుగురైదుగురి పేర్లు ఆధునిక కవితా సంకలనాలలో కన్పిస్తున్నాయి. సంకలనం చేస్తున్నామని ప్రకటిస్తున్న వారు మాత్రం సంకలనకర్త స్థానంలో తమ పేరును మాత్రమే సూచిస్తున్నారు. ఈ భేదం తప్ప ప్రాచీన ఆధునిక సంకలనాలలో పెద్దగా భేదం లేదనే చెప్పాలి. ప్రాచీన సంకలనాలు నీతులను పూర్వ కవుల కవితా వైశిష్ట్యాలను వర్ణనా చాతుర్యాన్ని తెలియజెప్పేవిగా ఉంటే ఆధునిక సంకలనాలు ఆయా దృక్పథాలను వాదాల నేపథ్యాన్ని తెల్పేవిగా ఉన్నాయి.

ఆధునిక సాహిత్యంలో వచ్చిన సంకలన గ్రంథాలలో భావ కవిత్వానికి చెందిన ముద్దుకృష్ణ 'వైతాళికులు', వచన కవితలకు సబంధించిన కవితా! ఓ కవితా, జాతీయోద్యమ సాహిత్యానికి చెందిన జయధీర్ తిరుమలరావు 'స్వాతంత్ర్య సమర గీతాలు', ఇతనిదే తెలంగాణా ఉద్యమానికి చెందిన 'తెలంగాణా పోరాట పాటలు', విప్లవ కవిత్వానికి సంబంధించిన 'మార్చ్,' 'ఝంఝూ', 'కవిత్వం పై ఎర్రజెండా', మినీ కవిత్వానికి చెందిన కొల్లూరి - మినీ కవితా విప్లవం, దళితవాదానికి చెందిన చిక్కనవుతున్న పాట, పదునెక్కిన పాట, దళితగీతాలు, స్త్రీవాదానికి చెందిన నీలి మేఘాలు మొదలైనవి ఆధునిక సాహిత్యంలో వచ్చిన సంకలన గ్రంథాలుగా భావించవచ్చు.

భావ కవిత్వానికి సంబంధించిన ముద్దుకృష్ణ 'వైతాళికులు' ఆధునిక సాహిత్యానికి మొదటి సంకలన గ్రంథం. ఇందులో భావ కవితాశాఖలైన దేశభక్తి, ప్రకృతి ప్రియత్వం, స్మృతి, భక్తి, ప్రణయ, సంఘ సంస్కరణలకు, సంబంధించిన కొందరు భావ కవుల కవితలు కూర్చడం జరిగింది. "కాల్పనిక కవితలో నవ్య సాహితిలో ఏరి కూర్చే కవితలు ఒకే ధోరణిని ప్రతిబింబించే దశకు చెందినా రచనలో భావనలో వైవిధ్యం కనిపించాలి. రచనా పరిణతిని ప్రతిబింబింప చేయాలి." అనే లక్ష్యంతో 'వైతాళికులు' సంకలనం చేశారు. ఈ సంకలనంలో జాషువాను చేర్చలేదనే అపవాదు తప్ప ఈ సంకలన గ్రంథానికి సాహిత్య లోకంలో విశిష్ట స్థానమే లభించింది.

వచన కవితకు ఆధునిక యుగంలో ప్రథమ స్థానం లభించింది. పద్య, గేయ, కవితలు ఉన్నా తనదైన శైలిలో శిష్టా నుండీ నేటి వరకు అందరి చేత ఆమోదింపబడి కొత్త పంథాలను తొక్కుతూ నేటికీ కొనసాగుతున్నది. ఈ ప్రక్రియకు సంబంధించిన కవితా సంకలనం కవితా! ఓ కవితా! ఇది పెనుగొండ లక్ష్మీనారాయణ, పాపినేని శివశంకర్ అనే వారిచే సంపాదింపబడింది. 1980-90 వరకు గల నూరు మంది కవుల వచన కవితలు ఇందులో సంకలనం చేయబడ్డాయి. దీనిలో ఇంచుమించుగా అప్పటి సాహిత్యానికి సంబంధించిన కవితలే గాక ఆనాటి వరకు గల వాదాల కవితలు చోటు చేసుకున్నాయి. ఈ దశాబ్దంలో వచన కవితలో వచ్చిన మార్పులు, వస్తునవ్యత, కవి ఆలోచనా రీతి, ఈ దశాబ్దంలో జరిగిన కొన్ని సంఘటనలు సాహిత్యంలో ప్రవేశించిన నూతన వాదాలు మొదలైన అంశాలను తెలుసుకోవచ్చు.

జాతీయోద్యమంలో ఆంధ్రుల పాత్రను గూర్చి తెలిసిన వారు చాలా తక్కువ. జాతీయోద్యమం తెలుగు సాహిత్యంపై ఏ విధంగా ప్రభావాన్ని చూపిందో తెలియాలంటే అప్పుడు వెలువడిన సాహిత్యం మన చేతికి రావాలి. ప్రఖ్యాత కవులు రచించిన గేయాలు, పద్యాలు, కావ్యాలు మాత్రమే మనకందినవి. అయితే అప్పుడు పల్లె పల్లెలోను ఆంధ్రులు జాతీయోద్యమానికి స్పందించి ప్రజలను జాగృతులను చేయడానికి గేయాలు రచించారని జయధీర్ తిరుమలరావు సంకలనం చేసిన 'స్వాతంత్ర్య సమర గీతాలు' చూస్తే అర్థం అవుతుంది. ఈయనే సంకలనం చేసిన 'తెలంగాణా పోరాట

పాటలు' తెలంగాణాలో నిజాం ప్రభువు చేసిన ఆగడాలకు దౌర్జన్యాలకు ప్రముఖ కవులతో పాటు పల్లె కవులు తమ పల్లె పదాలలో పాటలను రచించి తెలంగాణా విముక్తికి ఏ విధంగా దోహదం చేశారో తెలుపుతుంది.

'మినీ కవితా విప్లవం' పేరుతో ఒక మినీ కవితా సంకలనం వెలువడింది. దీని సంకలనకర్త కొల్లూరి. ఉక్తి వైచిత్ర్యం కలిగి చిటికలో చదివి ముగించవీలైన, ఆనందం అందించగలిగిన మంచి కవితలు ఈ సంకలనంలో ఉన్నాయి. ఇందులో శివారెడ్డి, నగ్నముని, శ్రీశ్రీ, సినారె, కుందుర్తి వంటి ప్రముఖ కవుల మినీ కవితలు సంకలనం చేయబడ్డాయి. ఈ సంకలనం ద్వారా మినీ కవితా లక్షణాలు విశిష్టత తెలుసుకునే అవకాశం ఉన్నది. విప్లవ సాహిత్యానికి సంబంధించిన అనేక సంకలనాలు వెలువడ్డాయి. వీరు సంకలనకర్త స్థానంలో 'సంచాలకులు' అనే కొత్త పదాన్ని కూడా ప్రవేశపెట్టారు. ఇతడు కూడా ఇంచుమించుగా సంపాదకుని పనినే చేస్తున్నాడు విప్లవ కవిత్వానికి సంబంధించిన అనేక సంకలనాలు వచ్చినా వాటిలో కొన్ని నిషేధానికి గురి అయి ఒక తరానికి అసలు ఈ సంకలనాలను గూర్చి తెలియని పరిస్థితి ఏర్పడింది. విరసం రజతోత్సవాల సందర్భంగా ఇవి ఈ మధ్యనే వెలుగులోనికి వచ్చాయి. అవి పి.కిషన్‌రావ్ సంపాదకత్వంలో వచ్చిన 'మార్చ్', కె.వి. రమణారెడ్డి సంకలనకర్తగా వచ్చిన 'ఝంఝా' 'మార్చ్'లో ఆయా కవితలు రచించిన కవుల పేర్లు లేవు. ఈ రెండు సంకలనాల ద్వారా విప్లవ కవిత్వ ఆవిర్భావ నేపథ్యం పాశ్చాత్య ప్రభావం శ్రీకాకుళ ఉద్యమ ప్రభావం తెలుసుకునే అవకాశం ఉన్నది. ఇదే గాక 'కవిత్వంపై ఎర్రజెండా' విరసం ద్వారా వెలువడింది. 1980-94 వరకు వచ్చిన కొన్ని విప్లవ కవితలు ఉన్నాయి. ఈ దశాబ్దంలో వచ్చిన కొందరు కొత్త విప్లవ కవులను ఈ సంకలనంలో చూడవచ్చు (1970-80) అంతకు ముందు దశాబ్దంలో ఉధృతంగా సాగిన విప్లవ కవితా పరిణామదశను ఈ సంకలనం ద్వారా అర్థం చేసుకోవచ్చు. అలాగే కాలానుగుణంగా విప్లవ సాహిత్యంలో వచ్చిన మార్పులను తెలుసుకోవచ్చు.

స్త్రీవాదానికి సంబంధించిన సంకలనం 'నీలిమేఘాలు' దీనిని స్త్రీవాద కవితాసంకలనం అన్నారు. కానీ సంకలనకర్త, సంపాదకుడు అని ఎక్కడా లేదు ఈ

సంకలనాన్ని ఎవరికి అంకితం ఇస్తున్నారో చెబుతూ ఒక కవిత విషయ సూచికకు ముందున్నది అందులో 'అస్మిత' అని పేర్కొనబడింది. ఆ పేరు గల వ్యక్తి లేగా సంస్థ ఈ గ్రంథ సంకలనం చేశారని భావించవచ్చు. అలా పేరును ప్రకటించని సంకలనాలు ప్రాచీన సాహిత్యం నుండీ నేటి దాకా ఎన్నో ఉన్నాయి అని ముందే చెప్పుకున్నాం గదా! ఈ సంకలనంలో స్త్రీవాద దృక్పథానికి సంబంధించిన అనేక కవితలు ఉన్నాయి. స్త్రీలపై జరుగుతున్న అన్యాయాలకు, లైంగిక వేదింపులకు వ్యతిరేకంగా పితృ స్వామిక వ్యవస్థను దుయ్యబడుతూ అనే కవితలు ఇందులో కూర్చబడ్డాయి. వస్తు భావాల నవ్యత ఈ కవిత్వంలో కన్పిస్తుంది. ఈ సంకలనం ద్వారా స్త్రీవాదుల లక్ష్యము లక్షణము బోధపడుతుంది..

దళితవాద సంకలనాలు చిక్కనవుతున్నపాట, పదునెక్కినపాట, దళిత గీతాలు ఇలా ఎన్నో వచ్చాయి. ఒక దశాబ్దంగా పత్రికలలో ప్రచురించబడుతున్న దళితవాద కవితలు దళిత సాహిత్యానికి నాందీ వాక్యంగా చిక్కనవుతున్న పాట రూపంలో వచ్చాయి. ఈ సంకలనాలలో సంపాదకుని స్థానంలో ఇద్దరి కంటే ఎక్కువ పేర్లు కన్పిస్తున్నాయి. ఈ సంకలనాలలో ఆధునిక కవిత్వ నిర్మాణ పద్ధతులు ఎన్ని ఉన్నాయో ఇంచుమించుగా అన్ని నిర్మాణ పద్ధతులలోని కవితలు ఇందులో కన్పిస్తాయి. ఈ సంకలనాలలో దళిత జీవనానికి సంబంధించిన దళితులపై జరిగే అన్యాయాలకు సంబంధించిన, పురాణాలలోని పంచమ కులస్థులను ప్రతీకలుగా చేసుకుని వారి బాధలను వెల్లగక్కుతున్న, చుండూరు, అయోధ్యమున్నగు స్థలాలలో దళితులపై మైనార్టీలపై జరిగిన అన్యాయాలను నిరసిస్తూ ఈ వాదానికి సంబంధించిన కవితలు అనేకం ఉన్నాయి.ఈ సంకలనాల ద్వారా అగ్రవర్ణాలు తమపై జరిపే దౌర్జన్యాన్ని, వారి అణచివేతకు కారణాలను తెలుసుకోవచ్చు. ఈ సంకలనాల ఆధారంగా దళిత సాహిత్య లక్ష్యం, లక్షణమును గూర్చి అనేక చర్చలు నేటికి విస్తృతంగా జరుగుతున్నాయి.

గద్య సంకలనాలు :

సంకలన గ్రంథాలలో ఒక నూతన ధోరణి దశాబ్ది కాలంగా తెలుగు సాహిత్యంలో కన్పిస్తుంది. ప్రాచీన కాలం నుండీ ఒక దశాబ్ది ముందు వరకు అన్ని సంకలనాలు పద్య

. వచన, గేయ కవితా ప్రక్రియలలో మాత్రమే కన్పిస్తుంది. గద్యాత్మకమైన సంకలనాలు కూడా నేడు కన్పిస్తున్నాయి. వీటిని రెండు విధాలుగా విభజన చేయవచ్చు. 1. కథా సంకలనాలు, 2. వ్యాస సంకలనాలు. వీటిలో కూడా సంపాదకుడు సంకలన కర్త అనే భేదం ఉన్నది. ఈ గద్య సంకలనాలు కూడా ఆధునిక యుగంలో వచ్చిన సంకలనాల లాగే సంకలనం చేయబడ్డాయి. వాసిరెడ్డినవీన్, భార్గవీరావు, వేదగిరి రాంబాబు, కాశీపట్నం రామారావు మొదలైనవారు కథా సంకలనాలను వెలువరించారు. నవీన్ ఆయా సంవత్సరాల కథలను, భార్గవీరావు దళిత కథలను సంకలనం చేశారు. కొత్త కథ, సరికొత్త కథ పేరుతో వేదగిరి రాంబాబు కథా సంకలనాలు వెలువరించారు. కథా సాహిత్యాన్ని అభివృద్ధి చేసే దృష్టితో కొన్ని కథా సంకలనాలు వెలువడితే ఆయా వాదాల నేపథ్యాన్ని లక్ష్యాన్ని తెలిపే విధంగా కొన్ని కథా సంకలనాలు వెలువడ్డాయి. శ్వేతరాత్రులు, సీమ కథల వంటి కథా సంకలనాల వలన ఆయా ప్రాంతాల సమగ్ర భౌగోళిక సాంఘిక, ఆర్థిక, రాజకీయాది పరిస్థితుల్ని తెలుసుకోవచ్చు. ముందు ముందు ఇటువంటి ప్రాంతీయ కథా సంకలనాలు వెలువడితే ఆయా ప్రాంతాల సాహిత్య సృజనత్వ ప్రయోజనాన్ని అంచనా వేసే అవకాశం ఉంది.

వ్యాససంకలనాలను సంకలన గ్రంథాల క్రింద చేర్చవచ్చు. ఎందుకంటే వ్యాస సంకలన కర్తలు వారు ఎన్నుకున్న అంశానికి తగిన వ్యాసాలను ఒక పుస్తకంగా ప్రకటిస్తున్నారు. కాబట్టి వీటిని సంకలన గ్రంథాలుగా పేర్కొనవచ్చు. వేదగిరి రాంబాబు సంకలనం చేసిన కథనరంగం, 1994 కథా సమీక్ష, 1995 కథా సమీక్ష, మొదలైన వ్యాస సంకలనాలు కథా సాహిత్య తీరు తెన్నులను నవ్యతను ప్రయోజనాన్ని నేపథ్యాన్ని వివరిస్తున్నాయి. ఇటువంటి సమీక్ష వ్యాస సంకలనాల వలన పాఠకునికి ఆయా సాహిత్యాలను అతి తక్కువ సమయంలో అర్థం చేసుకునే వీలున్నది.

'జాషువా సాహితీ ప్రస్థానం' అనే వ్యాస సంకలనం ఎస్వీ సత్యనారాయణ సంపాదకత్వంలో వచ్చింది. ఇందులో జాషువా సృజన శీలతకు మూలమయిన సామాజిక, ఆర్థిక, తాత్త్విక పునాదులను వివరించే వ్యాసాలు ఉన్నాయి. విభిన్న కోణాల నుండీ జాషువా సాహిత్యాన్ని అంచనా వేసే కృషి చేశారు. జాషువా రచనలను ఎలా అర్థం చేసుకోవాలో సూచన ప్రాయంగా తెలిపే ప్రయత్నం చేశారు. ఈ విధంగా ఆయా కవులపై వ్యాస సంకలనాలు వస్తే సాహిత్య చరిత్ర వలన తెలియని అనేక అంశాలు తెలిసే అవకాశం ఉన్నది. కవితో బాటు ఆనాటి పరిస్థితులను తెలుసుకునే అవకాశం ఉన్నది.

ఈ విధంగా తెలుగు సాహిత్యంలో భిన్న ప్రక్రియలలో సంకలన గ్రంథాలు వచ్చి ఒక విశిష్ట స్థానాన్ని కల్పించుకున్నాయి. సాహిత్యానికి పరిపుష్టిని కలిగించాయి. ప్రాచీన సాహిత్య సంబంధిత సంకలనాల వలన వచ్చిన ప్రయోజనం సాహిత్యం నేటికీ నిలబడటానికి కారణమయింది. ఆధునిక యుగ సంకలనాల వలన విమర్శకునికి అధిక లాభం కలిగిందని చెప్పవచ్చు. ఎందుకంటే ఒక సాహిత్యానికి సంబంధించిన నేపథ్యాన్ని వివరించాలంటే ఒక కవి కవితా సంకలనం సరిపోదు. ఒక కథకుని కథా సంకలనం సరిపోదు. అనేక మంది కవుల ఆయాసాహిత్యాలకు సంబంధించిన కవితా సంకలనాలు అధ్యయనం చేయవలసిన అవసరం ఉంటుంది. ఆ అవసరం లేకుండా ఒక దృక్పథానికి సంబంధించిన సంకలనాలు వెలువడితే విమర్శకుడు దాని సహాయంతో ఆయా సాహిత్యాలకు నిర్వచనం ఇచ్చే ప్రయత్నం చేస్తాడు. అలాగే అతనికి ఆయా దృక్పథాలకు సంబంధించిన సాహిత్యాలపై అవగాహన ఏర్పడి అతడులక్షణమును ఏర్పరిచే అవకాశం ఉన్నది. ముఖ్యంగా ఆధునిక సాహిత్యం అస్పష్టతకు గురి అవుతున్న ఈ కాలంలో ఈ సంకలనాలు విమర్శకుడికి లక్షణాన్ని వివరించడంలో దోహదం చేస్తున్నాయనడంలో సందేహం లేదు. ఈ సంకలనాల ద్వారా లక్ష్య, లక్షణ, ప్రయోజన విశిష్టతలను వివరించేందుకు మార్గం సుగమమవుతుంది. ప్రతీ సంకలనం ద్వారా ఆయా సాహిత్యాల దృక్పథాలను అర్థం చేసుకునే అవకాశం ఉన్నది. మొత్తం మీద ఈ సంకలనాల ద్వారా సాహిత్య చరిత్రకారునికి విమర్శకునికి అధిక లాభం చేకూరితే సామాన్య పాఠకునికి ఆయా సాహిత్య మర్మాలను తెలుసుకున్న ఆనందం కలుగుతుంది. ఈ విధంగా సాహిత్యానికి సంకలన గ్రంథాలు విశిష్ట సేవను అందించి సాహిత్య పురోగమనానికి తోడ్పడుతున్నాయి.

బిర్లా మందిర్, సైఫాబాద్, హైదరాబాద్ - 500004.

# నేనో తెలుగు సాహిత్యాన్ని

జి. కృష్ణయ్య,
ఎం.ఏ. ద్వితీయ, పి.జి. కళాశాల

నేనో తెలుగు సాహిత్యాన్ని
అంతకు ముందు నేను
అక్కడక్కడ ఎక్కడో ముక్కలు ముక్కలుగా
పడి వున్న ఇసుక రేణువును

నన్ను బొమ్మను చేసి
'నన్నయ' నాకు జీవం పోసి
ఒక ఆకృతి నిచ్చాడు

'తిక్కన' నన్ను తీర్చిదిద్ది
నా ఆకృతికి మెరుగులద్ది
నన్ను అందంగా అలకరించాడు.

నా ఆకృతి అందం చూసి
నాకు ఇంకేదొ లోపం వుందని
మణిమాణిక్యాలు పొదగిన
కంఠాభరణం నా మెడలో
ధరింపజేశాడు 'ఎఱ్ఱన'

నిండు తెలుగుదనం కొరకు
నా నుదుట 'ద్విపద' తిలకం దిద్ది
నా కాళ్ళకు పారాణి రాశాడు

'పాల్కుర్కి'

నా తెల్లరంగు పట్టు చీరకు
నల్లంచు పోతనాచనపోశాడు
నా ప్రగతి కోరి, తన

కవిత్వపు కాలువలో
హొయలతో నన్ను
పయనింప జేశాడు

'శ్రీనాథ'

సరిలేని ఎనిమిది
సాహిత్యపు టేనుగులను
నాకు రక్షణ నిచ్చి
నా వ్యక్తి
శాశ్వత కీర్తి నిచ్చాడు

'కృష్ణదేవరాయ'

సుందర వందన వన
విహారిణి వరూధినిలా
నన్ను ప్రబంధాన్ని
చేశాడు 'పెద్దన'

దయలేని దక్షిణాంధ్ర కవులు
నడి వీధిలో నిలబెట్టి
నా వలువలు వలచి
నన్ను వివస్త్రను చేసి అవమానిస్తుంటే
నా 'విలాపం' వినలేక
ఓదార్చి కన్నీళ్ళు తుడిచాడు
నా 'కందుకూరి'

ముత్యాల ముగ్గువేసి
ముద్దబంతి పూలుపోసి
దానిపై నన్ను కూర్చోబెట్టి

'ముత్యాల సరాల'ను
నా కందించాడు 'గురజాడ'

నాలో భావుకతను నింపి
స్వప్నాల సౌధాన్ని నిర్మించి
నను 'ఊర్వశి'ని చేసి
ఊహాలోకంలో విహరింప
జేశాడు 'కృష్ణశాస్త్రి'

నన్ను 'అమలిని'ని చేసి
నాకు సంపూర్ణత నిచ్చి
నను దేశమాతను చేశాడు

రాయప్రోలు

దారిద్ర్యపు కారు చీకట్లో
దవళవర్ణ కాంతి రేఖయి
నను తెలుగు తల్లిని చేశాడు

'దాశరథి'

జగానికి నా జాడ జూపి
జనులలోకి తీసుకెళ్ళాడు

'జాషువా'

శతాబ్దాలుగా అణచబడుతున్న
స్త్రీ జాతిక్కి నన్ను
చేరువ చేశాడు 'చలం'

విడివడిన నా కురులు

ముడివేసి వాల్జెడ అల్లి
అందులో ఎర్రకలువలు
తురిమినాడు "శ్రీశ్రీ"
వినీలా కాశంలో నన్నొక
తారను చేసి

నా విశ్వరూపం
చూపాడు 'విశ్వనాథ'
ప్రస్తుతం తన బాహువులపై
నన్ను వేసుకొని
సాహితీ జగత్తులో
సాగిపోతున్నాడు 'సినారె'

వీర్లపల్లి - గ్రా, మర్పల్లి మండలం, రంగారెడ్డి,జిల్లా.

# మేమున్నంత వరకు ..... . ...

యస్. భీష్మాచారి

ఎం.ఏ. ప్రథమ, ఆర్ట్స్ కళాశాల.

కాండము లేని
   చెట్టు ఉంటుందా?
సమతలేని
   మతం ఉంటుందా?
శిరస్సులేని
   మొండెం ఉంటుందా?
వేదన లేని
   హృదయం ఉంటుందా?
కాశ్మీరు లేని
   మా భారతం ఉంటుందా?
ఉండదు గాక ఉండదు
సమైక్యత యజ్ఞంలో
సమిధలమై మేము ఉన్నంత వరకు .....

గ్రా॥ ముదిగొండ, దేవర కొండ మండలం, నల్గొండ జిల్లా.

# అక్షరాలు ఏడుస్తున్నాయి . . . . !

వెల్దండి శ్రీధర్
ఎం.ఏ. ద్వితీయ, ఆర్ట్స్ కళాశాల

ఆంధ్రసారస్వతపరిషత్తు, దేవులపల్లి రామానుజారావు కళామందిరం సాహితీ బంధువులతో క్రిక్కిరిసి పోయింది. 'అత్యాధునిక సాహిత్యం- ధోరణులు, అనే అంశంపై పరిషత్తు సదస్సులు నిర్వహిస్తుంది.

వేదికపై వక్తలు తమ వాక్సుధా ధారలను సాహితీ పిపాసులపై కురిపించడానికి సన్నద్ధమవుతున్నారు. సభాధ్యక్షులు శ్రీ శివదేవయ్య ప్రసంగించబోయే ఉపన్యాసకుని గూర్చి సంక్షిప్తంగా వివరిస్తున్నారు. "ఇప్పుడు డా॥ నన్నయ గారు తమ అమూల్య ప్రసంగంతో సదస్సును ప్రారంభిస్తారు. వీరు ప్రస్తుతం ఉస్మానియావిశ్వవిద్యాలయం ఆర్ట్స్ కళాశాలలో రీడర్‌గా పనిచేస్తున్నారు. 'తెలుగు రామాయణాలు - కర్తృత్వ వివాదాలు' అనే అంశంపై పి.హెచ్.డి పట్టం పుచ్చుకున్నారు. అలాగే ఎన్నో వివాదాస్పద ప్రతిపాదనలను చేసి సాహితీ ప్రపంచపు గమనాన్ని మార్చినవారు కూడా అంటూ సదస్యులకు పరిచయం చేసి నన్నయ వైపు చిరునవ్వుతో చూశారు.

డా॥ నన్నయ తన ప్రసంగ పత్రాలవైపు ఓ మారు చూసుకొని ప్రసంగాన్ని ఆరంభించారు. "అత్యాధునిక సాహిత్యం అనగానే చాలామంది సాహితీవేత్తలు "మాకు అర్థంకాదు" అనే మాట అనేస్తారు. కారణం ఏదైనా కావచ్చు సాహితీ వేత్తలకే అర్థం కాని సాహిత్యాన్ని నేడు మనం సృష్టిస్తున్నాం. మరి సామాన్యుడి మాటేమిటి?

మన తెలుగుసాహిత్యంలో ఎంతోమంది ప్రతిభావంతులైన కవిపుంగవులున్నారు. వారంతా నేడు మారుతున్న వాదాల పేర ఏదో ఒక గొడుగు క్రింద ఉండి తమ రచనల్ని వెలువరిస్తున్నారు. ఆ వాదాల పేర్లు నేను చెప్పడం లేదు. అలాగని వాటిని కించపరచడమూలేదు. వారు వెలువరిస్తున్న సాహిత్యంతో సమాజాన్ని భిన్న సంఘాలుగా విభజిస్తున్నారు. తద్వారా అమాయక ప్రజలకు 'నీదీ కులం', 'నీదీ వర్గం', 'నీదీ మతం' . అనే అభిప్రాయాన్ని నూరిపోస్తున్నారు. కాని నేడు మనకు కావాల్సింది సమాజాన్ని వివిధ సంఘాలుగా విభజిస్తూ మనుషుల్ని, మనసుల్ని వేరు చేసే సాహిత్యం కాదు.

స్త్రీనే భూమి కన్న పెద్ద గురుత్వాకర్షణ శక్తిగా చూపెట్టిన ప్రబంధ యుగం పోయింది. కవి నేల విడిచి అంతరిక్షయానం చేసే రోజులు వెళ్ళిపోయాయి. అభ్యుదయం

రోజులు చెల్లిపోయాయి, సాహితీ మాతను దిగంబరం చేసిన రోజులు కాలంలో కల్సి పోయాయి, కవిత్వాన్ని కలంతో కాక తుపాకి గొట్టంతో రాసిన రోజులు వారి తుపాకి గుండ్లలాగే గమ్యం చేరలేక పోయాయి. అలాగే నేడు నడుస్తున్న వివిధ ఇజాలు కూడా పోయి సకల మానవ కోటిని ఒకే గొడుగు క్రిందికి తీసుకు వచ్చే సాహిత్యం కావాలి. చరిత్ర మలుపు తిరగాల్సిన ఆవశ్యకత, కవిత్వం తన బాణీ మార్చుకోవలసిన అవసరమూ ఏర్పడింది. ఇక నుండి మన రచనలు ఆవైపుగా సాగాలి. ఇప్పుడు చలామణి అవుతున్న వివిధ ఇజాలకు చరమగీతం పాడి ఒక క్రొత్త వాదానికి జీవం పోయ్యాలి. మీరంతా అనుమతిస్తే నేనొక క్రొత్త వాదాన్ని ప్రతిపాదించదలుచుకున్నాను, మరో అత్యాధునిక ధోరణిని ప్రవేశ పెట్టదలచుకున్నాను". అని నన్నయ సభామందిరాన్ని ఆద్యంతం కలయ చూశారు.

సభలో నిశ్శబ్దం రాజ్యం చేస్తుంది. అటు ప్రేక్షకులతో పాటు వేదికనలంకరించిన ఇతర వక్తలు కూడా ఆలోచనా సముద్రంలో మునిగి పొయ్యారు.

నన్నయ మళ్ళీ తనే మొదలు పెడుతూ నేను ప్రతిపాదించే సరికొత్త వాదం పేరు "సమష్టి వాదం' లేక 'యునిటిజం' ఈ వాదాన్నే సమర్థిస్తూ నేను వ్రాసిన 'ఐక్యప్రపంచం' అనే కవితాసంపుటిని ఇదే వేదికపై శ్రీ శివదేవయ్య గారు ఆవిష్కరించాలని.... అభ్యర్థిస్తున్నాను" అంటూ తన వద్దనున్న సీల్ చేసిన ఒక ప్యాకెట్‌ను సభాధ్యక్షునికి అందజేశారు.

శ్రీ శివదేవయ్య పుస్తకాన్ని సదస్సులో ఆవిష్కరించి ప్రదర్శించారు. సభలో కరతాళ ధ్వని సాహితీ ప్రియుల హర్షాన్ని చాటి చెప్పింది.

★ ★ ★

"ఏవండీ. . . . " అని భవనపు పునాదులు కదిలిపోయేలా ఆర్తనాదం చేస్తూ ఆ రోజు దిన పత్రిక పట్టుకొని బెడ్‌రూంలోకి పరుగుపెట్టింది నన్నయ భార్య వాసంతి.

పాయక పాకశాసనికి భారత ఘోర రణంబునందు నారాయణునట్లు ఆదికవి నన్నయకు నారాయణభట్టు ఎలా సహకరించాడో అలాగే వాసంతి కూడా తన భర్త చేపట్టిన 'సమష్టి వాదానికి' తన సహకారాన్ని సంపూర్తిగా అందజేస్తుంది. తెలుగులో పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేయడం, తాను కూడా సమష్టివాది' కావడం అందుకు కారణాలు.

"ఏమైందోయ్ ఉదయమే ఆ అరుపూ స్వప్న లోకంలో విహరించే నన్ను ఏకంగా భువిపైకి గిరాటేసేలా?" అంటూ బెడ్‌రూంలోకి పరుగుతో వచ్చిన భార్యను కౌగిట్లో బంధించాడు నన్నయ.

"అబ్బ వదలండీ .... ఊపిరాడటం లేదు బెడ్ రూంలోకి వస్తే చాలూ మీకెప్పుడూ అదే గోల" అంటూ పేపర్లో ఉన్న వార్తను చూపించింది భయంతో కూడిన ఛాయలు ద్యోతకం అవుతున్న వదనంతో.

"దీని పేరే రసకేళీ మందిరం గదా" అంటూనే పేపరందుకున్నాడు 'నన్నయను అరెస్ట్ చేయాలి' అన్న వార్త పతాక శీర్షికలో ప్రచురింపబడింది. నిన్న సారస్వత పరిషత్తులో జరిగిన సదస్సులో నన్నయ ప్రతిపాదించిన సమష్టివాదాన్ని ఖండిస్తూ కొన్ని ఇజాలకు నాయకత్వం వహించే రచయితలు "అమాయక ప్రజల్ని తప్పుదోవపట్టించే ఇట్లాంటి 'సోకాల్డ్ యునిటిజం' కవుల్ని ప్రభుత్వం వెంటనే స్పందించి అరెస్ట్ చేయాలని" డిమాండ్ చేస్తూ ఇచ్చిన ప్రకటనకు చెందిన వార్త అది. వార్తను ఆసాంతం చదివి "ఇదంతా మామూలేనోయ్ ఆదిలో ప్రజలకు వ్యతిరేఖమని అనుకున్న ఒక కొత్త చట్టం అమలుకు వచ్చినపుడు ప్రజలు వాదవివాదాలకు దిగడం కొత్త కాదు గదా. గతంలో భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం, విప్లవ కవిత్వం, దిగంబర కవిత్వం, ఇప్పుడు కొనసాగుతున్న పలు ఇజాలు మొట్ట మొదట ఆరంభమైనపుడు సాహితీ ప్రపంచంలో ఇట్లాంటి ఉద్రిక్త వాతావరణం నెలకొనలేదా? ఇదీ అలాగే" అంటూ అప్పటికే బుగ్గల కెంపులపైకి కన్నీటి బిందువుల్ని తెచ్చుకున్న భార్యను ఓదార్చాడు.

"ఏది ఏమైనా మీరు ముందస్తు బెయిల్ తెచ్చుకోవడం మంచిందండి".

"సరే అలాగే చేద్దాం".

★★★

రేడియో టీ.వి. ల్లాంటి ప్రచార సాధనాలు 'సమష్టి వాదాన్ని ప్రచారం చేస్తున్న నన్నయతో ఇంటర్వ్యూలను ప్రసారం చేసి సాహిత్యప్రపంచపు మన్ననలను పొందుతున్నాయి. ఇక పేపర్లైతే ఒక క్రొత్త అంశం దొరకడంతో తమ సర్క్యులేషన్ని పెంచుకోవడానికి విపరీతంగా పోటీపడుతున్నాయి. ఆంధ్రదేశం అంతటా ఎక్కడ చూసినా 'యునిటిజం' గూర్చిన చర్చలే. ఏ పేపరు తిరిగేసినా 'సమష్టి వాదం'పై విమర్శతోనో ప్రశంసతోనో కూడిన వ్యాసాలే.

నన్నయ వ్రాసిన 'ఐక్య ప్రపంచం' కవితా సంపుటికి 1996వ సంవత్సరపు కేంద్రసాహిత్యఅకాడెమీ బహుమతి,. ఆ తరువాత నోబెల్ బహుమానమూ వచ్చాయి.

'నేడు క్రమంగా ప్రపంచంలో మనిషికీ, మనిషికీ మధ్య ఎడబాటు పెరిగి నీదీ కులం, నాదీ కులం, నీదీ వర్గం, నాదీ వర్గం అనే దుష్టభావాలు ఏర్పడి మానవ సమాజం ముక్కలు ముక్కలుగా అయిపోయింది. ఏ కుల ప్రసక్తీ లేని, ఏ మత ప్రసక్తీ లేని, ఏ వర్గ ప్రసక్తీ లేని ఆదిమ సమాజం మళ్ళీవస్తే బావుణ్ణనిపిస్తుంది. కాబట్టి ఆది నుంచీ ఏ ఉద్యమాన్నైనా సాహిత్యం, సాహిత్యం ఉద్యమాల్ని ప్రభావితం చేసింది. ఈ 'సమష్టివాదం' కూడా సాహిత్యంతోనే మొదలు కావాలి. అనే నన్నయ అభిప్రాయాన్ని ఆంధ్రదేశంలోని ఉద్దండ పండితులు కూడా సమర్థించి చేయూత నిచ్చారు. ఆది కవి నన్నయ 'శబ్దశాసనుడైతే' ఈ నన్నయ 'కవితావస్తు శాసనుడు' అయ్యాడు. ఆది కవి తెనుగు భాషను కూలంకషంగా పరిశీలించి, లక్షణాలను నిర్మించి దానికి కావ్య గౌరవాన్నిస్తే నేటి కవి నన్నయ నేడు వెలువడుతున్న సాహిత్యాన్ని ప్రక్షాళన చేసి దిశానిర్దేశకుడయ్యాడు. అందరికీ మార్గదర్శకుడయ్యాడు. ఎందరి సన్మానాలనో అందుకున్నాడు.

★ ★ ★

'రోడ్డు ప్రమాదంలో నన్నయ మృతి' అన్న వార్త విని ఆంధ్రదేశమంతా చలన రహిత జీవిలా·అయింది. సాహిత్యంలో సమష్టివాదాన్ని ప్రవేశపెట్టి ఎంత అలజడిని సృష్టించాడో నన్నయ అనతి కాలంలోనే అనంత వాయువుల్లో కలిసి అంతే అలజడిని రేపాడు. 'దివిజ కవివరుగుండియలు దిగ్గురనగ నరుగుచున్నాడు నన్నయ అమరపురికి' ప్రపంచ సాహిత్య చరిత్రలోనే మొట్ట మొదటి సారిగా అదీ ఒక ఆంధ్ర కవికి ప్రభుత్వ లాంచనాలతో అంత్య క్రియలు జరుగుతున్నాయి. ప్రభుత్వం నన్నయ మరణానికి సంతాప సూచకంగా ఏడు రోజులు సంతాపదినాలుగా ప్రకటించింది. ఆంధ్ర సాహితీ బాంధవ లోకం అంతా నన్నయకు అశ్రునయనాలతో వీడ్కోలు పలుకుతుంది.

ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన గంధపు చెక్కల చితిని దుఃఖసాగరం నుంచే వచ్చి నిప్పంటించాడు నన్నయ పుత్రుడు తిక్కన. మంటలు ఒకేసారి పైకి లేచాయి సమష్టిగా.

స్మశానంలో నడుస్తున్న అందరిలో నన్నయదే కులం అన్న ప్రశ్న వచ్చింది. ఎవరో చెప్పారు. ఏ వర్గం అన్నారు. ఎవరో చెప్పారు. ఏ ఇజం అన్నారు, ఎవరో చెప్పారు. ఇవి ఏవీ తమవి కావంటూ అసలు నన్నయ తమ కులం, తమ మతం, తమ వర్గం, తమ ఇజం కాదంటూ ఎవరి జెండాలు వారు పట్టుకొని ఒకరి నొకరు కొరకొర చూసుకుంటూ వెళ్లిపోయారు. ఆకాశంలోని నన్నయ అక్షరాలు కన్నీటి వర్షాన్ని కుమ్మరించాయి.

గ్రా॥ కోహెడ, జిల్లా: కరీంనగర్ - 505473

# జీవన ప్రస్థానం..... . ...

కందాళ శ్రీనివాసాచార్యులు
ఎం.ఏ. ద్వితీయ, పి.జి.కళాశాల

ప్రేమ ఒక ఆరాటం
పెళ్ళి ఒక ఆర్భాటం
జీవితం అంతులేని ఒక అంతర్మథనం

అనుబంధాలు అనురాగాలు
మనిషి జీవన ప్రయాణపు
మార్గాయాసంలో సేదదీర్చే
నీటి చెలిమలు.

గతించిన కాలపు తీపి
గుర్తుల జ్ఞాపకాలు మనిషి
హృదయాకాశంలో మెరిసే నక్షత్రాలు

బతుకు బాటలో మెతుకు వేటలో
జీవన పోరాటంలో
ఒడిదొడుకుల ప్రయాణంలో
చిమ్మచీకట్లు, కాంతి రేఖలు
వెరసి మనిషి ప్రస్థానం
జీవిత ప్రస్థానం.

6-3-126/ఆర్/19, సావర్కర్ నగర్, నల్గొండ.

# 'నూతన సంవత్సరం'

కె. సత్యనారాయణ
ఎం.ఏ. ప్రథమ, ఆర్ట్స్ కళాశాల

వస్తుంది వస్తుంది నూతన సంవత్సరము
తెస్తుంది తెస్తుంది క్రొంగొత్త దనము
వస్తుంది వస్తుంది నూతన సంవత్సరము
తెస్తుంది తెస్తుంది క్రొంగొత్త దనము

సాగరాలు దాటి సరస్సులు దాటి
దేశ ప్రాంగణమగు పర్వతాలు దాటి
పచ్చ పైరులు దాటి పల్లెలలోగిలికి
నదీమ తల్లుల దాటి నగరాల దాటి
ఆస్పత్రులనున్న అభాగ్య జీవుల
కఠిన రుగ్మతలను కాలరాయాలని
ఇమ్యూనిటీ ఇంజక్షన్ ఇవ్వాలని

చెరసాలలో పడి ఉన్న ఖైదీలు
దొంగ మార్గము నుండి దూరమవ్వాలని
బుజ్జగింపు మాటల బుద్ధులు నేర్పాలని
నెయ్యమ్ము నీతి కరపాలని

తిండిగింజలు లేక తల్లడిల్లు ప్రజల తల్లి నవ్వాలని
అనుగు తనయులకు నేనతి ప్రేమతో
అన్న భాండములను వడ్డించాలని
ఆకలి రక్కసిని పారదోలాలని

ఇల్లు గుల్లాచేసి పెట్టుబడులు పెట్టి
రాత్రిపగలనక రాటు మోటలు గొట్టి
ఫంటలకై పరితపించు రైతన్నల పట్టు
చేరాలని యజ్ఞఫలము లందించాలని

క్షణం క్షణం విలువైన కణమని చాటిచెప్పాలని
విద్యార్థి లోకములో విద్యుత్తు వెలిగించాలని
బంగారు భవితకు బాట వేయాలని
నవ కాపీ కల్చర్‌ను కడిగి వేయాలని

వరకట్న కూపమున పడి ఉన్న
పడతులపైకి లేపాలని
అత్త మామల ఆగడాల నాపాలని
కట్నాల కుళ్ళును వదల గొట్టాలని

మత్తు మైకములోన పడియున్న
మనుషులకు మద్యం త్రాగరాదని
తన్ని చెప్పాలని తాట ఒలవాలని
అర్థానికి అంకితం కారాదని

అంగవైకల్యము లనుభవించువాళ్ళకు
మనో వేదన కాస్త మరుగు అవ్వాలని
మనసులో సుగంధ పరిమళాలు చల్లాలని
'సర్వే జనాః సుఖినో భవంతు' అన్న
మాట నిజం చేయాలని ........

(వస్తుంది వస్తుంది నూతన సంవత్సరము)

గోవిందపల్లి -గ్రా, గొల్లపల్లి - మ, కరీంనగర్ - జి.

# ఆధునిక కవిత్వం - దేశభక్తి

కె. శ్రీనివాసులు

ఎం.ఏ. ద్వితీయ, పి.జి. కళాశాల

సుమారు రెండువందల సంవత్సరాలు రాజకీయంగా, సాంఘికంగా, సాంస్కృతికంగా, ఆర్థికంగా నలిగిన దేశప్రజల ఆక్రందనలకు కవులు ఆవేశంతో స్పందించి వ్రాసిన కవిత్వం దేశభక్తి కవిత్వం అవుతుంది.

ఏదేశములోనైనా స్వాతంత్ర్యం కోసం ప్రజలలో రాజకీయంగానే కాకుండా సాహిత్య పరంగా చైతన్యం రావడం కన్పిస్తుంది. వందేమాతర ఉద్యమము ఎన్నో రాష్ట్రాలను కలిపి ఒక దేశంగా ఏర్పాటు చేసింది. బ్రిటిష్ ప్రభుత్వం అలాంటి ఉద్యమాన్ని నిషేధించింది. ఆ సమయములో బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఎదిరించలేకపోయాయి. "దేశసేవ చేయండి" అన్న ప్రబోధపు నీడలో మాతృదేశ దైన్యస్థితిని సంకీర్తనల ద్వారా వర్ణించి ప్రజలను ఉత్తేజితులను చేసినారు కవులు.

ఆధునిక ఆంధ్ర కవిత్వంలో దేశభక్తిని రెండు విధాలుగా విభజించారు. 1. ఉద్యమ కవితాస్రవంతి, 2. ఆంధ్రాభిమాన స్రవంతి.

బ్రిటిష్ ప్రభుత్వపాలన కాలంలో (20 శతాబ్దంలో) భారతదేశ రాజకీయ రంగం చిన్నాభిన్నం అయ్యింది. ఈ పరిణామాలకు తెలుగు కవులలో కవితా చైతన్యాగ్ని క్రమంగా రగులుకున్నది. ఆ సమయంలో ఎన్నో ఉద్యమాలు బయలు దేరినాయి. సహాయనిరాకరణోద్యమం, ఉప్పు సత్యాగ్రహం, విదేశి వస్తు బహిష్కరణ, క్విట్ ఇండియా ఈ ఉద్యమాలు వేగంగా పుంజుకోవడంతో దేశభక్తి కవిత్వం వ్రాయడం మొదలైంది.

ఈ దేశభక్తి కవుల్లో కలుగడానికి కారణం స్వాతంత్ర్యకాంక్ష. దేశాభిమానమే వీరి కవితా వస్తువు. ఈ దేశభక్తి కవిత్వం ఒక అఖండ భారత భావన. దేశభక్తి కాకుండా దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడిన నాయకులపై కూడా అభిమానం ఈనాటి మన కవుల్లో ఉండేది. రాజకీయాలను స్మరిస్తూ ఎన్నో జాతీయపాలనలపై కవిత్వాలను వ్రాసారు.

దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
– – – – – – – – –
– – – – – – – – – – – –
దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్

అన్న గురజాడ గేయము కవుల్లో ఎంత దేశభక్తి పొంగి పొరలుతుందో సూచిస్తుంది. దేశభక్తి గూర్చి గురజాడ వ్రాసిన దేశమును ప్రేమించుమన్నా! అన్న గేయము ఒక దేశభక్తి కావ్యంగా చెప్పుకోవచ్చు. తన ఆశయాలను చెప్పటానికి ఈ గేయాన్ని వినియోగించినాడు. ముత్యాలసరము కూర్చి భాషకు నూతనాలంకారాలను కల్పించాడు కవిత్వం పండితుల ప్రత్యేకనిధి కాకుండా అందరికి దేశభక్తి మార్గాన్ని చూపించాడు. వైతాళికులనే మేలుకోలిపినవాడు మన గురజాడ.

భారత భూమిని మొదటిసారిగా తల్లిగా గుర్తించి కవిత్వాన్ని వ్రాయడం భారతీయ కవులకే చెల్లింది. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి, గరీయసి" అన్న రామాయణ వాక్యం ఆనాడే దేశభక్తిని ఎంతో హృద్యంగా చిత్రించింది.

గురజాడ తర్వాత దేశభక్తి గూర్చి ప్రజలకి హృదయాలకు హత్తుకునేలా చెప్పింది రాయప్రోలు వారు.

ఏదేశమేగినా, ఎందు కాలిడినా
ఏ పీఠమెక్కినా, ఎవ్వరెదురైనా
పొగడరా! నీతల్లి భూమి భారతిని
నిలుపరా! నీజాతి నిండు గౌరము !

ఇలాంటి గేయాలను వ్రాసి ప్రజలలో దేశభక్తిని పెంపొందింప చేశారు. జాతీయోద్యమం ద్వారా ప్రజల అంతరాల్లో దాగిఉన్న చైతన్యాన్ని తట్టిలేపి జడత్వాన్ని వదిలించారు.

"శ్రీలు పోంగిన జీవ గడ్డయి
పాలు బారిన భాగ్య సీమయి
వరలినది ఈ భరతఖండము
భక్తిపాడరా తమ్ముడా" అని ఆంధ్రులలో

భక్తి పారవశ్యాన్ని ఉత్తేజవంతం చేసినకవి రాయప్రోలువారు అమరావతి పట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయాలు స్థాపించినారు. అంటూ పద్యాలు వ్రాసి ఆంధ్ర రాష్ట్ర ఏకీకరణకు దోహదం చేశారు. ఇంకా తెలుగు నదులను రాజులను వారి పరాక్రమాన్ని తెలుగు సంపదని స్ఫుటమైన రేఖలతో చిత్రించి చూపిన కవిపుంగవులు రాయప్రోలు.

గురజాడ, రాయప్రోలు తర్వాత దేశభక్తి ప్రబోధిస్తూ గీతాలను ఆలపించిన కవి కృష్ణశాస్త్రి.

"జయ జయప్రియ భారత జనయిత్రీ దివ్యధాత్రి
జయ జయ శతసహస్ర నరనారీ హృదయనేత్రి"

అని శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి భారతదేశాన్ని మాతృమూర్తిగా స్త్రీ పురుష సమాహితమైన అసంఖ్యాక జనాదీకంతో రూపొందిన సంఘటిత శక్తిగా భావిస్తూ వ్రాసిన గీతం.

బ్రిటిష్ వారు మనల్ని ఏలా దోచుకుంటున్నారో చిలకమర్తి వారు తమ పద్యములో పొందుపరిచారు జాతీయోద్యమ కవిత్వానికి శ్రీకారం చుట్టినది చిలకమర్తి.

"భరత ఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకు చున్నారు మూతులు బిగియగట్టి"

అంటూ జాతీయ భావాన్ని వ్యంగ్యంగా అన్యాపదేశంగా కాకుండా సూటిగా నిష్కర్షగా సామ్రాజ్యవాదాన్ని దుయ్యబట్టిన కవి చిలకమర్తి.

భారతదేశ భౌతిక సంపదలోని భాగాలే గాక నదీ నదాలు, పర్వతాలు, పుణ్యక్షేత్రాలు, చారిత్రక ప్రదేశాలు మొదలైనవాటిని కూడా వివరిస్తూ చెప్పారు. మంజీరాను దాశరథి వర్ణిస్తూ -

"ఎవరి గజ్జెల రవళివే నీవుమంజీర
ఎవరి కజ్జెల బాష్పధారవే మంజీర
నీవు పారిన దారిలో ఇక్షు దండాలు
నీవు జారిన జాడలో అమృత భాండాలు"

ఈ నది వర్ణన వలన నది జలాలలో దేశం సస్యశ్యామలం కావడం ప్రగతి పథంపై దృష్టిసారించడం కనిపిస్తుంది. "నా తెలంగాణ కోటి రత్నాలవీణ" అని నిజాంరాజును ఎదిరించి దేశభక్తి గీతాలు వ్రాయటంలో సిద్ధహస్తులు దాశరథి.

"మాకోద్దీ తెల్ల దొరతనము
మాప్రాణాలపై పొంచి మానాలు హరించిన"

ఈ సైతాను ప్రభుత్వాన్ని ఇక సాగనీయమండోయ్ అంటూ గరిమెళ్ళ ఆంగ్లేయుల మాయల్ని పసిగట్టి విరగబడి దండోరా చేశారు.

మాపాలి మహలక్ష్మి మాయన్నపూర్ణ
మా సరస్వతిదేవి మారాజ్యలక్ష్మి

అంటూ చెఱుకువాడనరసింహగారు విదేశీవస్త్రదహనం ప్రారంభమైనపుడు రాట్నాన్ని గృహలక్ష్మిగా పూజించడం మొదలు పెట్టారు.

కవిరాజు త్రిపురనేని రామస్వామిచౌదరి నిస్వార్థదేశభక్తుల్ని స్వరాజ్య సమరానికి ఆహ్వానించారు.

"వీరగంధము తెచ్చినారము
వీరుడెవ్వడొ తెల్పుడి
పూసిపోదుము, మెడను వైతుము పూలదండలు భక్తితో
తెలుగువారల వేడినెత్తురు తుంగభద్రను గలసినప్పుడు
దూరమందున్న సహజకత్తి నెత్తురు కడిగినప్పుడు
వీరగంధము మైనలందుము"

స్వచ్ఛంద ఆశయంతో నిరఖిల జాతీయతా భావంతో దువ్వూరి రామిరెడ్డి స్వాతంత్ర్య రథము నడిపినారు.

"అంబుదంబుల నమృతపూరంబు లొలుక
నింద్ర చాపంపుదోరణ మింపుగులుక
గాఱుమెఱుగులు నెల్లెడ గడలుకొనగ
వెడలె స్వాతంత్ర్యరథము విన్వీధియందు"

కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి ప్రసన్న మధురమైన కవితనాలకించునప్పుడు శ్రోతలు తేనెసోన నానుచున్నట్లు, మకరంద ప్రవాహమున ఓలలాడుచున్నట్లు, మలయపవన వీచికలలో తేలిపోవుచున్నట్లు స్వతంత్ర భారతిని పాడినారు.

"గణ గణ మ్రోగెరా విజయఘంటలో భారతమాత మందిరం
గణమున, ద్వారబంధముల గట్టిరి చిత్రవిచిత్ర రత్నతో
రణపతి, వీధివీధుల విరాజిలుచున్నవే త్రివర్ణకే
తనములు, మేలుకాంచే పరతంత్ర పరాఙ్ముఖసుప్తకంఠముల్".

ఆధునిక కవుల్లో పొంగిన దేశభక్తి కవిత్వం ప్రజల్లో దేశభక్తిని పెంపొందించేలా భక్తి పారవశ్యంతో ఉండింది. కవుల హృదయకమలాలు వికసించి జయగీతాల సౌరభాలు జగమంతా వెదజల్లాయి. దాని ఫలితమే నేటి స్వాతంత్ర్యం.

---

ఇం.నెం. 2-50, కిల్లా బజార్, దేవర కొండ.

# లలిత కళలు

ఆర్. రమాదేవి

ఎం.ఏ. ద్వితీయ, మహిళా కళాశాల

కళలు అంటే సౌందర్యమును స్ఫురింప జేసేవి. బుద్ధికుశలతను ఉపయోగించి నేర్పుతో చేసేవి కళలు. ఈ కళలు మనిషి బుద్ధిని వికసింపచేసి, హృదయమును స్పందింపజేసి సదామనిషిని ఉన్నత సంస్కారవంతుడిగా తయారు చేయును. కళలు అరవై నాలుగున్నాయి.

మన దేశములో ప్రాచీన కాలము నుండి కళలు చక్కగా వృద్ధి చెందినవి. ఈ కళలను రాజులు, చక్రవర్తులు, మంత్రులు పరిపోషించుట ద్వారా ఇవి ఇప్పటికీ ఇలా ఉండగల్గినవి. పోషణ లేకుంటే ఏ కళా వృద్ధి చెందదు. రాచరికములు పోయిన తర్వాత ఈ కళలను ప్రజా ప్రభుత్వములు ప్రోత్సహించి ఆదరించుచున్నవి. ఈ కళలు పూర్వం నుంచీ రెండు విధములుగా ఉన్నాయి. ఒకటి ఔపయోగిక కళలు (వ్యావహారిక కళలు) కాగా, రెండు లలిత కళలు.

ఔపయోగిక కళలు మానవుని భౌతిక జీవితమును సుఖమయము చేయును. ఉదా:- గృహ నిర్మాణము, వస్త్రములు నేయుట మొదలగునవి.

లలిత కళలు క్రియా లాలిత్యముతో రసానంద జనకత్వముతో ఔపయోగిక కళల కంటే భిన్నంగా ఉండి మనిషి జీవితానికి వికాసాన్ని కల్గిస్తాయి. లలిత కళలు ఇంద్రియముల ద్వారా మనసును ఆనందింపజేయును. పాశ్చాత్యులు లలిత కళలను "Fine Arts" అంటారు. (Art is that which is not nature) కళ అనేది ప్రకృతి కానిది. ప్రకృతి కంటే భిన్నమైనది. మనిషి చేత నిర్మింపబడినది ఈ లలిత కళ.

లలిత కళలు ఐదు 1. కవిత్వము, 2. సంగీతము, 3. నృత్యము, 4. చిత్రలేఖనము, 5. విగ్రహశిల్పము.

**1. కవిత్వము :** - లలిత కళలలో కవిత్వానికి మొదటి స్థానము ఇది మిక్కిలి గొప్పనైనది. కవిత్వము మనిషికి రసానందము కలుగజేస్తుంది. కవిత్వము భగవంతుని సృష్టిలో చాలా సహజమైనది. భగవద్దత్తమైన బుద్ధియందును, హృదయము నందును పుట్టి ఈ రెండింటి కలయికతో నోటి నుండి వెలువడు గుణము కలిగినది తిరిగి కవిత్వము రసజ్ఞులైన వారి బుద్ధికిని, హృదయమునకే తెలియును. ఇది విచిత్రమయిన విషయము.

మంచి కవిత్వము కళగా వెలువడుటకు ఎంతో విద్యాభ్యాసము అవసరము. వివిధ రకాలైన గొప్ప కావ్యముల వలన, ఛందశ్శాస్త్రము, అలంకార శాస్త్రము. భాషా వ్యాకరణముల అధ్యయనం వలన, లోక విజ్ఞానము వలన, కవిత్వము వ్రాయగలుగుతారు. ఇవియే కాక నిత్యము అభ్యాసము ఉన్నచో కవిత్వము అబ్బుతుంది. "అభ్యాసము - కూసు విద్య" అనే లోకోక్తి అభ్యాసమునకు ఉన్న ప్రాముఖ్యమును తెలుపుచున్నది. కావున అభ్యాసము ఉండటం వలన ఎవరికైనను కవిత్వము సుసాధ్యము. కవిత్వము దేశికవిత్వము, మార్గ కవిత్వము అని రెండు విధములు.

**2. సంగీతము :** లలిత కళలలో సంగీతానికి రెండవ స్థానం. సంగీతములోని మాధుర్యమునకు శిశువులు, పశువులు, పాములు కూడా తన్మయత్వమును పొందును. సంగీతము కవిత్వములాగా కాకుండా సామాన్య మానవున్ని కూడా ఆనందింపజేస్తుంది. సంగీతము లలిత కళలలో అన్నింటి కంటెను ఎక్కువగా ఆకర్షించు కళ. అందుకే దీనికి ఎక్కువ కీర్తిఉంది. దీని సృష్టికి వివిధ పరికరములు అవసరము. గాయకుడు తన మధురమైన కంఠముతో, వాయులీనము, వీణ మొదలగు వాద్యములనుపయోగించి పాడి ఆనందింపజేస్తాడు. సంగీతము రెండు విధములు ఒకటి కర్ణాటక సంగీతము, రెండు హిందుస్థానీ సంగీతము. ఈ రెండూ మనోరంజకమును కల్గిస్తాయి.

'అక్బరు' ఆస్థానములోని సంగీత విద్వాంసుడు అయిన 'తాన్‌సేన్' తన గాన మాధుర్యము చేత వర్షమును కురిపించారని చరిత్ర చెబుతుంది. సంగీత, కవిత్వములు సరస్వతీమాత క్షీరముల వంటివి. అందులో సంగీతము ఆపాత మధురము, కవిత్వము ఆలోచనామృతమును కల్గిస్తాయి. ప్రఖ్యాత వాగ్గేయకారుడు త్యాగయ్య సంగీతము చేత శ్రీరాముని ప్రసన్నుని కావించుకొనెను. అన్నమయ్య త్యాగయ్యల పదాలు కవిత్వ ప్రక్రియకు చెందినా అవి సంగీతముతో కూడి ఉన్నాయి. రామరాజుభూషణుని 'వసుచరిత్ర' కూడా సంగీతముతో మేలవించిన రచన కావడం చేత చదివిన సహృదయుని రసజగత్తులో ఓలలాడించును. ఈ విధంగా సంగీతము, కవిత్వము పరస్పర సంబంధము కల్గియున్నవి. ఇంతెందుకు మరుగునపడ్డ అన్నమయ్య పదాలను సేకరించి కూర్చుటకు రాళ్ళపల్లి వారికి సంగీత, సాహిత్యాలు తెలిసియుండుట వలననే సాధ్యమైంది గదా! సంగీతానికి ఎంత విచారములో ఉన్న మనస్సునైనను రంజింపజేయు గుణమున్నది. అందుకే సంగీతము అంటే ఇష్టపడని వారుండరు.

**3. నృత్యము :-** లలిత కళలలో నృత్యానిది మూడవ స్థానము ఈ కళను సమాహార కళ అని కూడా అంటారు. ఇది సర్వ మానవాళికి విజ్ఞానం, వినోదం, ఆనందాలను కల్గించును. శరీరావయవములను కదిలించుచూ, పాడుచున్న గీతములోని

భావమునకు అనుగుణముగా ముఖము, కళ్లు, చేతులు, కాళ్ళు మొదలగు అవయవములు, ఉపయోగించి ప్రదర్శించునది నృత్యము.

ఒక కథను అభినయించుట నృత్యము. దీనికి నాట్యశాస్త్రము, సంగీత శాస్త్రము, సాహిత్యము మొదలగువాని అండదండలు అవసరము. అందుకే దీనిని సమాహార కళ అంటారు. నృత్యమునకు గజ్జెలు, వేషము, రంగుదుస్తులు కూడా అవసరం. నృత్యము మనోల్లాసము కలిగించును. నృత్యములో సాహిత్య, సంగీతాలు ఇమిడి యుండును. నర్తకి తాను నర్తించవలెనన్న ఒక సన్నివేశము కావలెను. ఆ సన్నివేశానికి తగిన గీతము కావలెను. ఆ గీతానికి తగిన సంగీతము కావలెను. ఈ రెండూ లేనిచో నృత్యకళ రాణించదు. కాబట్టి ఇది కూడా సాహిత్యంపై లేదా కవిత్వంపై ఆధారపడిన కళగానే చెప్పవచ్చును.

**4. చిత్రలేఖనము :-** లలిత కళలలో చిత్రలేఖనమునది నాల్గవ స్థానము. చిత్రకారుడు సుందరమైన ప్రకృతి దృశ్యములను వివిధ మానసికావస్థలలోని స్త్రీ, పురుషుల చిత్రములను, వారి వారి చక్కని సన్నివేశములను, విచిత్రమైన జంతువులు, పక్షులు మొదలగువాటిని అతని భావానికి అనుగుణంగా అందంగా చిత్రించును. రంగులు, కుంచె, కాగితము, కుడ్యము మొదలగు వానిని ఉపయోగించి చిత్రకారుడు ఈ కళను ప్రదర్శించును.

ఈ కళ మొహంజొదారో, హరప్పా, నాగరికతల కాలము నుండి అంటే సుమారు ఐదువేల సంవత్సరములకు పైబడి మానవజాతి యందున్నదని, చరిత్రకారుల వలన తెలుస్తున్నది. పాశ్చాత్య దేశములలో మైకేలేంజిలో, లియోనార్డో డావిన్సీ మొదలగు ప్రసిద్ధిగాంచిన చిత్రకారులు జన్మించిరి. మన దేశంలో రవివర్మ, దామెర్ల రామారావు, మొదలగువారు గొప్ప చిత్రకారులుగా ప్రఖ్యాతినందిరి. వివిధ రకముల చిత్రములు నయనానందం కలుగజేసి, ఆకర్షింపజేయును.

మొదట ఈ కళ స్వతంత్రంగానే ఉన్నది. మధ్య యుగంలో మాత్రం ఈ కళ కవిత్వంపై ఆధారపడిందని చెప్పాలి. కవి రచించిన కవితలను, కవి భావాల కనుగుణంగా చిత్రకారులు చిత్రములను చిత్రించేవారు. కొన్ని కవితలు చిత్రకారుని హృదయాన్ని స్పందింపజేసి వివిధ చిత్రములు గీయుటకు ప్రేరణను కల్గించేవిగా కూడా ఉంటాయి. ఆధునికయుగంలో అడవిబాపిరాజు, అలిసెట్టి ప్రభాకర్, శీలావీర్రాజు వంటివారు చిత్రలేఖన, కవిత్వ కళను రెండింటినీ మిళితం చేసుకొని తమ భావాలను వెలువరించినారు. ఆధునిక యుగంలో ఈ చిత్రకళ కవిత్వంలో భావ చిత్రాల రూపంలో కన్పిస్తుంది.

5. విగ్రహ శిల్పము :- లలిత కళలలో విగ్రహశిల్పానిది ఐదవస్థానము దీనిని ప్రదర్శించుటకు పాలరాయి, నల్లరాయి మొదలగు పాషాణఫలకములు అవసరము. చిత్రలేఖనము నందు వలెనే మానవులు,జంతువులు, పక్షులు మొదలగు జీవరాశి, ప్రకృతి దృశ్యములను శిల్పకారుడు రాయి మొదలగు వస్తువులు ఉపయోగించి చెక్కుటే శిల్పము అంటారు. ఇది మిక్కిలి ఆకర్షణీయమైన కళ. మన దేశమున ముఖ్యముగా దేవాలయములందు, మంటపములందు, గోపురములందు, కొండగుహలందు శిల్పకళా విన్యాసము గోచరించును. శైవ, వైష్ణవ, బౌద్ధ, జైనమతములకు సంబంధించిన అనేక శిల్పములను రాజులు,చక్రవర్తులు, మంత్రులు మొదలగు వారుచెక్కించి విశిష్ట శిల్పసంపదను మనకు అందజేశారు. వారు ఎక్కువగా మతప్రచారము కొరకు వెలయించిన శిల్పాలు వేల సంవత్సరాల పాటు శాశ్వతంగా ఉన్నాయి. కొన్ని శిథిలం కాగా కొన్నినేటికినీ నిలిచియున్నవి. ఆశ్చర్య జనకములగు శిల్పములు మానవునికి ఆనందమును కలిగిస్తాయి.

ఈ విధముగా కవిత్వము, సంగీతము, నృత్యము, చిత్రలేఖనము, విగ్రహశిల్పము అను లలిత కళలు లోకాతీతలమైనానందమును కలిగించి మానవులకు మనోల్లాసముకలిగిస్తాయి. అయితే సంగీతము వినినంత సేపు మాత్రమే నృత్యము, చిత్రలేఖనము, విగ్రహశిల్పము కూడా చూసినంతసేపు మాత్రమే, కాని కవిత్వము చదివిన తరువాత కూడా దాని యొక్క ఆనందానుభూతి కొనసాగుతూనే ఉంటుంది. అందుకే శాశ్వతత్వమునుబట్టి, అలాగే అన్ని కళలకు ఆధారభూతమైనది కాబట్టి లలిత కళలలో కవిత్వమునకే అగ్రస్థానము.

లలిత కళలైన ఈ ఐదు కళలు ఒక వైపున శాస్త్రములుగా, మరియొక వైపున లలిత కళలుగా ప్రకటితమవుతున్నాయి. ఈవిధముగా కళకు శాస్త్రము యొక్క ఆధారములేనిచో క్రమముండదు. లలిత కళలు ఎల్లప్పుడూ మనకు పరమానందమొసగునని తెలుసుకొంటిమి. కావున ఈ లలిత కళలు ఇంకా అభివృద్ధి చెందుటకు ప్రతి ఒక్కరు ముఖ్యంగా నేటి యువత కృషి సల్పవలెను. లలిత కళలు ఇంకా వృద్ధి చెందినచో మానవ నాగరికత సంస్కారములు శత విధముల పురోగమించి, మానవుని యందు చెడుగుణములను తొలగించి వారిని దేశములో ఉన్నత సంస్కారవంతులుగా తయారు చేయును. ఈ విధంగా ఆనందాన్ని పంచుతున్న లలిత కళలు నేడు సాహిత్యంలో ఒక భాగంగా ఇమిడిపోయి ఒకే కళగా భాసిస్తూ నేడు సాహిత్యాన్ని అభివృద్ధి పథమువైపు తీసుకు వెళ్ళుచున్నవి.

ఇం. నెం. 3-5-112,ఇందిరానగర్, రామంతపూర్, హైదరాబాదు - 13.

# గురజాడ

పాలపర్తి సుజాత
ఎం.ఏ. ప్రథమ, పి.జి. కళాశాల,

ఆంధ్రులకు తెల్పెను నవ కవిత్వ జాడ
ఆలపించెను అభ్యుదయ కవిత్వాన్ని గుఅజాడ
కోరినాడు జాతి శ్రేయస్సును
పొందినాడు ప్రజల ఆశీస్సును
ప్రాచీన భారతీయ సంస్కృతిని
ఆధునిక నాగరికతా సంస్కారాన్ని
మేళవించినాడు రెండింటిని
మేల్కొలిపినాడు జీవకోటిని
క్రొత్తపాతల మేలు కలయికతో
నవ్య నూతన కాంతులతో
కూర్చినాడు ముత్యాల దండలు
పొందినాడు ప్రజల అండదండలు
ముత్యాలు హారాలు ధరించిన శరీరానికి శోభాకరము
ముత్యాలసరాలు చదివిన మనసుకు ఆహ్లాదకరము
నవ్య కవిత్వమునందించిన నవయుగకవి
ఆధునిక కవిత్వమునందించిన అభ్యుదయ కవి
నీకిదే మా అక్షర నివాళి.......

ఇం. నెం. 1-169,బిసైడ్ శివా థియేటర్, భవానీ నగర్, మల్కాజ్‌గిరి.

# ముత్యాల సరాలు - మేలి భావాలు

వి.ఎ. సత్యనారాయణ,
ఎం.ఏ. ప్రథమ, ఆర్ట్స్ కళాశాల.

అది ఛందస్సుల చట్రంలో సాహిత్యం అసమంజసంగా బంధించబడి బాధింపబడుతున్న కాలం. ప్రసవ వేదన పడుతున్న జన సాహిత్యం చీకటిలో మగ్గిపోతూ దీనాలాపన చేస్తున్న సమయం. సంస్కృత, గ్రాంధిక భాషా పాదాల చెంత వ్యావహారిక భాష కూలబడి ఉన్న సమయం. ఆ సమయంలో చదువుకొనే పలుకుబడి గల కొంత మందిదే సాహిత్య ఏలుబడి. అందువల్లే జన సాహిత్యం చీకటిలో మగ్గిపోయే పరిస్థితి దాపురించింది. అయితే చీకటెప్పుడూ కాపురముండదు. చీకటి విరుచుకు పడినప్పుడు వెలుగు ఎలాగైతే తుడుచుకుపోతుందో, వెలుగు పొడుచుకు వచ్చినపుడు చీకటి అలాగే ముడుచుకుపోతుంది. ఇలా వెలుగు పొడుచుకు రావడాన్ని తూరుపు తెలతెలవారడం అంటే బాగుంటుందేమో. నాటి జనసాహిత్యం కూడ ఇలా తెలతెలవారబోతుందనే విషయాన్ని మరింత స్పష్టంగా చెప్పడానికి

"వెలుగు నీటను గ్రుంకె చుక్కలు
చదల చీకటి కదలబారెను
యెక్కడనొ వొక చెట్టు మాటున
నొక్క కోకిల పలుకసాగెను" అని చెప్పారేమో

ఇది గురజాడ వారి "ముత్యాలసరములు"లో ఆయన ప్రకృతిని వర్ణించిన విషయమే కావచ్చు. కాని అంతకంటే కూడ జనసాహితీ ప్రియపుత్రుడైన గురజాడ తన మేలుకొలుపుల గీతికలను ఆలపించిన శుభసమయమని కూడ భావించవచ్చు. ఇంతకీ ఆ కోకిల ఏమని పలికిందీ అంటే

"గుత్తునా ముత్యాల సరములు
కూర్చుకొని తేటైన మాటల
కొత్త పాతల మేలు కలయిక
క్రొమ్మెరుంగులు జిమ్మగా" అని ఇంతకీ ఎవరీ గురజాడ?

అతన్నెందుకు 'యుగకవి' అనీ, 'యుగకర్త' అనీ 'వ్యావహారిక భాషా ప్రియ పుత్రుడు' అంటున్నారో, అనుకుంటున్నారో చర్చించడం ఈ వ్యాసం ముఖ్యోద్దేశ్యం కాదు.

అయినప్పటికీ గురజాడ వ్యావహారిక భాషకు కావ్య గౌరవం కలిగించిన మహానుభావుడు అని చెప్పడానికి ఎవరికీ అభ్యంతరముండదు. అయితే మనం ఆ విషయాన్ని చర్చించే ముందు గురజాడ జీవితాన్ని ఒకసారి పరిశీలిద్దాం.

### గురజాడ:

గురజాడగా మనకందరకు సుపరిచితులైన శ్రీ గురజాడ అప్పారావు గారు 1862వ సంవత్సరం సెప్టెంబరు 21వ తేదీన అంటే దుందుభి నామ సంవత్సరం, భాద్రపద బహుళ త్రయోదశి ఆదివారం నాడు విశాఖపట్నం జిల్లా యలమంచిలి తాలూకా యస్. రాయవరం (సర్వసిద్ధి రాయవరం) గ్రామంలో తాతీగారైన శ్రీ గొడవర్తి కృష్ణయ్య గారింట్లో జన్మించారు. గురజాడ తండ్రి గారి పేరు వెంకటరామదాసు, తల్లి కౌసల్యమ్మ. గురజాడకు ఒక సోదరి, ఒక సోదరుడు (శ్యామలరావు) తర్వాత జన్మించారు.

### గురజాడ రచనలు:

గురజాడ CUCKOO (1882), SARANGADHARA (1883) అనే ఆంగ్ల కవితలు, విక్టోరియా రాణి ప్రశంసా పద్యాలు (1887), సత్యవతి శతకం (1892-94), కన్యాశుల్కం నాటకం మొదటి కూర్పు (1897), రెండవ కూర్పు (1909), నీలగిరి పాటలు (1907), కొండు భట్టీయం (1900), బిల్హణీయం (1910, 11) లలో 'ఆంధ్ర పత్రిక'లో కేవలం రెండు అంశాలు మాత్రమే ప్రచురించబడింది. తెలుగులో మొదటి కథానిక అనతగ్గ 'దిద్దుబాటు' (1910 'ఆంధ్రభారతి' మాసపత్రికలో అచ్చయింది)తో బాటు, 'మీ పేరేమిటి?', 'మెడిల్లా', 'పెద్దమశీదు', 'సంస్కర్త హృదయం' వంటి అనర్ఘరత్నాలైన కథలను రచించారు. ఇక మన వ్యాస పరిశీలనమైన "ముత్యాల సరములు" (1910)లో 'ఆంధ్రభారతి'లో ప్రచురింపబడింది.

### ముత్యాల సరములు:

నన్నయ నాటి నుండి తెలుగు కవిత చంపూరీతిలో గతానుగతికంగా 900 సంవత్సరములు సాగింది. 20వ శతాబ్దంలో ప్రజలను సాహిత్యానికి మరింత చేరువ చేయడానికి, వారిని సాహిత్యంలో భాగస్వాముల్ని చేయడానికి గురజాడ గానయోగ్యమైన ఛందస్సును సృష్టించుకొనే ప్రయత్నం చేశారు. పారసీ భాషలో ఒక గజల్ ఆధారంగా, కన్నడంలో భామినీ షట్పది ప్రేరణతో, తెలుగులో వృషభగతిరగడ సహాయంతో "గుమ్మడేడే గోపితల్లీ" లాంటి జానపద గేయాల రీతిలో "ముత్యాల సరం" అనే కొత్త ఛందస్సును

సృష్టించారు. దీనిలో మొదటి మూడు చరణములలోను సామాన్యంగా పదునాలుగేసి మాత్రలుండును. నాలుగవ చరణమున ఏడు మొదలు పదునాలుగు వరకూ ఉండును. విరామము అర్థానుసారముగా చెవికింపగునట్లు మార్చ యత్నం జరిగింది.

1910 జూలై ఆంధ్రభారతి సంచికలో 'ముత్యాల సరములు' లేక 'తోకచుక్క' మొట్టమొదట అచ్చయ్యింది. ఇది అప్పారావుగారి అద్భుత సృష్టిగా భావించవచ్చు. భాష పండిత వర్గాల దగ్గర నుండి సామాన్య ప్రజల దగ్గరకు వెళ్ళింది. రుచీ, పచీ లేని తెలుగు పద్యం గేయంగా కొత్త అవతారమెత్తి నవనవోన్మేషమూ, పరిమళవంతమైన నూతనత్వాన్ని తెలుగు కవిత్వానికి సంతరించిపెట్టాయి. ఈ విధంగా గురజాడ కవితావైతాళికుడయ్యాడు. గురజాడ వారందించిన ఈ రసగీతాలను రాయప్రోలు వారందుకున్నారు.

ఇప్పుడు మనం ముత్యాలసరాలలోని ఒక్కొక్క ఖండికను గూర్చి చర్చిద్దాం.

## ముత్యాల సరములు లేక తోకచుక్క:

గురజాడ వారు కొత్త పాతల మేలు కలయిక క్రొమ్మెరుంగులు జిమ్మగా తేటైన మాటలతో 'ముత్యాల సరములు'' అనే ఛందస్సును సృష్టించానని చెప్పుకుంటూ 'ముత్యాల సరములు'ను వ్యతిరేకించే గ్రాంథిక భాషావాదులను గూర్చి

"మెచ్చనంటావీవు; నీవిక
మెచ్చుకుంటే మించిపాయెను;
కొయ్యబొమ్మలె మెచ్చుకళ్ళకు
కోమలుల సౌరెక్కునా?'' అని చెప్పారు.

ఈ ఖండికలోని నాయకుడు మూఢనమ్మకాలను, సాంఘిక దురాచారాలను ఖండించే ఒక సంస్కర్త. ఇతడు 'తోకచుక్క' కనిపించడం భూమికి అరిష్టమనే విషయాన్ని ఖండిస్తూ తన భావాల్ని వెల్లడిస్తాడు. ఇతడు పట్నంలో పని గురించి పది రోజులు ఉండవలసి వచ్చింది. ఆ సమయంలో అతడు అనేకమంది సంఘ సంస్కరణ ప్రవీణుల సాంగత్యం సంపాదించినాడు. తర్వాత ఇంటికి తిరిగి వచ్చి తన భార్యతో తోకచుక్కను గూర్చిన అపోహలను తొలగించడానికి ప్రయత్నిస్తూ తోకచుక్క భూమికి 'దూరపు బంధు' వని, డెబ్భై, ఎనభై ఏళ్ళకొకసారి కనిపిస్తాదని చెపుతాడు. వెఱ్ఱి పురాణ గాథలు కవుల కల్పనని అటువంటివి పండితులు నమ్మకూడదని కూడ అంటాడు. విశ్వమానవ సౌభ్రాతృత్వం గురించి సందేశంగా సంభాషిస్తూ

"యెల్లలోకము లొక్క యిల్లై
వర్ణ భేదము లెల్ల కల్లై
వేల నెరుగని ప్రేమబంధము
వేడుకలు కురియ"
"మతములన్నియు మాసిపోవును,
జ్ఞాన మొక్కటె నిలిచి వెలుగును;
అంత స్వర్గ సుఖంబులన్నవి
యవని విలసిల్లున్

లోకాన్నే ఇల్లుగా మానవులంతా సోదరులుగా మెలిగితే వాడవాడలా వేడుకలతో విలసిల్లుతుందని గురజాడ భావించారు. మతాన్ని, గతాన్ని నిరసించి శాశ్వతంగా వెలిగే జ్ఞానాన్ని ఆయన గుర్తించారు.

**దేశభక్తి:**

"గురజాడ రచనలన్నీ నష్టమైపోయి ఒక్క 'దేశభక్తి' గీతం మిగిలినా చాలును. అతడు ప్రపంచ కవులలో ఒకడుగా లెక్కించదగిన మహాకవి అని రుజువు కావడానికి" అని శ్రీశ్రీ పేర్కొంటూ 'దేశభక్తి' గీతం సమస్త మానవుల జాతీయగీతంగా భావించాడు.

"యీసురోమని మనుషులుంటే దేశమేగతి బాగుపడునోయ్?" అని ప్రశ్నించి 'పాడి పంటలు పొంగి పార్లే దారిలో నువు పాటుపడవోయ్' అని ప్రబోధించాడు. ఇంకా

"వెనక చూసిన కార్యమేమోయ్?
మంచి గతమున కొంచెమేనోయ్
మందగించక ముందు అడుగేయి
వెనకపడితే వెనకేనోయ్" అన్నాడు. ఇంకా
"స్వంత లాభం కొంత మానుకు
పొరుగు వాడికి తోడుపడవోయ్
దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్"

అని నినదించాడు. దేశ ప్రజలంతా ఐకమత్యంతో చెట్టాపట్టాలేసుకొని నడవాలని అన్ని జాతులు, మతములు అన్నదమ్ముల వలె కలసి జీవించాలని మతాలు వేరైనా పరవాలేదని మతములొకటైతే చాలని చెప్పాడు.

'దేశమనియెడి దొడ్డ వృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయి;
నరుల చమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయి'
ఆకులందున అణగిమణగీ
కవిత కోకిల పలకవలెనోయ్;
పలుకులను విని దేశమందభి
మానములు మొలకెత్తవలెనోయ్''అని

జాతీయాభిమానం ప్రదర్శించాడు. అందుకే శ్రీశ్రీ దాన్ని "సార్వకాలికమూ, సార్వలౌకికమూ అయిన సందేశాన్నిచ్చే రచన యిది'' అన్నాడు.

కాసులు:

ధనములు రెండు తెరగులు
ఒకటి మట్టిని పుట్టినది;
వేరొకటి హృత్కమలంపు సౌరభ'' మని అన్నాడు.

ఈ హృదయ కమలపు సుగంధానికే గురజాడ ప్రేమ అనే పేరు పెట్టాడు. ఎంతటి అందం గల మగువకైనా 'ప్రేమ' అనే పరిమళం ఉండాలన్నాడు. కల్లాకపటం లేని స్నేహభావమే ప్రేమ. అది ఆడవారికైనా మగవారికైనా ఒకటేనని చెప్పాడు. ఒకరికి ప్రేమ ఇస్తే తిరిగి మనం దానిని పొందవచ్చును. ప్రేమను నిలిపితే ప్రేమనిలుస్తుంది అని చెపుతూ

"మగడు వేల్పన పాత మాటది
ప్రాణ మిత్రుడనీకు" అంటూ స్త్రీ పురుష సమానత్వాన్ని చాటాడు.

డామన్ పితియస్:

గ్రీక్ సాహిత్యం నుండి డామన్ పితియస్‌లనే స్నేహితుల కథను తీసుకొని వారి మైత్రీ బంధాన్ని వర్ణించిన కవిత ఇది. డామనునకు రాజు ఉరిశిక్ష వేసినప్పుడు డామనుడు చెక్కు చెదరక

"నిక్కమే కద చావు నరునకు
యెక్కడెప్పుడు యెటుల గూడిన
నొక్కటే కాదా" అని అంటాడు. నెల రోజులలో

ఇంటికెళ్లి తిరిగి రావడానికి డామనుడు అనుమతి కోరువాడు. ఆ నెల రోజులు డామనుడి స్థానంలో పితియస్ ఉంటాడు. దీనికి రాజు అంగీకరిస్తాడు. అయితే ఉరి తీయవలసిన వేళకు డామనుడు రాడు. అపుడు పితియస్ భార్య

"....... పతి తన
చావునెంచక బలగమెంచక
తనువు మిత్రున కోడుటన్నది
తగవ? యది చెపుడా" అంటూ

మిత్రుని కోసం ప్రాణ త్యాగం చేయడం విశేషమే అయినా ఆ త్యాగం చేసే వ్యక్తి తన భార్యను గురించి ఆలోచించక పోవడం ఆమె ప్రశ్నించింది.

"పండగలదని కాయ కుడుతురె?
తిండి యెల్లిది నేడు తిందురె?
అండమందున చిలుక కలదని
అరచి జీరెదరే?" అంటూ

ఎప్పుడో ఒకప్పుడు చావవలసిందే కదా అని అర్థాంతరంగా చావును ఆహ్వానించడాన్ని ప్రశ్నించింది. చివరకు రాజు డామనుని, పితియస్‌ల త్యాగాన్ని పరిశీలించాక

"పలికె నరపతి మిత్రభావము
సలుపుడిక నీ సఖుడు నీవును!
అలఘు రాజ్యము ప్రేమ సంపద
కలతియని దలతున్". అని ఇంకా

"వినగ తగినది వింటినిచ్చట
కనగ తగినది కాంచినాడను
—మనుజులిద్దరు మగువయొక్కతె
మాన్యులీ జగతిన్" అంటూ

డామనుడు, పితియస్‌ల త్యాగాన్నీ, పితియస్ భార్య వివేకాన్నీ ప్రశంసిస్తాడు.

**లవణరాజు కల:**

జ్ఞానవాశిష్టంలోని లవణోపాఖ్యాన్ని తీసుకొని సమకాలీనావసరాలకు అనుగుణంగా గురజాడ దీనిని రచించాడు. లవణరాజు ఆత్మావలోకం నుంచి గురజాడ అమృత సూక్తులు వెలువరించాడు.

"మలిన దేహాల మాలలనుచును
మలిన చిత్తుల కథిక కులముల
నెలవొసంగిన వర్ణధర్మమ
ధర్మ ధర్మంబే,
మంచి చెడ్డలు మనుజులందున
యెంచి చూడగ, రెండె కులములు
మంచియన్నది, మాలయైతే
మాలనే, యగుదున్"

అని తన సంఘ సంస్కరణ ప్రియత్వాన్ని చాటాడు. అంతే గాక మాల కన్య తండ్రి చేత

"మాన్పవశమే, మాటకోతలు?
కత్తి చంపును; మాటవాతలు
మానవేనాడున్" అంటూ

మనుష్యుల్లో మానసికంగా హింసిచే వారికి నిజంగా వాతలే పెట్టాడు.

**కన్యక:**

ఈ గేయంలో పురుష దురహంకారాన్ని నిరసించి, మహిళల సానుభూతికి పాత్రులయ్యారు. దీనిలో గురజాడ చిత్రించిన గ్రామీణ జీవనం తర్వాత భావకవులకు అనుసరణీయమైంది

"పసిడి కడవల పాలు పెరుగులు
పళ్ళెరమ్ముల పళ్ళు పువ్వులు
మోములందున మ్యోలక నవ్వులు"

ఎంత స్వచ్ఛమైన చిత్రమిది. ఇలాంటి సరళమైన మంచి భావాలను కలిగించడం గురజాడ సొత్తు. రాజు కన్యకను చెరపట్టాలనుకోవడం, కామాతురుడైన రాజు చేతిలో మైలపడకుండా కన్యక మరణమే కోరుకోవడం, ఆత్మాహుతికి ముందు కన్యక

'పట్టమేలే రాజు అయితే
రాజునేలే దైవముండడో" అంటూ రాజును తూలనాడింది.
"విద్య నేర్చిన వాడు విప్రుడు
వీర్యముండిన వాడు క్షత్రియు"డంటూ

దొంగలా పట్టపగలే

నడి వీధిలో తనను పట్టబోయే రాజు అఘాయిత్యాన్ని ప్రశ్నిస్తూ

"పట్టమేలే రాజులైతే
పట్టునన్నిపు"డనుచు కన్యక
చుట్టు ముట్టిన మంటలోనికి
మట్టి తాజనియెన్" ప్రాణ త్యాగం చేస్తుంది కన్యక.
"పట్టమేలే రాజు పోయెను
మట్టి కలిసెను కోటపేటలు
పదం పద్యం పట్టి నిలిచెను
కీర్తులపకీర్తుల్" కన్యక త్యాగం,

రాజు గర్వం ఏ విధంగా పదం పద్యం పట్టి నిలిచాయో స్పష్టంగా వివరించాడు బహుశా దీనినుంచి స్ఫూర్తి పొందే జాషువా

"రాజు మరణించె ఒక తార రాలిపోయె
సుకవి మరణించె ఒక తార గగనమెగసె
రాజు జీవించె రాతి విగ్రహములందు
సుకవి జీవించె ప్రజల నాలుకల యందు" అని

కీర్తి, అపకీర్తులను వర్ణించి ఉంటాడు.

మనిషి:

వ్యక్తి స్వేచ్ఛను బలపరిచి, శాస్త్రీయ దృష్టిని పెంపొందించి మానవతావాదానికి పెద్ద పీట వేసిన గేయం 'మనిషి'. మనిషి చేసిన రాయి రప్పలకు మొక్కుతూ కనిపించని

దవుని గురించి కొండకోనల్లో వెతుకులాడడాన్ని గురజాడ ప్రశ్నించాడు. కన్ను తెరిచిన కానబడడో/ మనిషి మాత్రుడియందు లేడో?/ అంటూ మానవసేవే మాధవసేవ అని పేర్కొన్నాడు.

## పూర్ణమ్మ :

కన్యాశుల్క వివాహ వ్యవస్థకు బలైపోయిన స్త్రీ గాథ పూర్ణమ్మ. ఇది ముత్యాల సరాలలో అనర్ఘ రత్నం. దీనిలో గుండెలు పిండే కరుణ రసం కథలో నిండుగా ప్రవహించింది.

"మేలిమి బంగరు మెలతల్లారా
కలువల కన్నుల కన్నెల్లారా
తల్లుల గన్న పిల్లల్లారా
విన్నారమ్మా యీకథను అంటూ

కథ ప్రారంభిస్తాడు. కాసుకు దాసుడైన పూజారి తన కూతురు పూర్ణమ్మను కాటికి కాళ్ళు సాచిన ముసలివానికిచ్చి పెళ్ళి చేస్తాడు. పూర్ణమ్మను కాపురానికి తీసుకుపోవడానికి ముసలి మొగుడు వస్తాడు. స్నేహితురాండ్రు అతడ్ని చూసి "మొగుడు తాత" అంటూ పూర్ణమ్మను హేళన చేసినప్పుడు పూర్ణమ్మ కనుగుడ్లలో నీరు నింపుకొని దుర్గ గుడికి వెళ్ళి దుఃఖిస్తుంది. అత్తారింటికి వెళ్ళే ముందర పూర్ణమకు వదినెలు ఎన్నో అలంకారాలు చేస్తారు.

తర్వాత పూర్ణమ్మ: పెద్దలకప్పుడు మొక్కెను పూర్ణమ్మ / తల్లీదండ్రీ దీవించ్రీ;/ దీవన వింటూ పకపక నవ్వెను/ ముసలి మొగుడితో దీర్ఘ సుమంగళిగా బ్రతకడం అసంభవమని పూర్ణమ నవ్వింది. బహుశా అది ఒక నిర్వేదమైన భావంతో నవ్విన నవ్వు కావచ్చు. చివరకు తల్లిదండ్రులను, దుర్గాదేవిని జాగ్రత్తగా చూడమని అన్నలకు తమ్ములకు చెప్పి "నలుగురు కూచుని నవ్వేవేళల/నా పేరొకతరి తలవండి/ అని కోరుకొని ఆ సాయంత్రం దుర్గను కొలవడానికి ఒంటరిగా వెళ్తుంది. రాత్రయిపోయినా పూర్ణమ ఇంటికి రాలేదు

"కన్నుల కాంతులు కలువల చేరెను
మేలిమి జేరెను మేని పసల్!
హంసల చేరెను నడకల బెడగులు

దుర్గను జేరెను పూర్ణమ్మ" ఎక్కడా పూర్ణమ్మ రూపవర్ణన చేయని కవి, చివరలో ఆమె సౌందర్యం, లావణ్యం, వర్చస్సును కొత్త ఫక్కిలో వర్ణించాడు. కలువరేకుల వంటి కళ్ళు, హంస నడకల వంటి నడకలు అని స్త్రీలను వర్ణించడం సంప్రదాయం. ఈ పాతకవిసమయాలను తీసుకొని నూతనాభివ్యక్తితో కలువ రేకుల వంటి కళ్ళు అనకుండా కలువ రేకుల కాంతి వంటి ఆమె కండ్ల కాంతి తిరిగి కలువ దగ్గరికే వెళ్ళిపోయింది అంటూ విషాదవాతావరణాన్ని సృష్టించాడు. అయితే కవి దృష్టిలో పూర్ణమ్మ చిరంజీవి. 'దుర్గను జేరెను పూర్ణమ్మ' అన్నాడే గాని మరణించినట్లు చెప్పలేదు. ఏమైనా పూర్ణమ్మ ఒక అనర్ఘ రత్నం. అందుకే శ్రీశ్రీ "ఒక మహాకావ్యాన్ని చదివిన అనుభూతి పూర్ణమ్మ కథ చదివాక మనకు మిగులుతుంది" అని పేర్కొన్నాడు.

మొత్తం మీద గురజాడ వారు ముత్యాల సరములలో విశ్వమానవ సౌభ్రాతృత్వం కోసం, సంఘ సంస్కరణ ప్రయత్నం కోసం పాటు పడిన వైతాళికుడిగా మానవతావాదాన్ని, ప్రేమ తత్వాన్ని బోధించిన యుగకర్తగా, దేశభక్తిని, జాతీయ దృక్పథాన్ని కలిగించిన జాతీయవాదిగా మనకు కనిపిస్తారు.

# తెలుగు కవిత్రయం

డి. స్వరూప రాణి,
ఎం.ఏ. ప్రథమ, పి.జి. కళాశాల

ప్రసన్నమైన కథనీదయ్యా నన్నయ్యా
నాటకీయత నీదేనయ్యా తిక్కయ్యా
ప్రబంధ మార్గం చూపితివయ్యా ఎర్రయ్యా
తెలుగు కవిత్రయంగా నిలిచిన వారు మీరేనయ్యా!

చిందర వందర పదజాలాన్ని సంస్కరించితివయ్యా
తెలుగుకు చక్కని రూపు రేఖలు దిద్దితివయ్యా
తెలుగు వారికి మహాభారతాన్నందించితివయ్యా
రెండున్నర పర్వాలు రచించిన ఆదికవి నీవయ్యా! నన్నయ్యా!

రచనార్హత పొందుటకై యాగం చేసిన సోమయాజివయ్యా
తెలుగు తన ముట్టిపడునట్లు రచన సాగించిన కీర్తినీదయ్యా
మత కలహాల మాన్ప హరిహరనాథుని సృష్టించితివయ్యా
పదిహేను పర్వంబుల రచియించిన వాణీ పుత్రుడవయ్యా - తిక్కయ్యా!

గురువగు శంకర స్వామిని ఎల్లవేళలా ధ్యానించితివయ్యా!
తెలుగువారికి సంపూర్ణ పంచమవేదాన్నందించ పూనితివయ్యా!
బహురూపవర్ణితైన శైలుల ప్రదర్శించగల విధాతృడవయ్యా!
అరణ్య పర్వ రచనచే అందరి మన్నన లందిన ఘనుడవయ్యా -
ఎర్రయ్యా!

తెలుగువారికి భారత కావ్యాన్నందించిన ఘనులు మీరయ్యా!
సాహితీ సామ్రాజ్యంలో చిరస్మరణీయులు మీరేనయ్యా!
తెలుగు తల్లి గౌరవాన్ని పెంచిన పుత్ర రత్నములు మీరయ్యా!
ఆమె ముద్దుబిడ్డలై ఆచంద్రార్కం వెలుగొందువారు మీరేనయ్యా

---

ఇం. నెం. 9-2-416, రెజిమెంటల్ బజార్, సికింద్రాబాద్ - 25

# అభ్యుదయ కవిగా జాషువా

వేదాంతం విజయలక్ష్మి,

ఎం.ఏ. ద్వితీయ, ఆర్ట్స్ కళాశాల

20వ శతాబ్దపు 3వ దశకంలోనే అభ్యుదయ కవిత్వానికి బీజవాపన జరిగింది. తెలుగులో తొలి ఆధునిక మహకవిగా పేరుగాంచిన గురజాడయే ఈ ఒరవడికి ఆద్యుడని విమర్శకుల అభిప్రాయం ఆనాటి సాంఘిక దురాచాలను చీల్చి చెండాడిన లక్షణం ఈయన అన్ని రచనలలోనూ మనం చూడవచ్చు. కళ కళ కోసం కాక సాహిత్యం ప్రజల కొరకే అను లక్ష్యమును బలపరచి తమ రచనల ద్వారా ప్రజలలో చైతన్యాన్ని కలిగించారు. దీనిని అభ్యుదయం అనడానికి ఎవరికీ ఏ అభ్యంతరం ఉండకపోతే ఆయన పేరుతోనే ఈ యుగాన్ని పేర్కొనేవారు కాదు. ఇదే సమయంలో గిడుగు వ్యవహార భాషోద్యమం, కొమర్రాజు చారిత్రక దృష్టితో కూడిన విజ్ఞాన సర్వస్వం. కందుకూరి సాంఘిక దురాచారాల నిరసన ద్వారా తమ అభ్యుదయ భావాలను స్పష్టంగా నిరూపించుకున్నారు. ఇక ఈ కాలంలో అభ్యుదయ కవిగా ప్రముఖ విమర్శకులంతా విస్మరించిన కవి జాషువా. శ్రామిక వర్గం యొక్క భౌతిక శ్రేయస్సును కోరునది అభ్యుదయ కవిత్వమని విమర్శకులు నిర్వచనం ఇచ్చినా జాషువా దృష్టిలో అభ్యుదయ భావాలు విభిన్న కోణాలలో కనిపిస్తాయి. పాశ్చాత్య విజ్ఞానం, నాగరికతా, నానాజాతిసమ్మేళనం వసుధైకకుటుంబం కావాలనుకునే నవీనభావ ప్రపంచమంతా జాషువా కవిత్వంలో కనిపిస్తుంది ఇదే జాషువా దృష్టిలో అభ్యుదయం.

గుఱ్ఱం జాషువా వీరయ్య, లింగమాంబ దంపతులకు 1895 సెప్టెంబరు 28న వినుకొండలో జన్మించినారు. అస్పృశ్యతా, దారిద్ర్యం అనే వడగాల్పులను ఎదుర్కొంటూనే సాహితీక్షేత్రంలో వెన్నెలను కురిపించారు. ఆధునిక కవిత్వంలోని సాంప్రదాయ కవిత్వం, భావ కవిత్వం, అభ్యుదయ కవిత్వం అనే మూడు ప్రధాన శాఖల మీద జాషువా తన ప్రభావాన్ని ప్రసరించారు జాషువా కవిత్వంలోని ఛందస్సు, భాష సాంప్రదాయ కవిత్వంలోనివి. వస్తువు అభ్యుదయ కవిత్వానిది, భావ కవిత్వంలో ప్రణయ కవితా విభాగం తప్ప దేశభక్తి, ప్రకృతి, స్మృతి, సంఘ సంస్కరణలు జాషువా ఖండకావ్యాల్లో మనకు గోచరిస్తాయి. మానవతావాదం, జాతీయాభిమానం, సమకాలీనజీవనసమస్యలు జాషువా రచనలలోని ఇతివృత్తాలు, సాంప్రదాయ స్పర్శ, ఆధునిక భావ ధోరణి ఈయన రచనల్లో మనోహరంగా మేళవించాయి. వ్యవస్థలోని లోపాలను సున్నితంగా విమర్శిస్తూ సమస్యా పరిష్కారాన్ని సూచించే ధోరణిలో రచనలు చేసిన జాషువా కవికోకిల,

కవితావిశారద, నవయుగకవిచక్రవర్తి మధురశ్రీనాథ, కవిదిగ్గజ వంటి బిరుదులూ, కనకాభిషేక, గండపెండేర సత్కారాలు పొందారు. భారత ప్రభుత్వం నుంచి "పద్మ భూషణ" సత్కారాన్నీ, ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి కళాప్రపూర్ణ గౌరవాన్నీ అందుకున్నారు.

జాషువా రచనలలో ఎక్కువ ప్రచారాన్ని పొందిన కావ్యం గబ్బిలం. గబ్బిలాన్ని అపశకున పక్షిగా లోకం గుర్తిస్తుంటే "కాదేదీ కవితకనర్హం" అంటూ దానినే ప్రధాన పాత్రగా తీసుకొని కావ్య రచన చేసి శీర్షికను కూడా దాన్నే నిర్ణయించడం జాషువా అభ్యుదయ దృక్పథాన్ని ఆవిష్కరిస్తుంది. ఈ కావ్యంలో కేవలం వర్ణవ్యవస్థ మీద నిరసనే కాక వర్గ సంఘర్షణను కూడా జాషువా దర్శింప చేస్తారు. ధనికులు తమ విలాసాలకు డబ్బును విచ్చలవిడిగా ఖర్చు చేయడమే గాని పేదలకూ, ఫకీర్లకూ చిల్లిగవ్వ విదిల్చకపోవడం ఆనాడూ, ఈనాడూ ఉన్నదే. దానినే జాషువా ఈ విధంగా తెలియజేస్తారు.

ప్రతిమల పెండ్లిసేయుటకు వందలు, వేలు వ్యయింత్రుగానిదు:
ఖితమతులైన పేదల శూన్యములైన పాత్రలన్
మెతుకు విదల్పదీ భరత మేదిని ముప్పది మూడు కోట్ల దే
వత లెగబడ్డ దేశమున భాగ్యవిహీనుల క్షుత్తులాఱునే

ఒక కవి తన కావ్యంలో ఏదో ఒక ప్రయోజనం తప్పక కోరుతాడు కానీ జాషువా రచనలలో ప్రతీ పద్యమూ ఒక ప్రయోజనం కోసం రాసినదే. నిరర్థకమైనది ఏదీ ఆయన రాయలేదు. ముఖ్యంగా అట్టడుగు వర్గాల ప్రజల దీనస్థితిని సమాజంలోని ఇతర వర్గాలకు తెలిపి వారి హృదయాలను కరిగించి వారిలో మార్పు తేవటం ద్వారా సమసమాజ స్థాపనకు అనువైన వాతావరణాన్ని కల్పించాలనే ఆశయంతో వ్రాసిన కావ్యం ఈ గబ్బిలం.

జాషువా అనేక ఖండకావ్యాలలో ధనవంతుల ఆగడాలనూ, పేదవారి అగచాట్లనూ వెల్లడించారు. ప్రపంచంలో ధనికులు పేదవాళ్ళని పీడించడం చిన్న చేపను పెద్ద చేప భక్షించడం ఎప్పుడూ జరుగుతుంది. అది అన్ని జీవులలోనూ ఉంది. ఇది జాషువాకు తీవ్ర మనస్తాపాన్ని కలిగించింది. ఆయన తన "సందేహడోల" అనే కవితలో సృష్టికర్తను ఈ విధంగా ప్రశ్నిస్తున్నాడు.

కరుణ నీలోన జన్మంబు గావించునంట
నీవె కరుణకు గడలేని నిలయమంట

జీవి నొకజీవి కన్నంబు జేసినావు
నాథ! యిది చూచి నా గుండె నలిగిపోవు
పక్షపాతంబు లేదు దైవమున కండ్రు
ఖలుడు సుఖియించు, గుణశాలి కష్టరుడును

అంటూ ఈ సృష్టిలోని లోపాలను ఆవేదనాత్మకంగా ప్రశ్నిస్తారు. ఈ ప్రపంచంలో అనేక మంది పేదరికంతో కటిక దారిద్ర్యంతో బాధపడుచుండగా, తన లాంటి అనేక మంది ఇండ్లలో కటిక చీకటి తాండవిస్తుండగా దేవాలయాలలో నేటి దీపాలు వెలుగుచున్నవని అనేక మూగ జీవాలు "బలి" అయిపోతున్నాయని జాషువా "ఆవేదన' ' చెందుతాడు.

పగలు గూబలు రాతిరి పావురంబు
లేలుబడిసేయు జీర్ల దేవాలయమున
వెలుగుచున్నది నేతి దిబ్బముల వరుస
చిలిపి చీకటి నా యింట జిక్కుబడియె
ఆ శిలా విగ్రహంబున కాహుతియయి
పోవుచున్నది నా పేద భోజనంబు
నోరేఱుల గని జీవ జంతువుల తలలు
పొరలు చున్నవి దాని మందిరము నెదుట

కవి 'ఆవేదన' భగవంతున్ని నిందితుణ్ణి చేస్తుంది.

అటు చూస్తే బాదం హల్వా
ఇటు చూస్తే సేమ్యా ఇడ్లీ
ఎంచుకునే సమస్య కలిగిందొక ఉద్యోగికి
ఇటు చూస్తే అప్పుల వాళ్ళు
అటు చూస్తే బిడ్డల ఆకలి
ఉరిపోసుకు చనిపోవడమో
సముద్రమున పడిపోవడమో
సమస్యగా ఘనీభవించిందొక సంసారికి

వంటి శ్రీ శ్రీ మహాప్రస్థాన గేయాలు రాక ముందే జాషువా

ఒకడు చన్నమ్మ కరడోల నూగుచుండ
నొకడు పెద్దమ్మ హటిక దృష్టికి దపించు

ప్రకృతి జనయిత్రి యనుగు గారాల సుతుల
నొకని ద్వేషించు నొకని నభ్యుద్ధరించు (స్వప్న కథ)

అని ఆర్థిక అసమానతలను ఎత్తి చూపుతారు. పుట్టుకతోనే తల్లిదండ్రులను పోగొట్టుకుని, ఎదురొచ్చిన కష్టాలకోర్చి పరోపకారానికే తనువెల్ల వ్యయించిన ఒక స్త్రీ విషాదగాథే "స్వప్న కథ" లోని కథ సామాన్య ప్రజలు దురన్యాయాలకు ఏ విధంగా బలైపోతున్నారో ఈ కావ్యంలో చక్కగా వెల్లడించారు జాషువా.

పేదరికము పెద్ద వింత విద్యాశాల
దానిలోన లజ్జ కానబడదు
ఉద్ధ యొజ్జియగుచు నోరంత పొద్దుట
వోర్మి విద్య నేర్పుచుండునచట

పేదరికంలో ఉండే మాధుర్యాన్ని జాషువా పై విధంగా తెలియజేశారు. పేదరికమనే వింత విద్యాశాలలో అసలు సిగ్గు అనేదే ఉండదు. ఆకలైతే కడుపు నింపుకొనే ఓపికను నేర్పిస్తుందీ విద్యాలయం. పేదరికం జాషువా జీవితంలో వినయాన్ని నేర్పిన విషయాన్ని ఈ సందర్భంలో గుర్తుంచుకోవడం అవసరం.

జాషువా కవితా గురి అంతా సామాజిక, ఆర్థిక సమానత్వాన్ని సాధించడం మీదనే అని గుర్తించాలి. హీనస్థితిని ఏకరువు పెట్టేది గుండెలోని ఆర్తిని వెల్లబోసుకునేది ఎందుకంటే మానవతను ప్రబోధించి సమసమాజ స్థాపనను నిర్మించాలన్నదే జాషువా అభిమతం. అందుకే ఆయన కవిత్వంలో మానవతావాదం, ప్రగతిశీల వాదాలు చోటు చేసుకున్నాయి. అయితే ఆనాటి సమాజంలో ఈ సమానత్వం జాషువాకు వాస్తవానికి ఎక్కడా కనిపించలేదు కనుక "స్మశానం"లో సమానత్వాన్ని దర్శిస్తారు.

"ఇటు అస్పృశ్యత సంచరించుటకు తావేలేదు" అంటూ చివరికి కేవలం అక్కడ మాత్రమే ఆయన సమానత్వాన్ని దర్శించారు.

జాషువా ప్రపంచ వ్యాప్తంగా వస్తున్న ఆర్థిక, సాంఘిక, రాజకీయ పరిణామాలను వీక్షించారు, అవగాహన చేసుకున్నారు. తన పరిధిలో నూతన ఆర్థిక విప్లవాలను సమర్థించారు. పెట్టుబడిదారి విధానాన్ని సొంత ఆస్తుల్ని నిరసించారు. జాషువా లాంటి సంప్రదాయ పద్యకవిలో ఈ రకమైన పరిణామాలు రావడానికి ఆనాటి ప్రపంచ పరిస్థితులు కారణాలుగా చెప్పుకోవాలి. రెండు ప్రపంచ యుద్ధాల పర్యవసానం, ఆర్థిక మాంద్యం, ఆకలి, నిరుద్యోగం, నిస్సహాయత, అభద్రత ఈ పరిస్థితుల్ని స్వయంగా

అనుభవించిన జాషువా తన కవిత్వంలో సమాజాన్ని శాసించి పరిపాలించే ఆర్థిక శక్తుల వైపు దృష్టి సారించారు. ఆ నేపథ్యంలో నుంచే జాషువా "అనాథ" కావ్యం పుట్టింది జాషువా చిత్రించిన "అనాథ" కావ్య వాతావరణం 1930 నాటి ఆకలికి అద్దం పడుతుంది.

ఎవడారగించు నమృత భోజనంబున
గలిసెనో యీ లేమ గంజి బువ్వ
ఎవడు వాసము సేయు శృంగార సౌధాన
మునిగెనో యిన్నారి పూరి గుడిసె
ఎవరి దేహము మీది దవళాంబరములలో.
బొసగెనో యిన్నాతి ముదుక పంచె
ఎవడు దేహము సేర్చు మృదుతల్పములలోన
నక్కెనో యీ యమ్మ కుక్కిపడక
వసుధపై నున్న భోగ సర్వస్వమునకు
స్వామితో వహించి మనుజుండు ప్రభవమందు
నెవడపహరించె నేమయ్యె నీమె సుఖము
కలుషమెరుగని దీని కొడుకుల సుఖంబు?

జాషువా లేవదీసిన ఈ సమస్యలు భారత దేశాన్నే కాక మొత్తం ఈ భూమండలాన్నే ప్రశ్నిస్తున్నాయి. అందరూ సమానంగా అనుభవించాల్సిన ఆర్థిక వనరులు ఏకొద్ది మందికో పరిమితమయ్యే విధానం మీద నిరసన ప్రకటించారు.

జాషువా విశుద్ధ మానవతావాది చరిత్ర చెప్పినా (నేతాజి). పురాణ కథ చెప్పినా (భీష్ముడు) ఆగర్భ దరిద్రుణ్ణి (గబ్బిలం) గూర్చి చెప్పినా ఆయన మనిషినీ, మానవత్వాన్నీ మరువలేదు. ఏ సాహిత్యమయినా దానవుడయిన వాణ్ణి మానవత్వమున్న మనిషిగా నిర్మించాలి. వేదాల నుండి వాదాల దాకా ప్రతి సంస్కర్తా కోరుకున్నదదే! జాషువా కోరుకున్నదీ అదే-

తల్లిదండ్రులెపుడు బిడ్డలకు నేర్పగరాదు
కులగోత్రముల వారి గొప్పతనము
చదివింపగా రాదు చదువులయ్యలు పాఠ
శాలలోన వర్ణాల గొడవ

రచియింపగారాదు రచయితల్ శాశ్వత
దాస్యంబు నిలుపు కథా కదనములు
సలుపరాదెట్టి ప్రచారంబు లీదినం
బమలు నందునన కృత్రిమపు సంస్థ
లన్న దమ్ముల తన వలన కడ్డువచ్చు
శబ్ద జాండంబు సర్వంబు చావవలయు
స్వర్గమటచేత యందుండి తెగడవలయు
మోక్ష రాజ్యంబు బొందిలో పొందవలయు
(నేతాజీ - 41)

మనిషిని మనిషిగా తీర్చిదిద్దడంలో తల్లిదండ్రుల, గురువుల, రచయితల,ప్రసార, ప్రచార సాధనాల పాత్రను పై పద్యం ద్వారా జాషువా తెలిపి ఎలా వాటిని ఉపయోగించి తమ తమ బాధ్యతలను నిర్వర్తించారో వెల్లడిస్తారు. జాషువా తన రచనల ద్వారా అభ్యుదయ భావాలు ఆవిష్కరించారు. జాషువా కేవలం తమ రచనలలో పరాశ్రయాలుగా మాత్రమే కాక తనను గురించి తాను ఆత్మాశ్రయంగా చెప్పుకొంటూ అభ్యుదయ మార్గం వైపు పయనించండని జాతిని ఉపదేశిస్తున్నారు. తాను అచరించని ధానిని ఇతరులకు తాను బోధించనని అంటున్నారంటే జాషువా మహోన్నత అలోచనా సరళి ద్యోతకమవుతుది. తన సంసారాన్ని తాను నడపడానికి తనకెంత డబ్బుకావాలో అంతే తాను సంపాదిస్తానంటూ జాతికి ఉపదేశం చేస్తున్నారు. అలా ఎవరికెంత కావాలో అంతే సంపాదిస్తే ప్రపంచంలో ఆర్థిక అసమానతలు ఎందుకు వస్తాయి? ఆర్థిక అసమానతలు రాకుండా ఉండాలంటే సమస్త మానవాళి ఏం చేయాలో స్వయంగా ఆచరించి చెబుతున్న కవి జాషువా.

నివసించుటకు చిన్న నిలయమొక్కటి దక్క
గడవ సేయుట కానపడను నేను
ఆలుబిడ్డలకునై ఆస్తిపాస్తులు గూర్ప
పెడత్రోవలో పాదమిడను నేను
నేనాచరించని నీతులు బోధించి
రాని రాగము తీయలేను నేను

సంసార యాత్రకు చాలినంతకు మించి
గ్రుడ్డి గవ్వయు గోపుకొనను నేను.
కులమతాలు గీచుకొన్న గీతల జూచి
...రాన గట్టు పడను నేను
...లోకమెట్లు నిర్ణయించిన నాకు
తరుగులేదు. విశ్వనరుడ నేను!

ఒక కవికి తాను చెప్పే అంశాన్ని గూర్చి చెప్పదలచుకున్నా అంశాన్ని గూర్చి నిర్దిష్టమైన ఒక అభిప్రాయం ఉండాలి. ఆ లక్షణాలు జాషువా కవిత్వంలో పరిపూర్ణంగా ఉన్నాయి. జాషువాను కుల కవిగా చిత్రించి దళిత సాహిత్య నిర్మాతలు ఆయనను మా వాడని జబ్బలు చరుచుకోవడం తప్ప ఆయన కవిత్వంలోని అభ్యుదయ భావనలను, జాతీయ భావనలను చాలా తక్కువ మంది గుర్తించారు, అలాగే ఆయనకు ఆ కాలం నాటి రాజకీయ, చారిత్రక, సామాజిక, ఆర్థిక రంగాలపై ఉన్న అవగాహనను గుర్తించలేదు. ఆయన కవితలో ప్రతిఘటన. చైతన్యాన్ని గూర్చి ఎవరూ పూర్తిగా తెలుసుకునే ప్రయత్నం చేయకపోవటం శోచనీయ విషయం.

హరిజనోద్యమ ప్రభావం జాషువాపై ఉన్నా, అది తన సమస్యే అయినా తాను ప్రపంచ హితాన్ని కోరే కవి కాబట్టి తన కావ్యాల ద్వారా సందేశాన్ని అందించే ప్రయత్నం చేశారు. "ప్రపంచ బాధ అంతా శ్రీ శ్రీ బాధ" అని అన్నట్టే జాషువా కూడా ప్రపంచ బాధను తన బాధగా చేసుకుని కవితలు వ్రాసారు. కులం పేరుతో ఆయనను తక్కువ చేసినా నాకేమిటంటూ కవిగా తన బాధ్యతను నిర్వర్తించారు. ఈయన కవితలను కులం దృష్టితో కాక మరో కోణం నుండి చూస్తే జాషువా అభ్యుదయవాదిగా సాహిత్య లోకానికి కనిపిస్తారనడంలో సందేహం లేదు.

ఇం. నెం. 5-4-145, రాణిగంజ్, సికింద్రాబాద్.

# 'అనుబంధం''

పి. స్వరూపారాణి

ఎం.ఏ. ద్వితీయ, పి.జి. కళాశాల

నన్ను నేను వెదుక్కొంటున్నాను
మనుషుల హృదయ రంధ్రాల నుండి జారి
ఏ శిథిల నేలల్లోకి ఇంకి పోయానో
మెత్తగా పరుచుకొన్న అనురాగ బంధాలు
హృదయాన్ని మీటినట్టుండేవి.
చిరునవ్వుల సుమాలు వెచ్చగా భుజాలకెత్తినట్టుండేవి
కనులలో విరిసిన కాంతి పుష్పాలు
పరిమళంగా భాసించేవి.
మాటలు పావురాలై ఎదగవాక్షంపై వాలేవి.
విలపించే ఒక జత పాదాలకు బాసటగా
మరో పది పాదాలు కదిలేవి.
ఇప్పుడో..... ఈ ముందు క్షణం నుంచో
నన్ను నేను పోగొట్టుకున్నాను.
ఏ భావంలేని యాంత్రికత
చలిలా వణికిస్తుంది.
నా అస్తిత్వాన్ని మృత్యుగీతం చేసింది.
స్మశానంలో ఉన్న ఎన్నో సమాధుల సాక్షిగా
ముళ్ళపొదలో నుండి చెదిరిపోయిన ఒక వృద్ధ జంట

వీథి మలుపులో తటస్థపడి
గుండెలు హత్తుకొని విలపించటం
పట్టెడు తిండికోసం ఎండిన తమ డొక్కలను
బిక్షా పాత్రలుగా చేసి
తమలో ప్రవహిస్తున్న నన్ను రగిలిస్తూ
గుండెలను మెలిబెట్టే (అ) వేదన
ఏ అంతర్నేత్రాలకు (క) వినిపిస్తుంది?
స్వచ్ఛంగా స్పందించే గుండెను క్రమ బద్ధం చేస్తూ
కృత్రిమ హాసపు పూతలను పెదాల కతికిస్తూ
అసహజమైన అనుభూతులను సహజీ కరిస్తూ -
మంచు నుంచి చల్లదనం జారిపోయినట్టు -
వెన్నెల నుంచి తెల్లదనం కరిగిపోయినట్టు -
ఉక్కు కవచాలను దాల్చి
లోహశకలాలుగా సాగిపోతుంది తీరం
భయంకర నిస్తేజ లోకానికి
అనుబంధం అనేదే అబద్ధమని
నన్ను అపహసిస్తూ . . . . . . . ..

# నన్నయ అవతారిక - ఒక అనుశీలనం

కాంచనపల్లి సరస్వతి,
ఎం.ఏ. ప్రథమ, ఆర్ట్స్ కళాశాల

నన్నయ కాలము నాటికి తెలుగులో అక్కడక్కడ శాసనములలోని కొన్ని పద్యములు తప్ప కావ్య రచన జరిగినట్లు ఆధారాలు ఇప్పటి వరకు ఏవీ లభించలేదు. కనుక నన్నయయే ఆదికవియని, నన్నయ భారతమే ఆది కావ్యమని తెలుగు సాహిత్య చరిత్రకారుల నిర్ణయము. నన్నయ తనకు ముందు ఉన్న సంస్కృత సాహిత్య సంప్రదాయములను బాగుగా జీర్ణించు కున్నవాడైనందువల్ల, సంప్రదాయాను సారియైనందువల్ల తన కావ్యమును సంప్రదాయబద్ధమైన పద్ధతిలో "మంగళాదీని మంగళ మధ్యాని మంగళాంతాని" అను నియమమును పాటిస్తూ కావ్యారంభంలో మంగళా చరణం చేశారు. ఈ పద్యం నన్నయ సంస్కృత మార్గానుయాయి కనుక సంస్కృతములోనే రచించాడు. ఆ పద్యమిది.

శ్రీ వాణీ గిరిజాశ్చిరాయదధతో వక్షోముఖాఙ్గే షు యే
లోకానాం స్థితిమావహన్త్యవిహతాం స్త్రీ పుంసయోగోద్భవామ్
తేవేదత్రయ మూర్తయ స్త్రీ పురుషాస్సమ్పూజితావస్సురై
ర్భూయాసుః పురుషోత్తమామ్బుజభవ శ్రీకన్ధరాశ్రేయసే

ఎల్లప్పుడు శ్రీవాణీ గిరిజలను క్రమముగా వక్షోముఖాంగముల యందు ధరించి ఈ లోకము యొక్క స్థితి, సృష్టి, లయములను చేయుచు, స్త్రీపుంస యోగోద్భవములైనట్టి, మూడు వేదములకు మూర్తులైనట్టి, నిరంతరము దేవతలచే పూజింపబడుచున్న విష్ణు, బ్రహ్మ, శివులను క్రమముగా శ్రేయస్సును కలిగించుమని ప్రార్థించినాడు.

ఆశీస్సు, నమస్సులలో, ఏదైనను కావ్యారంభమున నిల్ప వచ్చునని సంప్రదాయము. నన్నయ ఇందులో లోక శ్రేయస్సును కాంక్షిస్తూ నమస్కరించి మంగళా చరణం చేశాడు.

## మంగళా చరణం సంస్కృతంలో ఎందుకు?

ఆధునిక విమర్శకులు కొందరు తెలుగు కావ్యాన్ని ఆరంభిస్తూ సంస్కృత పద్యమెందుకు రచించాలి తెలుగులో మంగళాచరణం ఎందుకు చేయకూడదని ప్రశ్నిస్తున్నారు. దానికి సమాధానమిది: నన్నయ సంప్రదాయజ్ఞుడైన సద్బ్రాహ్మణుడు

కావడంవల్ల నిరంతరం దేవతానమస్క్రియలు, దేవతాస్తుతులు, ఆశీర్వచనములు సంస్కృతంలోనెరపడంవల్లనూ, రాజరాజ నరేంద్రుని ఆస్థానంలో సంస్కృత పండితులను సంతోష పరచుటకునూ, సంస్కృత కావ్యములన్ని అరంభ శ్లోకములు దేవతా స్తుతితో కూడియున్నందువల్లనూ, ఆశీర్నమస్క్రియలు దేవభాషలోనే జరిగినచో గౌరవముండునని ప్రగాఢ అభిప్రాయము నాటికి పాతుకొని ఉన్నందువల్లనూ (ఇప్పటికి కూడా మనం సంస్కృతంలోనే మంత్రాది ఉచ్చారణలు దేవతాస్తుత్యాదికములు జరగటం చూస్తున్నాం కదా) నన్నయ తెలుగులో కాకుండా సంస్కృతములో ప్రార్థనా పద్యమును రచించినాడు. ఒక్క మాటలో చెప్పాలంటే ఈయన సంస్కృత మార్గానుయాయి కనుక సంస్కృత మర్యాదనే పాటించినాడు.

నన్నయ రాజరాజనరేంద్రుని ఆస్థాన కవి కనుక, ఆయన కోరిక మేరకు మహాభారతాన్ని తెలుగులో నిర్మించుటకు పూనుకున్నాడు. రాజరాజనరేంద్రుని గూర్చి కొన్ని పద్యములు (2-8) చెప్పినాడు. రాజరాజ నరేంద్రుడు వేంగీ సామ్రాజ్యమును పరిపాలించిన వాడు. చాళుక్య వంశజుడు, విమలాదిత్యుని కుమారుడు, ఆశ్రిత పోషకుడు, వర్ణాశ్రమ ధర్మ రక్షకుడు, దానగుణం కలవాడు, ప్రజానురంజమైన పరిపాలననందించిన వాడు, బ్రాహ్మణులకు అగ్రహారములను దానముగా ఇచ్చి పోషించిన వాడు అని ఈ పద్యముల ద్వారా తెలియుచున్నది.

రాజ రాజనరేంద్రుని ఆస్థానంలో మంత్రులు, పురోహితులు, సేనాపతులు, దండనాయకులు, దౌవారికులు, మహాప్రధానులు, సామంతులు, విలాసినులే కాక అపార శబ్ద శాస్త్ర పారంగులైన వైయాకరణులు, భారత రామాయణాద్యనేక పురాణ ప్రవీణులైన పౌరాణికులు, మృదు, మధుర, రస, భావ, భాసుర నవార్థవచన రచనా విశారదులైన మహాకవులు, వివిధ తర్క, విగాహిత, సమస్త శాస్త్ర సాగర గరీయ ప్రతిభులైన తార్కికులు మొదలైన విద్వజ్జనులు ఉండిరని (8) తెలియుచున్నది.

## నన్నయ వ్యక్తిత్వం :

తనకుల బ్రాహ్మణుననురక్తు న విరళ
జప హోమ తత్పరు విపుల శబ్ద
శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది
నానా పురాణ విజ్ఞాన నిరతుఁ
బాత్రు నాపస్తంభ సూత్రుముద్గల గోత్ర

జాతు సద్వినుతాప దాత చరితు
లోకజ్ఞునుభయ భాషా కావ్య రచనాభి
శోభితు సత్ప్రతిభాభియోగ్యు
నిత్య సత్య వచను మత్యమరాధిపాచార్యు
సుజను నన్నపార్యు జూచి
పరమ ధర్మ విదుడు వరచళుక్యాన్వయా
భరణుడిట్టులనియె గరుణతోడ

పై పద్యములలో నన్నయ రాజ రాజ నరేంద్రునకు కుల బ్రాహ్మణుడని, ఆపస్తంభ సూత్రుడని, ముద్గలగోత్ర జాతుడని, ఉత్తములచే పొగడబడిన మంచి నడవడి గలవాడని, ప్రీతి పాత్రుడని తెలియుటయే కాక ఆయన అవిరళ జప, హోమ తత్పరుడని, విపుల శబ్ద శాసనుడని, వేదాధ్యయనము చేసిన వాడని, బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతుడని, లోకజ్ఞుడని, ఉభయ భాషా కావ్య రచనాభి శోభితుడని, మంచి ప్రతిభకలవాడని, నిత్య సత్య వచనుడని, బుద్ధి యందు బృహస్పతి వంటి వాడని, సుజనుడని, భారతానువాదమునకు పాత్రుడని తెలియుచున్నది.

## రాజరాజ నరేంద్రుడు నన్నయను భారతము రచించుమని కోరుట:

రాజరాజు కొలువుదీరిన సమయంలో భారత రచనకు తగిన శక్తి, సామర్థ్యము, వ్యక్తిత్వము కలిగిన నన్నయతో ఇట్లన్నాడు. "నిర్మలమైన మనస్సుతో పురాణములు విన్నాను, అర్థధర్మ శాస్త్రములను తెలుసుకొన్నాను, రసాన్వితమైన కావ్యనాటకములను చూశాను. ఈశ్వరాగమముల యందు భక్తితో హృదయాన్ని నిల్పినాను అయిననూ నాకు ఎల్లప్పుడు మహాభారతం వినాలనే కుతూహలం అధికంగా ఉంటుంది. బ్రాహ్మణులకు తృప్తి కలుగునట్లుగా రాజ్యము చేయుట, దానములిచ్చుట, భారతము వినుట, శివ పూజ చేయుట, సజ్జన సాంగత్యము నెఱపుట, నాకు మిక్కిలి ఇష్టములు, అంతేకాక చంద్రుడు మొదలుకొని పురు చక్రవర్తి, భరతుడు, కురు రాజు, పాండురాజు క్రమంగా మా వంశకర్తలని అట్టి వంశమ్మున ప్రసిద్ధులైన, విమల సద్గుణ శోభితులైన, ఉత్తములైన పాండవుల చరిత్ర వినటం నాకు ఎంతో ఇష్టం. నిర్మలమైన బంగారు కొమ్ములు కలిగిన వంద కపిల ధేనువులను ఉత్తములైన వేద విప్రులకు దానము చేస్తే కలిగే సత్ఫలం ఒక్క భారతం వినటం వల్ల కలుగుతుంది. కాబట్టి నాకు భారతం వినాలంటే మక్కువ ఎక్కువ అందువలన ఓ నన్నయా!

జననుత కృష్ణద్వైపా
యనముని వృషభాభిహిత మహాభారతబ
ద్ధ
తెనుగున రచియింపుమధిక ధీయుక్తి మెయిన్.

అని కోరినాడు. ఇందులో రెండు మాటలు ప్రధానమైనవి ఉన్నాయి. ఒకటి తెనుగున రచియింపుమని, రెండవది వ్యాస మహాభారత బద్ధ నిరూపితార్థమేర్పడ రచింపుమని, అంటే? దీని యర్థం ఊరికే మహాభారతాన్ని తెనిగించడం కాక రచించడమని. ఊరికే రచించడం కాక వ్యాస భారతంలో నిరూపించబడిన అర్థాన్ని తేటపడునట్లుగా రచించుమని.

## నన్నయ భారత రచనకు అంగీకరించుట:

రాజరాజు ఆనతిని విని నన్నయ ఇట్లన్నాడు. "చుక్కలను లెక్కించుట, సర్వ వేద శాస్త్రముల సారమెరుంగుట, భారత భారతీ సముద్రమును ఈదుట బ్రహ్మతరమైనా అవుతుందా? అయినప్పటికీ మీ అనుజ్ఞచే పండితుల దయచే నేను నేర్చిన పద్ధతిన ఈ కావ్యాన్ని రచించెదనని అన్నాడు."

## ఇష్టదేవతా ప్రార్థనము:

అవతారికలో ఇష్టదేవతా ప్రార్థనము అనే అంశం నన్నయతోనే ఆరంభమైంది. కావ్య రచన నిరాటంకంగా కొనసాగాలని కవి ఇష్టదేవతా స్తుతి చేస్తాడు. అట్లా నన్నయ హరి, హరుడు, బ్రహ్మ, విఘ్నేశ్వరుడు, సూర్యుడు, కుమారస్వామి, సరస్వతీ దేవి, పార్వతీ దేవి మొదలైన దేవతలందరికి నమస్కరించాడు (21)

## పూర్వకవి స్తుతి:

దుర్భర తపో విభవాధికుడు, పద్యవిద్యకు ఆద్యుడు, బ్రహ్మతో సమానమైన వాడు, ప్రచేతసుని పుత్రుడు అయిన వాల్మీకిని భక్తితో తలంతును. ఈ వాక్యంలో ఇష్టదేవతా ప్రార్థనతోపాటు పూర్వకవి స్తుతి కూడా చేసినాడు. నన్నయ తరువాతి వారు నన్నయను పూర్వకవిగా స్తుతించినారు. నన్నయకు ముందు తెలుగు కవులు లేరు గనుక నన్నయ ఆదికవియైన వాల్మీకిని నుతించినాడు. భారత భారతీ కిరణముల చేత ఘోర సంసారాంధకార విజృంభమును దూరము చేసి పండిత హృదయాబ్జములను

మేలుకొలిపినట్టి, పరాశరాత్మజుడైన, బ్రహ్మసమానుడైన, ముని పూజితుడైన మిక్కిలి యశః సంపన్నుడైన వ్యాస భగవానుని కొలిచినాడు. సంస్కృతంలో కాళిదాసాది కవులు నన్నయకు పూర్వమే ఉండగా మరివారిని ఎందుకో స్తుతించలేదు. పూర్వకవి స్తుతిలో కేవలం రామాయణ, మహాభారత కర్తలైన వాల్మీకి, వ్యాసులను మాత్రమే నుతించడం విశేషం.

సభాస్తుతి : నన్నయ రాజరాజు ఆస్థానంలో ఉన్నాడు. ఆ సభలో ఇంకా ఇతర పండితులు కూడా ఉన్నారు. అట్టి పండిత సభను నన్నయ సరస్సుతో పోల్చి చెప్పినాడు.

**నారాయణభట్టు సహకారం:** భారత ఘోర రణంలో నరునకు నారాయణునివలె భూసుర శ్రేష్ఠుడు, వాఙ్మయ ధురంధరుడు, తనకిష్టుడు, తన సహాధ్యాయి, అయిన నారాయణభట్టు తోడుగా ఉండగా నన్నయ మహాభారత గ్రంథ రచనకు ఉపక్రమించినాడు, నరునకు నారాయణుని వలె అనటంలోయుద్ధం చేయడంలో అర్జునునికి శ్రీకృష్ణుని వలె సహాయం చేయడమని అర్థం.

## నన్నయ కవితాదర్శాలు :

సారమతిం కవీంద్రులు ప్రసన్న కథా
కవితార్థయుక్తిలో
నారసి మేలు నానితరులక్షరరమ్యత
నాదరింపనా
నారుచిరార్థ సూక్తి నిధి నన్నయభట్టు
తెనుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురుడయ్యె
జగద్ధితంబుగన్.

పై పద్యంలో నన్నయ తన కవిత్వంలో ప్రసన్న కథా కలితార్థయుక్తి, అక్షరరమ్యత, నానారుచిరార్థ సూక్తులు ఉంటాయని చెప్పుకున్నాడు. ఇందలి మొదటి గుణాన్ని సారమతులైన కవీంద్రులు లో చూపుతో నరసి కనుగొంటారు. మేలు మేలు అంటారు. లోచూపు లేనివారు నన్నయ కవిత్వంలోని అక్షరరమ్యతనే ఆదరిస్తారు, ఆనందిస్తారు. అంతే కాదు, అనేకములైన, రుచిరములైన, అర్థవంతములైన సూక్తులు కూడా ఆయన కవిత్వంలో ఉంటాయని చెప్పుకున్నాడు.

ప్రసన్న కథా కలితార్థయుక్తిని కొందరు ప్రసన్న కథా కవితార్థయుక్త అని కూడా అన్నారు.

## ప్రసన్న కథా కలితార్థయుక్తి:

మహాభారతము కురుపాండవుల చరిత్రము అయినప్పటికి ఈ ప్రధాన కథకు ఆనుషంగికముగా అనేక ఉప కథలు ఉన్నాయి. ప్రధాన ఇతివృత్త సంవిధానమునకు భంగము కలుగకుండ ఉపకథలను కూర్చుట ప్రసన్న కథా కవితార్థయుక్తి అనవచ్చు.

ఉదా:- ఉదంకోపాఖ్యానము, శకుంతలోపాఖ్యానము, వృద్ధహంసోపాఖ్యానము, సాంభకోపాఖ్యానము, నలోపాఖ్యానము, సౌకన్యకోపాఖ్యానము, అజగరోపాఖ్యానము మొదలైనవి. నన్నయ భారతంలోని ఉపకథలు. ఈ కథలన్నింటిలోను నన్నయ ప్రసన్నంగా కథను నడిపించిన తీరును మనం గమనించవచ్చు. కథలో ఆయువుపట్టు చెడకుండా మొదటి నుండి చివరి వరకు ఉత్కంఠతను పోషిస్తూ ముడులను వేస్తూ విప్పుతూ ఎంతో చాకచక్యంగా కథలను నడిపించినాడు.

శకుంతలోపాఖ్యానం కథలో దుష్యంతుడు కణ్వ మహర్షి ఆశ్రమానికి వెళ్ళి శకుంతలను చూడగానే అతని మనస్సు ఆమె యందు లగ్నమై దుష్యంతుడు తన మనస్సులో ఇట్లా అనుకుంటాడు.

ఇది మునికన్య యేని మఱి యేలకొ
యీలలితాంగి యందునా
హృదయము దద్దయుందవిలె నిప్పలు
కింకను నమ్మ నేర న
య్యెద విజితేంద్రియుండనగ నిమ్ముని
బాయక విందు నంచుదా
నిది కలరూపెఱుంగ నవనీపతి యుత్సుకు
డయ్యె నాత్మలోన్ (ఆది. ప. చ. ఆ. 30.ప)

దుష్యంతుడు క్షత్రియుడు. శకుంతల మునికన్యయైనచో అతని మనసు ఆమె పై పడుట అధర్మము. అందుకని దుష్యంతుడు ధర్మబద్ధుడైన రాజు కనుక 'నా మనస్సు ఈమె యందు లగ్నమైనది ఈమె మునికన్యయైనచో నా మనస్సు ఈమె పై ఎట్లుపడునని' సందేహించినాడు. ఇది ఈ కథకు ఆయువుపట్టు తర్వాత ఆమె జన్మ వృత్తాంతాన్ని తెలుసుకొని ఆమె క్షత్రియ కన్యయేనని నిర్ణయించుకుంటాడు - ఆ పద్యమిది

ఇది మునినాధకన్యయని యెంతయు నిస్పృహ వృత్తినున్ననా
హృదయము రాజపుత్రినని యిక్కమలాక్షి నిజాభిజాత్యసం
పదనెఱిగించినన్ మదన బాణపరంపర కిప్పుడుండనా
స్పదమయి సంచలించె నళిపాతవికంపిత పంకజాకృతిన్.

(ఆదీ.ప.చ.ఆ.వం.ప)

'ఇది మునికన్యయేని' అని ముడివేసి రాజపుత్రి అని ముడిని విప్పే వరకు ఉత్కంఠతను పోషిస్తూ కథను నడిపించినారు నన్నయ. ఈ విధంగా అడుగడుగునా కథలో ముడులను వేస్తూ, విప్పుతూ అత్యంత చాకచక్యంగా ప్రసన్నంగా కథలను నడిపించినారు.

అక్షరరమ్యత: అక్షరముల కూర్పు వలన పుట్టిన రమ్యత అక్షర రమ్యత ఇది ప్రధానంగా శబ్దమునకు సంబంధించిన చమత్కారము. శకుంతలో పాఖ్యానమునందలి ఈ క్రింది పద్యము నన్నయ అక్షరరమ్యతకు ఒక ఉదాహరణము.

భరతుడు శేష భూభువన భారధురంధరుడై వసుంధరం
బరగియనేక యాగముల బాయక భాస్కర జహ్నుకన్యకా
సురుచిరతీరదేశముల సువ్రతుడై యొనరించి భూరిభూ
సురులకు నిచ్చె దక్షిణలు శుద్ధ సువర్ణగవాశ్వహస్తులన్

109.ప.

పై పద్యము నందు 'భ' కార 'ర' కారములు పలుమార్లు ఆ వృత్తియై పద్యమునకు రమ్యతను చేకూర్చినవి. వినుటకు ఇంపు కలిగించినవి.

నానారుచిరార్థ సూక్తి నిధిత్వము: అనగా అనేకములైన రుచిరములైన సూక్తులకు నన్నయ కవిత్వము నిధి వంటిది.

సూక్తి అనగా (సు+ఉక్తి = సూక్తి) సుభాషితము అని అర్థము- శకుంతలోపాఖ్యానము నందలి ఈ క్రింది పద్యము దీనికి ఒక ఉదాహరణము.

నుతజల పూరితంబులగు నూతులు నూఱిటి
కంటె సూనృత
వ్రత యొకబావిమేలు మఱి బావులు నూఱిటి
కంటె నొక్క స
త్క్రతువది మేలు తత్క్రతుశతంబునకంటె

సుతుండు మేలు త
త్సుత శతకంబునకంటె నొక సూనృతవాక్యము
మేలు సూడగన్

నూఱు నూతులకంటె ఒక బావి, నూరు బావులకంటె ఒక యజ్ఞము, నూరు యజ్ఞముల కంటె ఒక్క సుతుడు. నూరు గురు కుమారులకంటె ఒక సత్య వాక్యము మేలైనదని పై పద్యభావము. ఈ పద్యమునందు సూక్తుల వంటి వాక్యములు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి.

నన్నయ మహాభారత రచన కేవలం స్వార్థం కోసమో, రాజరాజ నరేంద్రుడు కోరినాడనో మాత్రమే చేయలేదు. ఈ కార్యంలో ఆయన జగత్తుహితాన్నే కాంక్షించాడు. ఆంధ్రశబ్ద చింతామణి కర్త చెప్పిన 'విశ్వశ్రేయః కావ్యం' అన్న ఆదర్శాన్ని తన ఆదర్శంగా గ్రహించాడు.

## మహాభారత కథా ప్రాశస్త్యం :-

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని,
యధ్యాత్మ విదులు వేదాంతమనియు,
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రమని,
కవివృషభులు మహాకావ్యమనియు,
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని,
యైతి హాసికులితి హాసమనియు,
బరమ పౌరాణికుల్ బహు పురాణ
సముచ్చయంబని మహిగొనియాడుచుండ
వివిధ వేద తత్త్వవేది వేద వ్యాసు
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండజేసె భారతంబు.

సంస్కృత మహాభారతంలో వేదవ్యాసుడు వేదములలో ప్రతిపాదింపబడిన అనేక ధర్మములను పంచమవేదమైన తన మహాభారతమునందు పొందు పరచినాడు. కనుక ధర్మతత్త్వం తెలిసిన వారు దీనిని ధర్మ శాస్త్రమంటారు.

ఉదా:- ఏది హింస? ఏది అహింస? అనే ధర్మ సూక్ష్మాన్ని అరణ్య పర్వంలో ధర్మ వ్యాధుని కథ (కౌశికోపాఖ్యానం)లో వివరించబడింది. సకలోప నిషత్సారమైన భగవద్గీత అను ఆధ్యాత్మ శాస్త్రమును మహాభారతంలో నిక్షిప్తంచేసినాడు. కనుక ఆధ్యాత్మ విదులు దీన్ని వేదాంతమంటారు. విదురుడు, సంజయుడు, శ్రీకృష్ణుడు మొ॥ వారు ఆయా సందర్భాలలో నీతి బోధ చేయడంవల్ల వీటికి విదుర నీతి, సంజయ నీతి, కృష్ణ నీతి అని ఈనాటికి కూడా మనం వింటూనే ఉంటాం, ఇవన్నీ మహాభారతంలోనివే కాబట్టి నీతి విచక్షణులు దీన్ని నీతి శాస్త్రమని అంటారు.

మహాభారతం అనేక కావ్యాల సంపుటి ఒక్కొక్క ఉపాఖ్యానం ఒక్కొక్క కావ్యంలాగా భాసిస్తుంది. నవ రసాల సమ్మేళనం, ఆనంద పర్యవసాయి, విశ్వశ్రేయస్సును కాంక్షించునది, అభ్యుదయ పరంపరాభి వృద్ధిని కోరునది. ఆలంకారికులు చెప్పిన -

"కావ్యం యశసేర్థకృతే
వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే
కాంతా సమ్మితతయోపదేశయుజే".

అన్న లక్షణమును సంపూర్ణముగా కలిగి ఉన్నది కావున దీన్ని మహాకావ్యమంటారు.

ఛందో వ్యాకరణాలంకారాది శాస్త్రవేత్తలు మహా భారతాన్ని లక్ష్యంగా స్వీకరిస్తారు కనుక దీనిని వారు సర్వ లక్ష్య సంగ్రహమని అంటారు.

ఐతిహాసికులితిహాసమని పరమ పౌరాణికులు బహుపురాణ సముచ్ఛయమని కొనియాడుటకు గల కారణము మహాభారతమునందు పురాణేతి హాస లక్షణములు మిళితమై ఉండటం.

ఉదా:- దేవాసురోత్పత్తి, దేవదానవ సంగ్రామాలు, రాజవంశాల చరిత్రలు కలిసి ఉన్నాయి. అందువల్లనే మహాభారతం విజ్ఞాన సర్వస్వమై, పంచమ వేదమై ఈనాటికిని నిలచి యున్నది.

సునీతా అపార్ట్‌మెంట్స్, ప్లాట్ నం. - 10, తిరుమలా నగర్, అంబర్‌పేట్.

# తీరని కోరికలు

రత్నం బంకల
ఎం.ఏ. ద్వితీయ, పి.జి. కళాశాల

నిత్యం పుట్టే కోరికలు
గోడకు కొట్టిన రబ్బరు బంతులు.
నిన్ను చూడాలనే కోరికతో
సంధ్యా సమయంలో
ఆత్రుతతో పరుగున వస్తే,
అదేంటో ...... ! చీకటి పడుతుంది
గుండెనిండా గులాబీ- ముళ్ళ భావన
తెలవారగానే మరో కోరిక జననం
కొంచెం కనిపిస్తుంది కోరికకు ఫలితం.
ఫలించిన ఈ కోరికకు
ఆహా. . . . ఓహోల పొగడ్తల హారం
వెనువెంటనే ఓ కొత్త కోరిక మొలక
తీరా చూస్తే ఖాళీ అయిన జేబుల వెక్కిరింతలు
నిత్యం వెంటాడే పేదరికపు ఛాయలు
నిండు పున్నమి చంద్రుడు ముక్కలైనట్లు
లైటు వెలిగించినా అంధకారం.
కలలో పులితో పోరాటం
తెలవారగానే నిత్యం చేసే వెలితి పనులతో
జీవితమే అగమ్యగోచరం.
మేనుపై వేసుకున్న అసంతృప్త కవచం
ఇంకెన్నాళ్లో . . . . . ?
ఈ 'తీరని కోరికల'తో పెనుసవాళ్ళు!

గ్రా॥ గొల్లపల్లి, పోస్టు: చెన్నారం, మ॥ గోపాల్‌పేట,జి॥ మహబూబ్‌నగర్.

# అవధానం - తెలుగు వెలుగు

ఎస్. సునీతా దేవి

ఎం.ఏ. ప్రథమ, ఆర్ట్స్ కళాశాల.

సాహిత్యం మార్పుకు లోనవడం సహజం. మార్పుకు లోనవుతున్నప్పుడు అందులో అనేక ప్రక్రియలు ప్రవేశించడం కూడా సహజమే. ఈ పరిణామాలు కారణంగా తెలుగు సాహిత్యంలో సంస్కృత ప్రభావంతో వచ్చిన ప్రక్రియ అవధానం. సంస్కృతంలో కంటే ఇది తెలుగులోనే నవనవోన్మేషంగా నేటికీ విలసిల్లుతున్నది.

కృష్ణదేవరాయల కాలంలో ప్రారంభమైన ఈ ప్రక్రియ నానాటికీ దినదినాభివృద్ధి నొందుతూ వచ్చి దక్షిణాంధ్ర యుగంలోను ప్రవేశించింది. అక్కడ అవధానాలు చాలానే. జరిగాయి. ఆధునిక యుగంలో ఈ అవధానాల ప్రభావం మాత్రం చాలా తీవ్రంగా ఉండినది. ఆధునిక యుగంలోని చాలామంది కవి పండితులు అవధానాలు చేసినవారే. జమీందారీల ప్రభావంతో ఈ కాలంలో కవిత్వాన్ని వ్యాపారపు సరుకుగా మార్చారనడంలో ఆశ్చర్యంలేదు. అందుకే ప్రారంభంలో దీని ప్రభావంతో అవధానాలు చేసిన రాయప్రోలు "పద్యం ఆశు కవితా సన్యాస మిప్పించవే భారతీ!" అంటూ తల్లి సరస్వతిని వేడుకున్నాడు.

ఈ అవధానాల్లో ప్రధానంగా సమస్య దత్తపది, నిషిద్ధాక్షరి. గంట, ఆశు, అప్రస్తుత ప్రసంగం, వర్ణన, అంశాలు చోటు చేసుకుంటాయి. ఆయా అవధానుల ఇష్టానుసారంగా ఇందులోని కొన్నింటిని తొలగించి మరికొన్నిటిని ఏర్పాటు చేసుకోవడం కన్పిస్తుంది. ఈ అవధానాల వలన సాహిత్య పరంగా ఒక ప్రయోజనం ఉన్నది. భాషను విస్మరిస్తున్నటువంటి ఈ కాలంలో భాషను కాపాడటానికి ఈ అవధానాలు కొంత తోడ్పాటును అందిస్తాయి. దక్షిణాంధ్ర యుగం తర్వాత సాహిత్యంలో కొంత స్తబ్ధత వచ్చింది. ఆస్తబ్ధత తొలగిన తర్వాత ఇంచుమించుగా క్రీశ 1864 నుండి 1976 వరకు ఒక శతాబ్ద కాలం అవధానం రాజ్యమేలింది. అయితే అది ఆయా కవి పండితుల ప్రభావం వలన కావచ్చు లేదా అవధాన విశిష్టత కావచ్చు. తెలుగు నాట ఈ అవధానాన్ని అభివృద్ధి చేసిన వారు తిరుపతి వేంకటకవులే. వీరు అవధాన విద్యను తొమ్మిది పది మందికి నేర్పించినారు. కందుకూరి కూడా ముందు అవధానాలు చేశారు. తర్వాతే గారడీ కవిత్వాన్ని విమర్శిస్తూ అధిక్షేపరచన 'సరస్వతీనారద విలాపము! రచించారు. ఈ శతాబ్దంలో ఆంధ్ర దేశంలో అవధానాలు చేసిన వారిని లెక్కపెట్టడం కన్నా చేయని వారిని లెక్క పెట్టడమే సులభం. ఈ విధంగా సాగిన అవధానం ఒక శతాబ్ది పాటు సాగింది.

సాహిత్యంలో ఆధునిక ధోరణులు ప్రవేశించిన కొంత కాలం ఈ అవధానాలు జరిగినా అవధానాలు చేసేవారు ప్రతిభామూర్తులు కాక పోవడం వల్లనో, లేదా దానిని

పోషించిన వారు తక్కువవడం వల్లనో అవధానం కొన్ని రోజుల పాటు స్తబ్దంగా ఉండవలసి వచ్చింది. కొంత కాలంగా ఈ అవధానాలు మళ్ళీ సాహిత్య లోకంలో పుంజుకున్నాయి అని చెప్పడానికి ఆధారం మేడసాని మోహన్ రవీంద్రభారతిలో నిర్వహించిన శతావధానం, మాడుగుల నాగఫణిశర్మ నిర్వహించిన ద్విశతావధానం, తిరుపతిలో మేడసాని మోహన్ నిర్వహించిన సహస్రావధానం, తెలుగులలిత కళాతోరణంలో మాడుగుల నాగఫణి శర్మ నిర్వహించిన సహస్రావధానాలు మళ్ళీ అవధాన విద్యను అభివృద్ధి చేస్తున్నాయి. దానికి ప్రభుత్వం కూడా కొంత తోడ్పాటును అందిస్తున్నది.

క్రీశ 1950 ముందు అవధానాలను గారడీ కవిత్వమని విమర్శించిన వారేనేడు దీనిని అంగీకరిస్తున్నారు. అందుకు కారణం భాషను ప్రజలు గుర్తించకుండా పోతున్న ఈ తరుణంలో ఇవి భాషాభివృద్ధిని చేస్తున్నాయి అవధాన ప్రభావంతో ఈ మధ్య చాలా అవధానాలు జరిగాయి. మళ్ళీ అవధానాలు పుంజుకుంటున్నాయి. ఆంధ్ర దేశంలోని కవి పండితులు, విమర్శకులు, అధ్యాపకులు ఈ అవధానాలను చూడడానికి వచ్చారు. ధారణ ధారల సంగమం అవధానం, కవి కావ్యం వ్రాయడానికి మేధాశక్తి, భావనాశక్తి అవసరం. అవధానికి వీటితో బాటు ధారణ, పాండితీ ప్రతిభ, ధార, ఛందో వ్యాకరణాలంకారాలు శాస్త్రేతి హాసపురాణాలు క్షుణ్ణంగా తెలిసి ఉండాలి.

గారడీ కవిత్వంగా మాత్రమే ఉన్నదన్న కొందరు తమ అభిప్రాయాలను మార్చుకునే విధంగా ఈ మధ్య రెండు సహస్రావధానాలు జరిగాయి. ఇందులో సాహిత్య ప్రయోజనాలను, సామాజిక ప్రయోజనాలను అవధానం సాధించే ప్రయత్నం చేయడం గమనించ దగ్గ పరిణామం.

**వ్యక్తి పరంగా జరిగిన ప్రయోజనం :-** ఇరవై ఒక రోజులు జరిగిన ఈ అవధానం వలన నగర జీవితాన్ని అనుభవిస్తున్న ఎంతో మంది తమ సమయాన్ని వెచ్చించి ఇక్కడకు వచ్చి అవధానాన్ని దర్శించినారు. ఈ అవధానాన్ని దర్శించిన వ్యక్తికి మరో అనవసర పనిపై ధ్యాస ఉండదు. భాషాభిమానం పెంపొందే అవకాశం కూడా ఉంది. ప్రాచీన కాలంలోని సంస్కృత పద భూయిష్ట భాష గాక అవధానులు సరళ భాష ఉపయోగించి సహృదయులకు ఆనందం కల్గించే ప్రయత్నం చేశారు. అందుకే తిరుపతివెంకట కవులు దేశభాషాలలితాంగి కాలమును బట్టి మారుతుందని చెప్పారు. కావ్యం ఉపదేశం, ఆనందాలు ఏవిధంగా కలిగిస్తుందో అలాగే అవధానం కూడా ఈ ప్రయోజనాలను కల్గిస్తుంది.

**సమాజ పరంగా జరిగిన ప్రయోజనం :-** "సమాజానికి సాహిత్యం సిరి ఐతే అవధానం సువర్ణము" వరకట్న సమస్యను గూర్చి, కాలుష్య సమస్యను గూర్చి, పృచ్ఛకులు అడిగిన ప్రశ్నలకు అవధాని కవితా రూపంలో చెప్పే జవాబులు వ్యక్తి

సమాజానికి చేయవలసిన దోహదాన్ని ప్రేరేపిస్తాయి. మానవ హృదయ స్పందనను అవధాని పద్యాలతో నిరంతరం వర్షిస్తుంటే విన్న హృదయం స్పందించకుండా ఉండదు.

నక్సలైట్లను గూర్చి అవధానిగారు పాడిన పాటలో సామాజిక నేపద్యం కన్పిస్తుంది.

రాయివి కావు తమ్ముడు నువు రాజువు
మారితే ఈ దేశానికి రారాజువు
ఎందుకో మరి ఎప్పుడో మరి ఏమిటో జరిగింది
అద్దమంటి మనసు ముక్కలై పోయింది ॥రా॥
ఇల్లును వదల లేక ఇల్లాలిని వదల లేక
కాళ్ళ కడ్డు పడి ఏడ్చే పసికందును వదలలేక
అడవికి నీవు వెళ్ళినావు ఇల్లు అడవి చేసినావు ॥రా॥
ముందు నీవు పోలేక వెనక్కి తిరిగి రాలేక
రాక్షస సిద్ధాంతంతో రాజీ పడలేక
నడిరోడ్డున కూడలిలో నలిగి పోతున్నావా? ॥రా॥
కష్టమొస్తే ప్రతివాడూ కసాయి అవుతాడా?
కరుణ ఉన్న గుండె కన్నా గుండు గొప్ప దంటాడా?
అట్లైతే ఈనేలను బుద్ధుడు పుడతాడా?
అహింస అను వెన్నెల గుడి కడతాడా? ॥రా॥

ఈ పాట విన్న తరువాత మనసున్న ప్రతి నక్సల్ వీరుడు తప్పక మారి తీరుతాడు. ఇది సమాజానికి కలిగే మహోన్నత ప్రయోజనం అని చెప్పవచ్చు.

వేదాలలో ప్రణవంలా, విద్యలలో సావిత్రిలా, ధాతువులలో బంగారంలా యుగాలలో కృతంలా, సరస్సులలో సాగరంలా, కవితలలో ఆణిముత్యంలా అవధాన కవిత నేడు వెలుగొందుతుంది. ఈ విధంగా సాహిత్యంలో అవధాన ప్రక్రియ ద్వారా ఆయా కాలాల చారిత్రక ఘటనలు, స్థితిగతులు, భాషాస్థితిగతులు, రాజకీయ, ఆర్థిక సాంఘీక రంగాలలో దేశపరిస్థితులను అర్థం చేసుకునే అవకాశం ఉన్నది. అయితే అవధానికి కావలసిందల్లా పృచ్ఛకులు ఆయారంగాలపై సమస్యలను ఇవ్వడమే. ఒక చేత్తో చప్పట్లు కొట్ట లేము కదా! అందుకే అవధాన ప్రక్రియలో అవధానికి ప్రతిభ ఎంత ముఖ్యమో పృచ్ఛకునికీ ప్రతిభ అంతే ముఖ్యము. మొత్తం మీద ఈ అవధానాలు ఆధునిక యుగంలో భాషా సాహిత్యాలను కాపాడటంలో ప్రముఖ పాత్రను వహిస్తున్నాయనడంలో సందేహం లేదు. ఇతర భాషల కంటే ఎక్కువగా ఇక్కడ అంటే తెలుగు భాషలో జరుగుతున్నాయి. కాబట్టి అవధానాలు. అవధానులు తెలుగు వెలుగులు.

---

ఇం. నెం. 18-5-684, అలియాబాద్, హైదరాబాద్.

# జ్ఞాపకం ఊపిరై నప్పుడు......

బి. లీలారాణి

ఎం.ఏ., ద్వితీయ, పి.జి. కళాశాల

నేస్తం! ఓ నేస్తం!
స్నేహానికి అర్థం తెలియని నాకు
నీ మనసుతో నిర్వచించావు
కల్మషం లేని స్నేహముతో
శూన్యం లాంటి నా మనస్సులో
తెమ్మెరలా ప్రవేశించావు
నాలోని ప్రతి అణువును కదిలించి,
నా ప్రతి కదలికకు ప్రాణం పోసి,
నీ భావాలను నాకు ఊపిరి చేసిన
జ్ఞాపకాల చిరుగాలి,
నన్ను చుట్టు ముడుతున్నపుడు
నా మనసు సముద్ర మథనమౌతుంది
వినీలాకాశపు అంచుల్లో విహరించే నీలో
ఐక్యం కావాలనే చిన్న ఆశ....... కానీ,
ఓ మెరుపులా తళుక్కున మెరసి
మాయమవుతావు
నను ఒంటరిని చేసి
మంచులా కరిగిపోతావు

ఇ.నెం. 2-11-127, మం॥ కొల్లాపూర్, మహబూబ్ నగర్

# సాహిత్యేతర వ్యాసాలు - సాహిత్య ప్రభావం

ఎ. మాలతి

ఎం.ఏ. ప్రథమ, ఆర్ట్స్ కళాశాల

సాహిత్యం అనగా హితంతో కూడినది. సమాజానికి ఉపయోగపడి శ్రేయస్సును కలిగించేది. రమ్యమైన అక్షరాల కూర్పు అర్థవంతమైన పదజాలము సాహిత్యంలో సమాజ శ్రేయస్సుకు దోహద కారులు. సాహిత్యపరం కానిదంతా సాహిత్యేతరమే. అనగా సాంఘిక, ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానిక తదితర రంగాలన్నీ సాహిత్యేతర అంశాలే.

సాహిత్యం ఒక దేశ ప్రాంత ప్రజల స్థితి గతులను ఆచారవ్యవహారాలను ప్రతిబింబింప చేసి ఒక ప్రయోజనాన్ని కల్గిస్తుంది. సాహిత్యేతరము అయినటువంటివి అన్నీ ఆయా రంగాలపై అవగాహన కల్గిస్తాయి. ఆయా రంగాలు స్థితిగతులను తెల్పేవిగా ఉంటాయి. భారతం, రామాయణం వంటి సాహిత్య గ్రంథాలలో సాహిత్యేతర అంశాలు కూడా అనేకం గోచరిస్తాయి. భారత, రామాయణాలు ఆయా భాషలలోకి అనువాదం కావడానికి కారణం ఈ ఉద్దేశ్యమే. అంటే సాహిత్యేతర ప్రయోజనాలను సాహిత్య భాష సాధించగలదనేది స్పష్టము. ఈ గ్రంథాలలో మాతృ పితృ, బ్రాతృ అనుబంధాలే గాక నాటి స్త్రీల స్థితిగతులు, రాజకీయాంశాలు సమస్త మానవాళి అనుసరించదగ్గ నీతులు, ఆచార వ్యవహారాలు తెలుస్తాయి. భక్తిని ప్రబోధించడానికి కూడా సాహిత్యమే ఆధారం. అటు సంస్కృత కవులు, ఇటు శివకవుల్లూ భక్తిని సాహిత్యం ద్వారానే ప్రబోధించినారు. తిక్కన కాలంలో శైవ, వైష్ణవ సంప్రదాయాల మధ్య జరిగిన చిచ్చును కొంత వరకు అణచినది సాహిత్యమే గదా! పాలవేకరి కదరీపతి శుకసప్తతి, కొరవిగోపరాజు సింహాసనద్వాత్రింశిక, అనంతామాత్యుని భోజరాజీయ్యము, దూబగుంట నారాయణ కవి పంచతంత్రం వంటి కథాకావ్యాలు నీతిని బోధించడంతో పాటు ఇతర ప్రయోజనాలను కూడా సాధించాయి. నాటి సాంఘిక, ఆర్థిక స్థితిగతులు తెలియాలంటే మనకు ఈ కథా కావ్యాలే ఆధారాలు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో భారత ప్రజలు పరాయి పాలనలో ఉన్నప్పుడు అనేక మంది జాతీయ నాయకులు దేశభక్తులు తమ, ధన, మాన, ప్రాణాలను దేశం కోసం అర్పించినారు. ఆ సమయంలో ప్రజలను అందరినీ ఒకే తాటిపై నడపడానికి ప్రజలలో ఐకమత్యం, దేశభక్తి త్యాగశీలత, నిస్వార్థ సేవా తత్త్వం, రాజకీయ చైతన్యం పురికొల్పడానికి దేశభక్తులెందరో పత్రికలు నడిపారు. ఈ పత్రికలలో సాహిత్యంతో సంబంధం ఉన్న వారే

వ్యాసాలను రచించి ప్రజలను స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనేటట్లు చేశారు. ఈ కాలంలోనే సమాజంలోని మూఢాచారాలను అంధ విశ్వాసాలను, అజ్ఞానం, అమాయకత్వం, నిరక్షరాస్యత మొదలైన వాటిని తొలగించడానికి ప్రజలను ఆర్థిక, రాజకీయ, సాంఘిక రంగాలలో చైతన్యవంతులను చేయడానికి అనేక సంస్థలు ఆశ్రమాలు వెలిసాయి. గాంధీజీచే నడుపబడిన సబర్మతీ ఆశ్రమం ముట్నూరి వారి కృష్ణా పత్రిక, సతీహితబోధిని మొదలైనవి దీనిని బట్టి చూస్తే సామాజిక రాజకీయ రంగాలలో అభివృద్ధి సాధించడానికి కారణం అంతో ఇంతో సాహిత్యంతో సంబంధం ఉన్నవారే అన్నది స్పష్టం. ఈ ప్రయోజనాలను సాధించడంలో సాహిత్యంపై ఆధారపడడం వలన తర్వాతి కాలంలో కూడా సామాజిక వ్యాసాలు వ్రాసినా, సాహిత్యేతర అంశాలపై రచనలు చేసినా అందులో సాహిత్య ప్రభావం ఎంతో కొంత కన్పిస్తుందని చెప్పవచ్చు. అంటే సాహిత్యంతో సంబంధం లేనివారు వ్రాసినా ఈ ప్రభావం ఉన్నదని చెప్పవచ్చు.

సాహిత్యం అనేది మనిషిలోని భావాలు భాష రూపంలో బయటపడి రూపుదిద్దుకుంది. అయితే ఈ సాహిత్యం వినియోగంలో కాలానుగుణంగా కొంత మార్పుకు గురి అయింది. కృష్ణదేవరాయల కాలంలో కళలకు, సంస్కృతికి ఉపయోగ పడితే జాతీయోద్యమ కాలంలో ప్రజలను చైతన్యవంతులను చేయడానికి ఉపయోగపడింది. 20వ శతాబ్ది ఆరంభంలో కందుకూరి గురజాడ వంటి వారి వలన ప్రజలను అంధ విశ్వాసాల నుండి సనాతన సంప్రదాయల నుండి కాపాడటానికి సాహిత్య భాష ప్రధాన పాత్ర వహించింది. సాహిత్యంలో పత్రిక ఒక భాగమై పోయింది. అయితే ఈ పత్రికలను రెండు విధాలుగా ఆధునిక యుగంలో విభజించవలసిన అవసరం ఉన్నది. అది 1) సాహిత్య పత్రిక, 2) సామాజిక పత్రిక. సాహిత్య పత్రికలో సాహిత్య భాష ప్రభావం తప్పని సరిగా ఉంటుంది. కానీ సామాజిక పత్రికలలో కూడా ఈ భాష ప్రభావం ఉండడం విశేషం. దీనికి కారణం భాషాశాస్త్ర కారులు ప్రామాణికంగా ఒక ప్రాంత భాషను నిర్ణయం చేయడమే.

ఆధునిక కాలంలో ముఖ్యంగా నేటి కాలంలో ఈ సాహిత్యం అవసరం ఎంతైనా ఉన్నది. ఎందుకంటే ప్రభుత్వాల వైఖరి, ప్రజల పరాయీకరణ వలన మన సంస్కృతి కనుమరుగయ్యే అవకాశం ఉన్నది. నానాటికీ పెరుగుతున్న సాంకేతిక పరిజ్ఞానం ప్రజలను బద్ధకస్తులను చేస్తుంది. కొన్ని దుష్ట పరిణామాలు యువతను పెడత్రోవ పట్టిస్తున్నాయి. ఇటువంటి సమస్యలను కొన్ని పత్రికలు ప్రజల దృష్టికి తెచ్చి వారిని

సన్మార్గులుగా చేయడానికి ప్రయత్నిస్తున్నాయి. ఈ ప్రయత్నంలో ఈ పత్రికలవారికి సాహిత్యం, భాష ఎంతో తోడ్పాటును అందిస్తున్నాయి.

నగర వాసులకు వాహనాల పొగలు, శబ్దాల వలన ఆరోగ్య పరిస్థితి క్షీణిస్తుంది. కాలుష్యం బారిన పడకుండా ఉండేందుకు కావలసిన మెలకువలను ఈ పత్రికలు వ్యాసాల రూపంలో ప్రచురిస్తున్నాయి. కాలుష్య సమస్యలను ప్రధాన సమస్యగా చిత్రించి పత్రికలు వ్యాసాలను ప్రచురిస్తుంటే మరో పక్క సాహిత్య నిర్మాతలు నవలలు కవితలు రచించి ఈ పత్రికల ద్వారా ఇతోధికంగా సాహిత్య సేవ చేస్తున్నారు. ఈ పత్రికలు ప్రచురిస్తున్న వ్యాసాలలో సాహిత్య ప్రభావం స్పష్టంగా గోచరిస్తుంది.

వరకట్నం నేడు సమాజంలో ప్రజలు ఎదుర్కొనే ఒక ప్రధాన సమస్య. స్త్రీకి పసుపు కుంకుమల నిమిత్తం ఇచ్చే కానుకలు క్రమేణా వరకట్నంగా భయంకర రూపం దాల్చింది. వీటిని నిర్మూలించడానికి సాహిత్య నిర్మాతలు తమ వంతు కృషి నెరపినారు. పత్రికలు ఈ సమస్యల పట్ల మహిళా సంఘాల అధ్యక్షులు, కార్యదర్శులతో జరిగిన ఇంటర్వ్యూలలో వారు వ్యాసాలుగా వీటిని గూర్చి ప్రచురించవలసిన ఆవశ్యకతను గూర్చి చెప్పినారు. వ్యాసం సాహిత్య ప్రక్రియ.ఇది కూడా ప్రయోజనాన్ని సాధిస్తుంది అంటేనే ప్రతి ఒక అంశం మీద సాహిత్య ప్రభావాన్ని గుర్తించవచ్చు. తెలుగు అకాడమీ వంటి సంస్థలు విజ్ఞాన శాస్త్రగ్రంథాలు అనువాదం చేయడానికి తెలుగు భాషా సాహిత్య ఆచార్యులను సంప్రదిస్తున్నారంటే తెలుగు భాషగానీ ఇతర భాషలు గానీ భాషా ప్రాముఖ్యతను గుర్తించాలి. భాషా ప్రాముఖ్యాన్ని ఒక వ్యక్తి గుర్తించాలి అంటే ఆయా భాషల సాహిత్యాధ్యయనం తప్పని సరి.

ఈ సమయంలో నేటి యువతను గూర్చి విద్యార్థుల గురించి వారి వారి సమస్యల పరిష్కారాన్ని గూర్చి సమాజ సమస్యలను గూర్చి తెలియజేయాలంటే భాష తప్పని సరి. అదే సాహిత్య సంబంధిత భాష అయితే తాను చెప్పదలచుకున్న అంశం పరిపూర్ణంగా ఉంటుంది. ఒకనాడు భారతదేశంలో సామాన్య ప్రజలకు ఎన్నికల పట్ల, ఆవ్యవస్థ పట్ల ఏ మాత్రం అవగాహన లేదు. ఈ అవగాహనను కలిగించడంలో ప్రసార ప్రచార సాధనాలకు తోడ్పడింది సాహిత్యమే. అది గేయం కవితా, వ్యాసం ఇత్యాది ప్రక్రియల పరంగా కావచ్చు లేదా ఉపన్యాసాల ద్వారా కావచ్చును. శ్రీశ్రీ 'కాదేదీ కవితకనర్హం'. అన్నారు. ఆవిధంగావే సాహిత్య నిర్మాతలు తమ రచనల పరిధిని చారిత్రక, ఇతిహాస పౌరాణిక రంగాల నుండీ కొంత తప్పించి సామాజిక ఆర్థిక, రాజకీయ రంగాలపై

నిలిపినారు. ఈ విశాల ప్రపంచంలో అవధులు లేనిది సాహిత్యం మాత్రమే. అటువంట సాహిత్యం సాహిత్య ప్రయోజనాలే గాక సాహిత్యేతర ప్రయోజనాలను కూడా సాధిస్తుంది. దీని ద్వారా తన పరిధిని కొంత విశాలం చేసుకునే ప్రయత్నం కూడా కన్పిస్తుంది.

1996 డిసెంబర్ నెల 28, 29లలో ప్రపంచ తెలుగు సమాఖ్య ద్వితీయ మహాసభలు జరిగాయి. దీనిలో భాషా సాహిత్య సదస్సులు ఏర్పాటు చేయబడ్డాయి. దేశ విదేశాల నుండి విద్యావేత్తలు సాహిత్యాభిమానులు ఈ సాహిత్య సదస్సులకు హాజరైనారు. ఇందులో ప్రధాన చర్చనీయాంశం స్వభాషను ప్రజలు విస్మరించి పరభాషలపై మక్కువ చూపడం దీనివల్ల ఆ భాష క్రమేణా అంతరించే ప్రమాదం ఉన్నది. అందువల్ల ప్రభుత్వం నిర్బంధంగానైనా, ప్రజలు ఆరాధించే భక్తి మార్గంలో అయినా భాషను అభివృద్ధి చెందేలా చేయ్యాలన్నది తీర్మానం. ఈ ప్రతిపాదనను బట్టి చూస్తే సాహిత్య భాష భక్తి మార్గంలో ప్రవేశించి నిర్విరామంగా తన పాత్రను నిర్వహించాలి. దాని ద్వారా భాషాభివృద్ధి జరగాలి అనేది స్పష్టం. ఇది సాహిత్యేతర ప్రయోజనం కాదు. కానీ అనుసరిస్తున్న మార్గం సాహిత్యేతరం. ఈ విధంగా సాహిత్యభాష తనను తాను అలాగే తనతోపాటు జనులను సంస్కరించుకుంటుంది. ఈ చర్చ ద్వారా సాహిత్యేతర ప్రయోజనమైనా సాహిత్య ప్రయోజనమైనా సాధించడానికి ఉన్న అన్ని మార్గాలను 'సాహిత్యం, భాష' అనుసరించాలి అనే సందేశం కన్పిస్తుంది.

పై విషయాలన్ని పరిశీలిస్తే సాహిత్యేతర ప్రయోజనాలలో సాహిత్యం, భాష ప్రభావం చూపుతాయని స్పష్టమగు చున్నది. కావున సాహిత్యాన్ని మనం కాపాడుకున్నచో అది మనల్ని కాపాడుతుంది. "భాష మానవాళికి శ్వాస అయితే సాహిత్యం శరీరం" వంటిది. కావున స్వాభిమానం దురభిమానం కాకూడదు. సమాజాన్ని మార్చే శక్తి సాహిత్యానికి భాషకు ఉన్నది. ఈ సామర్థ్యాల వల్లనే సాహ్యితం, భాష సాహిత్యేతర ప్రయోజనాలను సాధించడంలో ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి.

6-6-1431/3, గాంధీనగర్, సికింద్రాబాద్.

# నా కవిత్వం

జి,యస్. ఆనంద్
ఎం.ఏ., ద్వితీయ, పి.జి. కళాశాల

నాలో కదలికలు లేవు
నాలో కవిత్వమూ లేదు
నేనో శిలా విగ్రహాన్ని
శిథిలమై పోతున్న
'మనస్సు' శిలా ఫలకంపై
ఎన్నో అక్షరాలు సంయమనం లేకుండా......
అసలు నేనే శిథిలమైన చరిత్రను
ఆ శిథిలాల మధ్య
నలిగిపోతున్న భావాలు నా కవిత్వం

దేవరకొండ, నల్గొండ

# ఆధునికాంధ్రయుగకర్త గురజాడ

కె.వి. ఉపేందర్ రెడ్డి
ఎం.ఏ. ప్రథమ పి.జి. కళాశాల

ఆధునిక యుగంలో సాహిత్య రంగంలో విప్లవాత్మకమైన మార్పులు తెచ్చిన ఘనత గురజాడ అప్పారావుకు దక్కుతుంది. ఆధునిక యుగంలో మొదటి సారిగా గురజాడ వారు కొత్త పాతల మేలుకలయికతో "ముత్యాల సరాలు" అన్న నూతన ఛంధస్సును ప్రవేశపెట్టి సాహిత్య రంగములో సంచలనం సృష్టించడమే కాక ఆ ఛంధస్సులోనే దేశభక్తి గీతాలు, పూర్ణమ్మ, కన్యక వంటి కావ్యాలు వ్రాసి ఆధునిక యుగ కర్తగా నిలిచారు.

శ్రీ గురజాడ అప్పారావుగారు 1862 సెప్టెంబర్ 21వ తేదీన విశాఖ జిల్లా రామవరం గ్రామంలో జన్మించారు: ఇంతటి మహనీయున్ని కన్న ఫలం వెంకట రామదాసు, కౌసల్యమ్మ అను పుణ్య దంపతులకు దక్కింది.

పువ్వు పుట్టగానే పరిమళించు అన్న సామెత గురజాడ వారికి సరిగ్గా వర్తిస్తుంది. గురజాడ వారు హైస్కూలు దశలోనే శ్లోకాలు రాసేవారట మెట్రిక్యులేషన్ చదువు తున్నపుడే అనగా 1882లోనే "కుక్క" అనే ఇంగ్లీషు పద్యం వ్రాసినట్లు తెలుస్తుంది. కాని ప్రస్తుతము అది అలభ్యం.

ఆది కవి నన్నయ నుండి మొదలుకొని గురజాడ సాహిత్య రంగం మీదకు వచ్చే వరకు అనగా 19వ శతాబ్దము వరకు తెలుగు సాహిత్యప్రక్రియలన్ని కొత్త సీసాలో పాత సారా మాదిరిగానే వున్నాయి. 19వ శతాబ్దము వరకు వచ్చిన కావ్యాలు, ప్రబంధాలు, ఇతిహాసాలు ఇలా ప్రక్రియ ఏదైనా వాటిల్లో రాజులు వారి అవసరాలు, నమ్మకాలు, అభిరుచులు అప్పటి నాగరికతలే ప్రతిఫలించాయి. 19వ శతాబ్దం వరకు వచ్చిన సాహిత్య ప్రక్రియల్లో వేటిలోను సామాన్య మానవుని ప్రసక్తి కనిపించడం లేదు. ఇలా 11వ శతాబ్దం నుండి 19వ శతాబ్దం వరకు 8 శతాబ్దాల పాటు తక్కువ మార్పులకు లోను అవుతూ తెలుగు సాహిత్యం ఒక రకంగా చలన రహితంగా ఉండిపోయింది. గురజాడ వారు భాషలోను, భావం లోను, ఛందస్సులోను నూతన ఒరవడులను తీసుకువచ్చి తర్వాతి తరంవారికి మార్గ దర్శకుడు అయ్యారు.

గురజాడ వారు సృష్టించిన ముత్యాల సరాలు ఛందస్సుకు సామాన్య ప్రజానీకంలో ప్రచారంలో నున్న 'గుమ్మడేడె గోపితల్లి' అన్న బాణి ఆధారం. గురజాడ వారి రచనలన్ని

ఒక ఎత్తైతే వారి కన్యాశుల్కం నాటకం మరొక ఎత్తువుతుంది. గురజాడ కాలం నాటికి సమాజంలో బాల్య వివాహాలు విపరీతంగా వుండేవి వాటి వల్ల వచ్చే అనర్థాలను, కష్టాలను ఈ నాటకంలో కళ్లకు కట్టినట్లు వర్ణించారు. ఈ నాటకం 1892 ఆగస్టులో తొలిసారిగా ప్రదర్శింపబడింది. ఈ నాటకంలోని భాష పూర్తిగా వాడుక భాష. కన్యాశుల్కం ప్రదర్శన జరిగిన రోజు తెలుగు సాహిత్యంలో ఒక విప్లవాత్మకమైన మార్పు వచ్చిన రోజుగా చెప్పకోవచ్చు ఆనాడు ప్రాచీన కావ్య పద్ధతులకది వీడ్కోలు పలికిన శుభదినం.

కన్యా శుల్కం ఆధునిక తెలుగు సాహిత్యానికి నాందిగా పరిగణించవచ్చు ఇది గురజాడ వారి మొదటి రచన కూడా. ఆ రోజుల్లో విజయనగర మహరాజైన ఆనంద గజపతితో గురజాడ వారికి పరిచయమైంది. ఆనంద గజపతి విశాఖ మండలంలో జరుగుతున్న కన్యాశుల్క వివాహాల వివరాలను సేకరించారు. కడుపులో వున్న బిడ్డల్ని సైతం కొనడానికి (ఆ పుట్టే బిడ్డ ఆడపిల్ల అవుతుందో అవదో తెలియకున్నా) బేరసారాలు సాగడము లాంటి దారుణమైన సంఘటనలు వెలుగులోకి వచ్చాయి. ఇలాంటి నాటి సమాజంలోని వాస్తవ సంఘటలనే కన్యాశుల్కం వ్రాయడానికి ప్రేరణ "మన మహిళా లోకంలోని ఎంతో నిస్సహయులైన ఒక భాగంలోని వారిని సాంఘిక అవినీతి క్రిములతో నిండిన దుర్భర దాస్యం నుండి కాపాడడానికి" ఆనంద గజపతి పాటు పడుతున్నాడని గురజాడ తెలిపారు.

అలా వారు స్థానికంగా జరుగుతున్న సంఘటనలు తీసుకొని రచనలు చేయాలని సంకల్పించాడు. ఆయన రచనలో ముఖ్యంగా సమాజాన్ని అప్రతిష్టపాలు చేసే పరిస్థితిని కళ్ళ ముందర పెట్టి నైతిక భావాల ఉన్నత ప్రమాణాల్ని ప్రాచుర్యానికి తేవడం కంటే ఉత్తమమైన కార్యమేది ఉండదని భావించి, ప్రజా బాహుళ్యములో చదవడం అలవాటు అయ్యే వరకు కావ్యభాష కంటే ప్రజలకు బాగా హత్తుకు పోయే వాడుక భాషలో వ్రాసి సాంఘిక సమస్యలు రూపుమాపి సాహిత్యాన్ని ప్రజలకు దగ్గరగా తీసుకు పోవడం వల్లే ఆయనను ఆధునిక సాహిత్య యుగ కర్తను చేసారు.

గురజాడ ఇతర రచనలు గూడా సమాజంలో సాంఘిక అవినీతితో కూడిన దుర్భర దాస్యం నుండి మహిళలను కాపాడి సమాజాన్ని అప్రతిష్టపాలు చేసే సంఘటలను కళ్ళ ఎదుట కనపడేటట్లు వ్రాసారు.

గురజాడ తమ పూర్ణమ్మ గేయంలో
"కాసుకు లోనై తల్లీ దండ్రీ
నెనరు న్యాయం విడనాడి
పుత్తడి బొమ్మను పూర్ణమ్మను వోక
ముదుసలి మొగుడుకు ముడి వేస్రీ"

అని ఆనాటి సమాజంలో కన్న కూతురును డబ్బు కొరకు ఒక వృద్ధునికి ఎలా కట్టబెట్టారో చక్కగా వివరించారు.

'మలిన చిత్తులకు' అగ్రకులాలు "మలిన వృత్తులకు" నీచ కులాలు విధించిన వర్ణ ధర్మం అధర్మ ధర్మం అందు చేత మంచి అన్నది మాల యైతే మాల నేనగుదున్ అని "లవణ రాజు కల"లో ఆనాటి కులాచార వ్యవస్థను కన్నులకు కట్టినట్లు చూపించారు.

స్త్రీలు ఆత్మ రక్షణ కోసం ఎలా తిరుగుబాటు చేసింది ఒక "కన్యక"లో చూపిస్తారు.

కవిత్వం అనేది దేశంపై అభిమానాన్ని రేకిత్తించేదిగా ఉండాలని కొత్త కోణంలో
దేశమంట్టే మట్టికాదోయ్
దేశమంట్టే మనుషులోయ్"

అని స్వలాభం అనేది కొంతవరకు మానుకొని నీ తోటివారికి కొంతయైన మేలు చేయమని "దేశభక్తి" గేయంలో దేశపౌరులు ఎలా ఉండవలెనో సూచించారు.

దేశానికి, దేశంలో ఉండే ప్రజలకు మేలు జేయడానికి భాషా సాహిత్యాలు అందరికీ తెలిసేవిగా ఉండాలని అర్థం.

అదేరీతిగా వాస్తవ జీవితానికి సంబంధించి మంచిని పెంచేదిగా ఉండాలని ఈ విధంగా భాషాసాహిత్యాలు సమాజ శ్రేయస్సుకు ఉపయోగ పడాలని ఆయన ఆశయం.

భాషా సాహిత్యాల విషయంలోనే కాదు. అన్ని విషయాలలో సమాజ శ్రేయస్సే ముఖ్య లక్ష్యం. అని కన్యాశుల్కం ద్వారా వ్యవహరిక భాషకు, ఉత్తమ సాహిత్య స్థానం ప్రయుక్తమయ్యేటట్లు కలిగించి పీఠికల్లోను, వ్యాసాలల్లోను "గిడుగు" సాగించిన వ్యవహారిక భాషోద్యమానికి అంకురార్పణ చేసి, ఆవాదానికి వ్యూహ కల్పన చేసిన ఘనత గురజాడ అప్పారావు గారిదే.

ఈ విధంగా గురజాడ తెలుగు సాహిత్యానికి సమాజానికి ఎనలేని సేవచేసి తాను నమ్మిన సిద్ధాంతాల కొరకు తన శాయ శక్తులా కృషి చేసి తెలుగు ప్రజల గుండెల్లో జీవిస్తూ ఆధునిక సాహిత్యానికి యుగ కర్తగా మన ముందు నిలిచారు.

---

ఇనుపాముల, కేతేపల్లి, నల్గొండ,

# సుమాంజలి

ఎం. అశోక్ కుమార్
ఎం.ఏ., ద్వితీయ, పి.జి. కళాశాల

తల్లీ సరస్వతి
నీ ఘనమైన చరిత్ర చూసి
నా మదిలో రేగే
అల్లకల్లోలాలకు
ఆకారమిచ్చి నీ పాదధూళి
అవుదామనుకుంటా....
నా భావాలను గంగాజలం చేసి
నీ పాదాల మీదుగా
ప్రవహించాలనుకుంటా
ఆ భావాలను అక్షర పుష్పాలు చేసి
నీ పాదపూజ చేసుకుని
ఈ సాహిత్య వనంలో
సంచరించాలనుకుంటా.... కానీ,
కారు చీకట్లో సమాధులైన
నా భావాలపై
ప్రమిదలు పెట్టినపుడు
ఆ వెలుతురులో
నిను సేవించుకుంటా!

యమ్. అశోక్ కుమార్, కేరాఫ్. ఎస్సార్వో ఆరెమ్మెస్, నల్గొండ.

# నీతో ఒక్క క్షణం....

మువ్వపూడి లక్ష్మీనరసింహం

..... నిద్దర్రావటం లేదు. పుట్టి అప్పుడే పాతికేళ్ళైనందుకు దు:ఖంగా వుంది. స్థిరత్వలాలస కల్లోకి కూడా వొచ్చి సతాయిస్తోంది. గోడల మధ్య పెరిగిన జీవితాన్ని కళ్ళల్లో పెట్టుకు కాపాడుకుంటున్నా ఎక్కడ భళ్ళున పగిలి, నేర్చుకున్న నాలుగక్షరమ్ముక్కల తోటే అతికించుకోమ్మంటుందేమోనన్న భయం అనుక్షణం దాడి చేస్తూ నన్నోడించి, లొంగదీసి ఎప్పుడూ రెండడుగుల వెనక్కి వున్న గుంజకి కట్టేసి వుంచుతోంది.

యూనివర్సిటిలోకొచ్చి పడ్డాక సాహస వీచికా పరిమళాల నాస్వాదించే ప్రమాద భరిత సన్నివేశాలనించి ప్రతి ఒక్కరూ తమని తాము రక్షించుకుంటూ బాధ్యతారాహిత్యానికండగా సశస్త్రధారులుగా నిలబడుతున్నారు. ప్రతి సమూహమూ పరుగెత్తి పరుగెత్తి ఒక్కరితో అదృశ్యమై పోతోంది. నలుగురు నడిచిన జాడలే లేవు. ఎగిరే జెండాల వంక సావకాశంగా చూసే తీరిక లేనందుకు మేం కొంచెం సిగ్గుపడుతూనే, రంగు రంగుల ఊహా ప్రపంచపు సౌష్ఠవ స్పర్శలలో నిన్నటికీ ఇవాల్టికీ వున్న తేడాలను శాస్త్రీయంగా అంచనా వేసేందుకు గ్రూపు డిస్కషన్స్ జరుపుతున్నాం.

చాలా రోజులైంది నిన్ను చూసి, చదివిన మంచి పుస్తకాన్నల్లా రంగరించుకున్న ఉత్తమ మానుషత్వానివి. భావతీవ్రత గొంతుకడ్డంపడి నేనుక్కిరి బిక్కిరైనప్పుడు సముదాయించిన ప్రాణధారవి. అందం అవిచ్ఛిన్న సజీవ ప్రాతిపదికనగాక, అనాగరిక పద్ధతిని నిర్వచింపబడుతున్న దిక్కుమాలిన రాజ్యంలో, సౌందర్య దృష్టి మంచిది కాదన్నది మనసులో ఉండబట్టి కానీ, నువ్వు పూర్వ మేఘంలో యక్షుడు చెప్పని అపురూప ద్వీప కావ్యానివి.

కాలేజీల్లో చదువో, 'సంధ్యో' తెల్చుకుందామని వొచ్చిన వీరాభిమన్యులంతా ర్యాంకుల్ని ఎగేసుకొచ్చిన వాళ్ళే. విషాదమల్లా పద్మ వ్యూహంలో నెగ్గటానికి మానవాత్మని వ్యాపార బాంధవ్యాలకు పాద సేవికగా యావజ్జీవితం తాకట్టు పెట్టవలసి రావడమే.

మిగతా అంతా మామూలే. ప్రపంచం తనదారిన తాను పోతూవుంటే! ఓర్వలేక నేనూ, ఇంకొంతమంది రాళ్ళు విసురుతున్నా పెద్దగా మార్పేం లేదు. దూరాభారమైనా ఎప్పుడో అప్పుడు నీ దగ్గరికి చెప్పాపెట్టకుండా వొచ్చేస్తాను. వ్యక్తిత్వంలోంచి రాజుకున్న ఆప్తురాలివి. మందస్మిత వ. ంలో సహచరులని వెలిగించుకున్న సౌహార్దానివి. స్వార్థ మనుకున్నా సరే. నన్ను కొంచెం కనిపెట్టుకుని వుండు.

ఇం.నెం. 1-5-28, బ్రాహ్మణవాడ, సంగారెడ్డి - 502 001. మెదక్ - జిల్లా

# కర్తవ్య నిర్వహణలో సాహిత్య ప్రేరణం

రా. పద్మజ రాణి
ఎం.ఏ., ద్వితీయ, మహిళా కళాశాల

సృష్టికర్త తాను నిర్మించిన ప్రపంచంలో పశు పక్ష్యాదులు, జంతువులు, మానవులు ఉన్నా వాటి మధ్య కొంత భేదాన్ని కొంత సాదృశ్యాన్ని కల్పించాడు. ఈశ్వరుని సృజ్యమగు ప్రకృతిని, సృష్టి విశిష్టమగు జీవ సమిష్టిని, సృష్టి వైచిత్ర్య కారణాలను ఆలోచించే శక్తి, యోగ్యత మానవునికి తప్ప అన్య జీవులకు లేవు. అట్టి ఆలోచనా శక్తిని ఉపయోగించి సృష్టి రహస్యాన్ని తెలుసుకున్న మానవుడు ఉత్తమ మార్గంలో పయనిస్తాడు.

"ఆహార నిద్రాభయమైథునాని
సామాన్యమేతత్పశుభిర్నరాణామ్
"ధర్మోహి" తేషామధికో విశేషో
ధర్మేనహీనా : పశుభిస్సమానా:"

ఆహారము, నిద్రా, భయము, సంభోగం మానవులకు, పశువులకు సమానంగా ఉన్నాయి. కాని భగవంతుడు మానవునికి "జ్ఞానము" అనే శక్తి నిచ్చాడు. ఈ విశేషమును తెలిపే వివేకము ఉంటేనే "మనిషి"అవుతాడు.

దైవీ గుణాల వలన మానవుడు ఆత్మశక్తి కలిగి పవిత్రుడౌతాడు. అవి దు:ఖాలను పారద్రోలి శాశ్వత ఆనందాన్ని ప్రసాదిస్తాయి.

ఈ శరీరము సడలి నశించిపోతుంది. కానీ అందులో ఉండే ఆత్మ మాత్రం పవిత్రాతి పవిత్రంగా, శాశ్వతంగా ఉంటుంది. ఆత్మ ఎల్లప్పుడు శరీరాన్ని పవిత్రంగా ఉంచడానికే ప్రయత్నిస్తుంది. కాని గత జన్మ కర్మ ఫలితం వలన అంత: కరణేంద్రియాలు ఈ ప్రయత్నాన్ని సాగనీయవు. కర్మ పరిపక్వమయినపుడు జీవాత్మ పరమాత్మను చేరుతుంది. కర్మ పరిపక్వం కావాలంటే మొదట నిన్ను నవ్వు అర్థం చేసుకోవాలి. తరువాత నీ కర్తవ్యాన్ని పాటించాలి. అపుడే సృష్టి రహస్యాన్ని అర్థం చేసుకోగలవు. చివరికి

"నిన్న నేను నన్ను కన్న
నేడు నేను నిన్ను కన్న
నన్ను నిన్ను కన్న నేను
నేడు నిన్ను చేరుకున్న"

అంటూ జీవాత్మ పరమాత్మను చేరుతుంది. కాబట్టి మొదట నిన్ను నీవు అర్థం చేసుకున్నప్పుడే పరమాత్మను చేరుతావు.

మానవునికి "భయము" శత్రువు వంటిది. ప్రతివాడు నిర్భయంగా ఉండాలి. అదే అతనికి స్థిరబుద్ధిని కల్పించి ఆత్మశక్తిని ప్రసాదిస్తుంది.

"తమేవ విద్వాన్ నబిభాయమృత్యోః"

తనలోని ఆత్మను తెలుసుకుంటే మృత్యు భయముండదు. ఆత్మ జ్ఞానం లేని జీవితమొకజీవితమా! నీవాత్మను కనుగొంటివా ప్రతీది నీ వశమవు తుంది. సుఖ దుంఖములకు కారణాలైన విషయ వాంఛలను విడవాలి. ఇహ పరలోక సంబంధాలపై విసుగు చెందితేనే గాని పారమార్థిక ప్రగతిలో ప్రవేశించుటకు వీలు లేదు. మన ఇంద్రియాలు బాహ్య ప్రపంచాన్ని చూడడానికి భగవంతుడు సృష్టించినాడు. కాబట్టి ఆత్మ సాక్షాత్కారాన్ని కోరువాడు దృష్టిని లోపలకు పోనిచ్చి ఆత్మను ఏకధ్యానంతో చూడాలి. ప్రపంచంలో రెండు రకాల వస్తువులున్నాయి. ఒకటి "మంచిది", రెండవది "సంతోషకరమైనది" బుద్ధి ఉన్నవాడు మొదటి దానిని, లేనివాడు రెండవదానిని కోరుకొంటాడు.

శరీరము రథం, ఆత్మదాని యజమాని, బుద్ధి సారథి మనస్సు కళ్ళెం, ఇంద్రియాలు గుఱ్రాలు, ఇంద్రియ విషయాలు వాటి మార్గాలు "పురుషుడు" శరీర రూపమయిన రథానికి కూర్చబడిన ఇంద్రియాలనే అశ్వాలను తన అధీనంలో ఉంచుకొని నియమిత ధర్మ మార్గంలో నడిపిస్తాడు (ఇచట పురుషుడంటే ఆత్మే తప్ప లింగ వాచకం కాదు). ఇలాంటి సామర్థ్యం అన్ని ప్రాణులలో ఒక్క మానవులకు మాత్రమే ప్రత్యేకంగా ఉంది. కాబట్టి దీనిని గుర్తించి ఇంద్రియాలను అశ్వాలను ఎల్లప్పుడు అదుపులో ఉంచుకొనకున్నచో అవి శరీరమనే రథాన్ని పతనమొందింపక మానవు కాబట్టి వీటిపై ఎల్లప్పుడు జాగ్రత్త వహించి శాస్త్ర సమ్మత కార్యాలలో ఆసక్తి కలిగి ఉండాలి. తాబేలు వలె ఇంద్రియాలను యదేచ్ఛగా ముడుచుకోవాలి. అంతర్ముఖులై ఉండాలి.

మానవత్వం పొందడానికి కపటం లేని మనస్సుఉండాలి. తలచునది ఒకటి, చెప్పునది ఒకటి, చేయునది వేరొకటి ఉండని గుణాలు కావాలి.

"భద్రం భద్రం క్రతుమస్మాసు దేహి"

ఎల్లప్పుడు శుభ సంకల్పాలకే చోటివ్వాలి. హృదయాన్ని స్వచ్ఛంగా రూపొందించుకోవాలి. స్వచ్ఛమైన హృదయం ఉన్నవాడు ఎల్లవేళల యదార్థత కనపరుస్తాడు. అసూయ, ద్వేషాలు, లేనివాడయి, సంతృప్తి, శాంతి పొందుతాడు.

"సత్యమేదో తెలియజేసి
నిత్యమునను దాని వెంట
నడచునట్లు చేసి నాకు
నీవు ముక్తి కలుగజేయి"

అంటూ ప్రతి ఒక్కరు సత్యాన్ని తెలుసుకోడానికి ఉత్సుకతో ఉండి దానిని అనుసరిస్తూ ఉండాలి.

"అహమ నృతాత్సత్యముపైమి"

ఈ భావములతో మన హృదయం నిర్మలముగా ఉంచడానికి ప్రయత్నించాలి.

ఓ మానవాత్మా! నీవు మాయా బంధనాలలో ఇంకెన్నాల్లు కొట్టుమిట్టాడు తావు లే! నీవు నేనను భేదాలు కల్పించి జీవితాన్ని దు:ఖమయంగా చేసే అజ్ఞాన తెరను చించివేయాలి. నిన్ను నీవు తెలుసుకొను వరకు కాల కర్మ కారణ పాశము సుండి విడివడుటకు వీలులేదు. హృదయాంతరాళంలో ఉన్న సద్గురుని దర్శించడమే బంధ విమోచనానికి దారి అవుతుంది. నీ చుట్టూ ఉన్న చీకటిని సద్గురుని నామమనే దీపంతో పారద్రోలాలి

"స్వాతి చినుకు కొరకు వేచి
యుండు పక్షి వలెను నేను
నీదు కరుణ రసపు చూపు
జల్లు కొరకు వేచి యుంటి"

అంటూ సద్గురు కటాక్షానికై వేంచి ఉండు. సద్గురుని కటాక్షం పొందుదువా! నీవు దాటలేని భవ సాగరం లేదు.

ఆత్మకు సహజమైన తేజస్సు కలదు. అది ఏ శరీరాన్ని ఆవరించి ఉంటుందో దాని మన: ప్రవృత్తులను అనుసరించి మార్పు చెందుతూ ఉంటుంది. దాని తేజస్సు వృద్ధి కావడానికి, క్షీణించడానికి మనలోని మానసిక ప్రవృత్తే కారణం. అందువలన మన విచారాలు, ఆచారాలు ఉత్తమంగా తీర్చిదిద్దుకోవాలి.

హృదయంలో "తస్యమధ్యే మహానగ్నిరిశ్వార్చిర్విశ్వతో ముఖ:" ప్రపంచమంతా విశ్వతో ముఖంగా వ్యాపించి, ప్రపంచాన్నంతా వెలిగింప చేసే తేజస్సు దానికి ఉంటుంది.

"ప్రథమమ్ శ్రవణం కృత్వాద్వితీయే మననం తథా .

నిధి ధ్యాసను కంపశ్యాత్ సాక్షాత్కారస్తథా భవేత్" (కపిల:)

శ్రవణంచే సంశయ భావనం, మననంచే అసంభావనం నిధిధ్యాసనం చేత విపరీత భావనం అను ప్రతిబంధక త్రయమును నివర్తించి, నిశ్చలమైన దేహాత్మ భావనవలె, నిశ్చల పరమాత్మ జ్ఞానం పరోక్షంగా అవగతమగునని తెలుస్తుంది. అంతేగాక గురునిజేరి స్మరణ చేసి ఆత్మ సాక్షాత్కారాన్ని పొందడానికి సిద్ధం కమ్ము. సర్వ భూతాల అంతరాత్మయగు సత్య స్వరూపుని స్వానుభవంతో కనుగొని విశ్వకరుని చేరే వరకు పట్టు వీడకు.

"విశ్వ కరుని కొరకు నేను
విశ్వమంత తిరుగు చుంటి
విశ్వమందు కనని నేను
విశ్వమయుని చేరుకుంటి"

అంటూ విశ్వకరుని వెదుకుతూ విశ్వమయుని చేరుతావు

ఇం.నె. 17-1-30/8/4, ఈది బజార్, హైదరాబాద్ - 23.

# పత్రికల్లో సాహిత్యం - సందేశం

తిరుమల గిరి శైలజ
ఎం.ఏ., ద్వితీయ, మహిళా కళాశాల

పుస్తకం హస్త భూషణం అనునది ఆర్యోక్తి పుస్తకం మంచి మిత్రుని వంటిది కూడానని విమర్శకులు గుర్తించారు. మంచి అలవాట్లలలో పుస్తక పఠనం కూడా ఒకటి. నేడు సాహిత్య సంబంధమైన గ్రంథాలు. ప్రాచీన కావ్యే తిహాస ప్రబంధాలను కేవలం సాహిత్యంతో పరిచయం ఉన్న ఏ కొద్ది మందో చదువుతున్నారు. నవలలు పత్రికలు ఈ రోజుల్లో బహుళ ప్రజాదరణ పొందుతున్నాయి. పత్రికలు వార, పక్ష, మాస, పత్రికలుగా వివిధ పేర్లతో వ్యావహారిక భాషలో వెలువడుతున్నాయి.

ఆంగ్ల విద్యా విధానం ప్రభావం వలన అనేక ఆంగ్ల సాహిత్య ప్రక్రియలు తెలుగు సాహిత్యంలో చోటు చేసుకున్నాయి. అట్టి సమయంలో ఉద్భవించినదే పత్రిక. ప్రారంభములో వెలువడిన పత్రికలు భాషా సారస్వత వివాదములకు ఉపకరించెడివిగా ఉండేవి. క్రమంగాకల్పలత వంటి సాహిత్య పత్రికలు బయలుదేరి ఖండ కావ్యాలు మొదలైన నూత్న ప్రక్రియలను ప్రోత్సహించాయి. వీరేశలింగం పంతులుగారు స్థాపించిన "వివేక వర్ధిని" "సతీహిత బోధిని" "సత్య సంవర్ధిని" మొదలైన పత్రికలు విజ్ఞాన వ్యాప్తికి, స్త్రీ విద్యా వ్యాప్తికి, మూఢాచారాల నిర్మూలనకు పాటు పడినాయి. వీటిని బట్టి ఆనాటి పత్రికలు సంఘ సాహిత్య సంస్కరణకు ఎంతగా పాటుపడినవో స్పష్టంగా తెలియుచున్నది.

ప్రస్తుతం వెలువడుతున్న పత్రికలు నాటి పత్రికలకు పూర్తిగా భిన్నంగా ఉంటున్నాయి. ఇవి పూర్తిగా వ్యాపార దృష్టితో వెలువడుతున్నాయి. వీటిలో ఉన్నత ప్రమాణాలు నానాటికి కొరవడుతున్నాయి. ఈ పత్రికలలో తొంభై శాతం సినిమాలకు సంబంధించిన అంశాలకే ప్రాధాన్యమివ్వబడుతుంది. ప్రతి పేజీలో ఇద్దరు లేక ముగ్గురు తెలుగు, హిందీ, సినీ తారల ఫోటోలు వారిపై ఏవో నీలి వార్తలు(గాసిప్స్) నటీనటులతో ముఖాముఖీలు సినీ క్విజ్‌లు, విడుదల కాబోతున్న చిత్రాల షూటింగ్‌ల వివరాలు తమ మాటలు తాము చెప్పుకోలేని కీలు బొమ్మల్లాంటి నేటి నటీ, నటులపై ప్రత్యేక వ్యాసాలు, ధారావాహిక కథలు మొదలైనవి ఎన్నో సినిమాలకు సంబంధించిన విషయాలే ముప్పావు

పుస్తకాన్ని ఆక్రమిస్తున్నాయి. కాలక్షేపానికి చూసి మరచిపోయే చలన చిత్రాలకు పత్రికలు ఇంతగా ప్రాముఖ్యాన్నివ్వడం ఏ మాత్రం సమంజసం కాదు. ఇక వ్యాసాల విషయానికి వస్తే వాటి శీర్షికల పేర్లు చదివితేనే అవి ఎంత తక్కువ స్థాయిలో ఉన్నాయో తెలుస్తుంది. ఉదా "మీ బాయ్ ఫ్రెండ్ ఎలా ఉండాలి - ఉండకూడదు "మీ గర్ల్ ఫ్రెండ్ మీరు చెప్పిన మాట వింటుందా" "మీరూ - మీ దాంపత్య జీవితం" ఈ విధమైన వ్యాసాలు యువతరానికి ఎటువంటి చైతన్యాన్ని కలిగించగలవు? నైతిక పతనానికి గురి అవుతారే తప్ప వీటి వలన ఎటువంటి లాభం లేదు. క్రమంగా ఈ సినిమా జాడ్యం దిన పత్రికలకు కూడా వ్యాపించినది.

కథలు సీరియల్స్ కూడా వ్యాసాల వలనే ఉంటున్నాయి. వీటిలోని ఇతి వృత్తాలు సామాజిక స్పృహను కలిగించవు. పైగా "ఈ వారం కథ" "పెద్దలకు మాత్రమే" కథల పేరిట తుచ్ఛమైన శృంగారాన్ని వర్ణించే కథలను ప్రచురిస్తున్నారు. కథలకు సీరియల్స్‌కు ముద్రించే బొమ్మలు అశ్లీమైన సినిమా వాల్ పోస్టర్లకు ఏ మాత్రం తీసిపోని విధంగా ఉంటున్నాయి. పండుగల సందర్భంగా ప్రచురింపబడే ప్రత్యేక కార్టున్ సంచికలలోని కార్టున్స్‌లో మన సంప్రదాయాలను, వేడుకలను అపహాస్యం పాలు చేసే విధంగా ఉంటున్నాయి.

ఈనాటి సినీదర్శకుల వలెనే నేటి వార, పక్ష, మాస పత్రికా సంపాదకులు కూడా స్త్రీని పూర్తిగా గ్లామర్ దృష్టితోనే చూస్తున్నారు మహిళలకై ప్రత్యేకించి ప్రచురించే వ్యాసాలు అందానికి, అలంకరణలకు సంబంధించినవి మాత్రమే అవుతున్నాయి. ఉదాహరణకు "పది మంది మెచ్చే మీ డ్రెస్సెస్" "ముఖానికి తగిన కేశాలంకరణ" "చర్మ సౌందర్యానికి చిట్కాలు" ఇలాంటి వ్యాసాలు నిత్యం ఎన్నో సమస్యలకు, అత్యాచారాలకు గురి అవుతున్న నేటి సమజాంలోని వనితలకు ఏ విధంగాను ఉపయోగపడవు. మహిళలకు విజ్ఞానంతో పాటు వారికి మానసిక స్థైర్యాన్ని కలిగించే వ్యాసాలు వెలువడాలి.

నేడు దిన పత్రికలు మొదలుకొని మాస పత్రికల వరకు అన్నింటా వ్యావహారిక భాషను వాడుతున్నారు. మాండలిక భాష సరే సరి. కాని గ్రామ్యములు, అపశబ్ధాలు వ్రాసి వ్యావహారిక భాష అనడం మంచిది కాదు. ఉదాహరణకు "పాఠము"కు పాటము "వాళ్ళు"కు బదులుగా "వాల్లు" ఇత్యాదులు. అంతేకాక ఇంగ్లీషు పదాల అనువాదంలో

కూడా తెలుగు దనం లోపిస్తుంది 'రైల్వే స్టేషన్ ''ఏయిర్ పోర్ట్' మొదలైన ఎన్నో ఆంగ్ల పదాలను యథావిధిగానే వాడుతున్నారు.

మన భారత దేశం అభివృద్ధి చెందుతున్న దేశం దేశాభివృద్ధికి యువతరం ఎంతగానో కృషి చేయవలసి ఉంది అందుకు వారికి రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంకేతిక పరమైన అనేక విషయాల గురించి సమగ్రంగా తెలిసి ఉండాలి. వీటి కోసం కేవలం పాఠ్యాంశాలు దిన పత్రికలే కాకుండా వార, పక్ష, మాసపత్రికలు కూడా కొంత సమాచారం అందించాలి. పత్రికలు మన సాహిత్యం గురించి ఎన్నో విషయాలు తెలియజేయాలి. మన సంస్కృతి పట్ల పాఠకులకు చక్కని అవగాహన కలిగించాలి. కాని నేటి సంపాదకుల వ్యాపార ధోరణి కారణంగా సినిమా కబుర్లు, పెద్దలు మాత్రమే చదవ వలసిన కథలతో, అశ్లీలమైన చిత్రాలతో కూడుకొన్న వార పక్ష మాస పత్రికలు వెలువడుతున్నాయి. ఇవి యుక్త వయస్సులో ఉన్న వారి చేతుల్లో కనబడితే తల్లిదండ్రులు భయపడవలసిన దుస్థితి నేటి పత్రికలను ఆవరించినది. దీనిని బట్టి పత్రికలు పోషిస్తున్న సాహిత్యం ఏమిటి. అవి పాఠకులకు అందిస్తున్న సందేశం ఏమిటనే ప్రశ్న ఉదయిస్తుంది.

గంజాయి వనంలో తులసి మొక్కల్లా ఏవో ఒకటి రెండు పత్రికలుమాత్రమే ఉన్నత ప్రమాణాలతో వెలువడుతున్నాయి. వీటిలో సాహిత్య వ్యాసాలు ప్రచురింపబడుతున్నాయి. ఇది సంతోషింపదగిన విషయమే. కాని వీటిని చదివే పాఠకులు చాల తక్కువ ఎందుకనగా మంచి విషయాలకన్న చెడు విషయాలే ఎక్కువ ఆకర్షిస్తాయి. కావున పత్రికలను సంస్కరింప వలసిన సమయం ఆసన్నమైనది. పూర్వం భారతి పత్రిక వంటి ఉన్నత ప్రమాణాలతో కూడుకొన్న పత్రికలు నేడు లేకపోవడం విచారింపదగిన విషయం.

క్షీణ ప్రబంధ యుగంలో వెలువడిన తుచ్ఛమైన సాహిత్యంపైన ధ్వజమెత్తి నాటి సాహిత్యాన్ని సంస్కరించిన కందుకూరి వీరేశలింగంపంతులు గారిని ఆదర్శంగా తీసుకొని నేటి పత్రికల వైఖరిని నిరసిస్తూ వాటిని సంస్కరించే విషయమై తెలుగు విద్యార్థులంతా కంకణ బద్ధులు కావాలి. తెలుగు సాహితీ వేత్తలందరూ ఒకసారి ఆలోచించాలి.

---

ఇం.నెం. 2-3-76/ఇ, గోల్‌నాక, అంబర్ పేట్ రోడ్, హైద్రాబాద్ -13.

